# The
# Andhra Pradesh Legislative Assembly
# Debates

[*Part II-Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

**50th day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly**

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the 24th March 1958*

The House met at Half Past Eight of the Clock.

[ *Mr. Speaker in the Chair* ]

## QUESTIONS AND ANSWERS

( *See Part I* )

## BUSINESS OF THE HOUSE

శ్రీ బసవమానయ్య (అందోలు) :- 74వ రూలు క్రింద ఈ నెల 14వ తేదీన నేనొక తీర్మానమిచ్చాను. దానినిగురించి ఏమైనా చెబుతారా ?

మిస్టర్ స్పీకర్ .- నేను ఈ విషయము పరిశీలించాను. శ్రీ బసవమానయ్యగారిచ్చిన తీర్మానం డిజ్ఎలవ్ చేస్తున్నాను. It is a question relating to one individual.

శ్రీ బసవమానయ్య :- నేనిచ్చిన తీర్మానమును చదివి సభవారికి వినిపించ గోరుతాను.

మిస్టర్ స్పీకర్ :- దా[illegible]వలసిన ఆవశ్యకత నాకైలేదు. ఆ తీర్మానమును డిజ్ఎలవ్ చేస్తున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం): On a point of information, Sir, ఇప్పుడు (రాజ్యసభకు) జరుగుతున్న ఎన్నికలలో, అధ్యక్షులవారు ఓటు వేయుట జరిగిందా ? అట్లు జరగవచ్చునా ?

మిస్టర్ స్పీకర్ :- జరగవచ్చును. నేను ఆ పార్టీనుంచి రిజైన్ చేయలేదు. కనుక నా యిష్టముచొప్పున వోట్ ఇవ్వవచ్చును.

ఆర్థికమంత్రి (డాక్టర్ బి. గోపాలరెడ్డి) :- ఏమైనప్పటికీ అసెంబ్లీ సభ్యులు కాబట్టి ఇవ్వవచ్చును. As a member of the Assembly, you are entitled to vote.

మిస్టర్ స్పీకర్ :- ఆలోచిస్తాను

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) :- అధ్యక్షులు నిష్పక్షపాతంగా ఉండాలి కనుక అన్ని పార్టీలకు ఓటు యివ్వమని కోరుతున్నాము. (నవ్వు.)

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం-జనరల్) :- అసెంబ్లీలో ఓట్లు కాన్వాస్ చేయవచ్చునా ?

మిస్టర్ స్పీకర్ :- ఇక్కడ చేయకూడదు.

## Statement of Supplementary Demands for Grants 1957–1958.

*Dr. B. Gopala Reddy*: Mr. Speaker, Sir, I beg to present the Statement showing Supplementary Demands for Grants in respect of the Budget for 1957-58.

దీనిలో ప్రత్యేకంగా చెప్పవలసిన విషయాలు ఏమీలేవు. ముఖ్యంగా 70 లక్షల రూపాయలు Famine Relief Item ఉన్నది. Flying club కు యిచ్చిన విషయాలు ఉన్నవి మొత్తంమీద అన్ని డిపార్టుమెంట్సులో కొత్తగా యిచ్చిన అలవెన్సు రు. 12.లు - దానివల్ల అదనంగా అయ్యే ఖర్చుకు సొమ్ము కావలసియున్నది. Irrigation క్రింద K. C Canal improvement కు కావలసిన మొత్తాలు ఈ సప్లిమెంటరీ స్టేటుమెంట్సులో యిచ్చారు. దీనినిగురించి ప్రత్యేకించి దీర్ఘోపన్యాసము చేయవలసిన అవసరం లేదు మొదట అనుకున్న మొత్తాలు చాలక కొత్త items క్రింద తీసుకొన్నప్పుడు కొత్త సప్లిమెంటరీ డిమాండ్స్ చేయడం కాన్స్టిట్యూషన్ క్రింద రివాజు అయింది. దానిక్రింద ఇది ప్రతిపాదిస్తున్నాను.

*Mr. Speaker* : Statement presented to the House.

## BUDGET-DEMANDS FOR GRANTS

*Demand No. XXVIII-Civil Works-Rs 6,41,89,800.*

*Demand No. XLV-Capital Out-lay on Civil Works*
*Rs. 3,74,41,400*

*The Minister for Communications (Sri M. Narsing Rao)*: Mr Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move:

"That the Government be granted a sum not exceeding Rs 6,41,89,800 under Demand No. XXVIII-Civil Works"

"That the Government be granted a sum not exceeding Rs. 3,74,41,400 under Demand No XLV - Capital Outlay on Civil Works."

*Mr. Speaker*: Motion moved.

శ్రీ యమ్. నరసింగరావు: అధ్యక్షా! రెండు డిమాండ్సు ప్రతిపాదించినాను. డిమాండు 28 క్రింద రు 6,41, 89,800 చూపించబడినది. ఇందులో కొన్ని వివరాలు మనవిచేస్తాను రోడ్లపైన ఎక్కువడబ్బు ఖర్చు అవుతుంది. కొద్దిడబ్బు బిల్డింగ్సుపైన ఖర్చు అవుతుంది డిమాండ్ 45 క్రింద ఖర్చుఅయ్యే డబ్బులోనుంచి ఎక్కువ భాగము బిల్డింగ్సుకు ఖర్చు అవుతుంది. కొద్దిభాగము రోడ్లకు ఖర్చు అవుతుంది. డిమాండు 28లో ఏ ఏ పద్దుక్రింద ఎంతడబ్బు కేటాయించబడినదీ సభ్యులు చదివే వుంటారు. నేషనల్ హైవేస్ క్రింద రు. 1,34,15,000; స్టేట్ హైవేస్ రు. 2,86,000 లు మేజర్ డిస్ట్రిక్ట్ రోడ్సు రు. 17,12,000లు; ఇతర డిస్ట్రిక్ట్ రోడ్లు రు. 95,000; సెంట్రల్ రోడ్ ఫండ్ వర్క్సు రు; 11,00,000లు, Inter State roads of economic importance Rs. 9,40,000; Roads in sugar cane areas రు. 20,00,000; Ordinary roads & evenues Rs. 2,95,000. షుమారు 2 కోట్ల రూపాయలు construction గురించి కేటాయించబడింది. Maintenance కు 2 కోట్ల 12 లక్షల రూపాయల చిల్లర కేటాయించబడింది. తెలంగాణాకు రు. 53,28,000లు; ఆంధ్రప్రాంతానికి రు. 1,51,98,000 రోడ్ల మైంటెనెన్సుకు కేటాయించబడింది. క్రిందటి సంవత్సరం అంకెలతో పోల్చిచూస్తే, కొంతడబ్బు ఈ సంవత్సరం ఎక్కువ కేటాయించబడినట్లు సభ్యులు గమనించి ఉండవచ్చు.

నిరుటి సంవత్సరం sugar-cane areas లో ఖర్చు చేయడానికి, అక్కడ రోడ్సు మరమ్మతులకు వేరే కేటాయించలేదు. ఈ సంవత్సరం రు. 20 లక్షలు కేటాయించబడింది Maintenance గురించి ఈ సంవత్సరం రు. 40 లక్షలు ఎక్కువ పెట్టారు. తెలంగాణా ప్రాంతం రోడ్సుకు రు. 10 లక్షలు, ఆంధ్ర ప్రాంతం రోడ్సుకు రు. 30 లక్షలు- ఖర్చు పెట్టెదరు ఇవిగాక డిస్ట్రిక్టుబోర్డు రోడ్సుకు గ్రాంటుగా రు. 25 లక్షలు యివ్వాలని ప్రభుత్వం అంగీకరించింది. ఈ విధంగా రోడ్ల construction కు గాని, maintenance కు గాని ఈ సంవత్సరం ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టాలని ప్రభుత్వ ఉద్దేశం మనది చాలా పెద్ద రాష్ట్రమైనప్పటికి రోడ్ల పరిస్థితి సక్రమంగా లేదు. ఒక లక్ష చదరపు మైళ్లకంటె ఎక్కువ వైశాల్యం కలిగి, మూడుకోట్లకుపైన జనాభా ఉన్న రాష్ట్రంలో రోడ్లు ఉండవలసినన్ని లేవని ప్రభుత్వానికి తెలుసు. ఇండియా మొత్తంమీద average న ఒక లక్ష జనాభాకు 82 మైళ్ళ పొడవుగల రోడ్లు ఉన్నవి. ఆంధ్ర ప్రదేశ్‌లో 64 మైళ్ళ పొడవుగల రోడ్లే ఉన్నవి. తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలకు విడివిడిగా చూస్తే తెలంగాణాలో 42 మైళ్ల పొడవుగల రోడ్లు, ఆంధ్రలో 76 మైళ్ళ పొడవుగల రోడ్లు ఉన్నవి Average న ఆంధ్రప్రదేశ్‌లో 64 మైళ్ల పొడవుగల రోడ్లు మాత్రమే ఉన్నవి. Average న భారతదేశంలో కంటే, ఆంధ్ర ప్రదేశ్‌లో 1 లక్ష జనాభా చొప్పున దామాషాగా చూస్తే తక్కువ రోడ్లు ఉన్నవని తేల్తోంది. ఇతర దేశాలు- బ్రిటన్, ఆస్ట్రేలియా, అమెరికా, కెనడా—అక్కడ రోడ్లతో పోలిస్తే భారతదేశంలో చాలా తక్కువ రోడ్లు ఉన్నవని తెలుస్తుంది. అందులో మన రాష్ట్రంలో యింకా తక్కువ. అయితే దీనికి ఒక చరిత్ర ఉన్నది గడచిన 10 సంవత్సరముల నుంచి మాత్రమే రోడ్లను గురించి ఎక్కువశ్రద్ధ చూపిస్తున్నారు. అంతకు పూర్వం రోడ్సు, రైల్వేస్ గురించి ఆ కాలపు బ్రిటిష్ ప్రభువులు గాని, యిక్కడ హైదరాబాదు ప్రభువులుగాని ఎక్కువ ప్రాముఖ్యత యివ్వలేదు. Strategic importance ను బట్టి వారు రోడ్సు, రైల్వేలైన్సు వేశారు. హైదరాబాదు ఒక స్వతంత్రరాజ్యంగా ఉన్నప్పుడు ప్రక్కన ఉన్న బ్రిటిష్ రాష్ట్రాలతో సంబంధాలు తక్కువ ఉండవలెనని, రాకపోకల సౌకర్యాలు తక్కువ ఉండవలెనన్నే ఉద్దేశం వారికి ఉండేది. చాలావరకు నదులపైన కూడా వంతెనలు లేవు. పది సంవత్సరముల నుంచి మాత్రమే యీ రహదార్ల సౌకర్యం విషయమై చాలా ప్రయత్నాలు జరుగుచున్నవి. రెండుఎడ్ల బండి economy ఉన్నప్పుడు రోడ్ల యొక్క అవసరం లేకుండా ఉండియుండవచ్చును. ఇప్పుడు ఆ పరిస్థితులు మారిపోయినవి. ఇప్పుడు వేగముగా పోయే వాహనములు వచ్చిన [illegible] ట్రాన్స్‌పోర్టు పద్ధతులు మారి, రోడ్లకు ప్రాముఖ్యం పెరిగింది.

మన దగ్గర ఉన్న అంచనాల ప్రకారం రోడ్లమీదనడిచే బళ్ళు సుమారు పది లక్షలు ఉంటాయి. అందులో 25 వేలు మోటార్ కార్లు, బస్సులు, మోటార్ వెహికిల్స్ ఆంధ్రప్రదేశ్‌లో నడుస్తున్నవి. ఇన్ని బళ్ళు నడుస్తున్నప్పుడు, ఇంత ట్రాఫిక్ ఉన్నప్పుడు రోడ్లు మంచి పరిస్థితిలో ఉండటం కొంచెం కష్టమే కొన్ని ప్రాంతాల్లో ట్రాఫిక్ తక్కువగా ఉంటుంది. మరికొన్ని ప్రాంతాల్లో ట్రాఫిక్ చాలా ఎక్కువగా ఉంటుంది ఈ కారణాలవల్ల రోడ్లు మంచి పరిస్థితిలో ఉండటం కష్టము. కాబట్టి రోడ్లను హెచ్చించటము, రోడ్లను మంచి పరిస్థితిలో ఉంచటము అవసరము మన ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నటువంటి మొత్తం రోడ్లలో, మైలేజ్ ప్రకారం చూస్తే, 15 పర్సెంటు సిమెంట్, బ్లాక్ టాప్ రోడ్లు వున్నవి. మెటల్ రోడ్స్ 63. 2 పర్సెంటు ఉన్నవి. అన్‌మెటల్ రోడ్సు, గ్రావెల్ రోడ్సు వగైరా 21 పర్సెంట్ వున్నవి. వీటిని మనం ఇంకా మెటల్ చేసుకోవలసి వున్నది కొన్ని చోట్ల రోడ్లు వున్నవి కాని వంతెనలు లేవు చిన్నచిన్న వాగులు, నదులు, కాలువల పైన వంతెనలు కట్టవలసి ఉన్నది కల్వర్ట్స్, రోడ్ డామ్స్, ఎన్నో కట్టవలసిన అవసరం ఉన్నది వీటి నిర్మాణం గురించి ప్రభుత్వం శ్రద్ధ వహిస్తున్నది ఇప్పుడు ఒక్కొక్కటే తీసుకొని పనిచేయబడుతున్నవి. బెజవాడ దగ్గర కృష్ణపైన ఒక వంతెన కట్టబడినది ఈ మధ్యనే దానిని ట్రాఫిక్ కొరకు ఓపెన్ చేసినారు. నాగార్జునసాగర్ దగ్గర కృష్ణపైన ఒక వంతెన తయారైనది కడప జిల్లాలో చెన్నూరు దగ్గర పెన్నార్ బ్రిడ్జి తయారు అయినది. దానినికూడ ఓపెన్ చేస్తున్నారు విశాఖపట్నం జిల్లాలో రెండు వంతెనలు తయారైనవి. ఇంకా కొన్ని రోజులలో కొన్ని వంతెనలు తయారుకానున్నవి. ఇవిగాక, ఇప్పుడు తయారవుతూన్న వంతెనలుకూడ ఉన్నవి. గౌతమి నదిపైన, తుంగభద్రపైన నిరుటి సంవత్సరం వంతెనలు కట్టుట ప్రారంభించారు. వశిష్టానదిపైన వంతెన కట్టుటకు భారతప్రభుత్వమువారి అంగీకారము కొరకు వ్రాసినాము. వారి అంగీకారము రాగానే, వశిష్టానదిపైన కూడ వంతెన కట్టుటకు పని ప్రారభించబడుతుంది. మహబూబ్‌నగర్ జిల్లాలో రంగాపురం దగ్గర కృష్ణానదిపైన వంతెన కట్టుటకు గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారి అంగీకారం కొరకు వ్రాసినాము. భారతప్రభుత్వంవారి అంగీకారం రాగానే యీ సంవత్సరంలోనే వాటి పని ఆరంభం చేస్తామని అనుకొంటున్నాము. మహబూబ్‌నగర్ జిల్లాలో కృష్ణపైన, కర్నూల్‌లో తుంగభద్రపైన వంతెనలు తయారైతే హైదరాబాద్ కేపిటల్ నుండి మొత్తం ఆంధ్రప్రదేశ్ అంతటకు వెళ్లవచ్చును. ఆంధ్రప్రదేశ్ ప్రాంతమే కాదు. మద్రాసుకు, మద్రాసు మొదలుకొని కన్యాకుమారిఅగ్రం వరకు వెళ్ళటానికి అవకాశం కలుగుతుంది. మనం ఎన్నో పనులు ఈ విధంగా చేస్తున్నాము.

45వ నెంబరు డిమాండ్ క్రింద 3 కోట్ల రూపాయల చిల్లర ఉన్నది. ఈ డిమాండ్‌లోని డబ్బు బిల్డింగ్స్ పైన ఖర్చు అవుతుంది. ఈ బిల్డింగ్స్‌కొరకు కేటాయించిన డబ్బుతో నిరుటి సంవత్సరం మనం కొన్ని బిల్డింగులు కట్టించాము. ఇంకా కొన్ని బిల్డింగులు పూర్తి కానున్నవి. ఆంధ్రప్రదేశ్‌కు కేపిటల్ అయిన తర్వాత, హైదరాబాదుకు మద్రాస్‌నుండి, కర్నూల్‌నుండి, గుంటూరునుండి, వచ్చిన స్టాఫ్ కొరకు కట్టించిన 11 వందల ఇళ్ళల్లో వంద ఇళ్ళు జూనియర్ స్టాఫ్ కొరకు ఉన్నవి ఈ బిల్డింగ్స్ నిర్మాణం ఏప్రియల్ మాసాంతంనాటికి పూర్తి కావచ్చునని ఆశిస్తున్నాము. ఆఫీసర్స్ స్టాఫ్ కొరకు కడుతూన్న ఇళ్ల నిర్మాణం పూర్తిఅయింది. ఆఫీసర్స్ స్టాఫ్ అందరు వాళ్లకు కేటాయించిన ఇళ్లల్లో గృహప్రవేశం అయినారు.

హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ కేపిటల్ అయినతర్వాత రాజభవనముకు కొన్ని మరమ్మతులు జరగవలసిఉండెను ఆ మరమ్మతులు జరిగినవి. హైకోర్టు భవనాలకు కూడ కొన్ని మరమ్మతులు జరుగవలసిఉండెను. ఆ మరమ్మతులుకూడ జరిగినవి హైకోర్టుబిల్డింగ్స్‌కు ఎక్స్‌టెన్షన్ కావలసి ఉండెను. ప్రస్తుతం ఆ పని జరుగుతున్నది

పోలీసు క్వార్టర్స్ నిర్మాణం ఒక పెద్ద స్కీము హైదరాబాదులో, కర్నూల్‌లో, అనంతపురంలో, హిందూపురంలో పోలీసు క్వార్టర్స్ నిర్మాణం మొదలుపెట్టబడింది. కొన్ని స్థలాల్లో ఆ పని పూర్తిఅయినది ఇంకా కొన్ని స్థలాల్లో ఆ పని పూర్తి కావలసిఉన్నది.

హాస్పటల్స్ బిల్డింగ్స్ కన్‌స్ట్రక్షన్, బిల్డింగ్స్ ఎక్స్‌టెన్షన్ పనులు ఉన్నవి. హైదరాబాదులోని ఉస్మానియా హాస్పటల్, సికింద్రాబాద్‌లోని కె. ఇ. యమ్ హాస్పటల్, గుంటూర్ విశాఖపట్నం హాస్పటల్స్ భవనాల ఎక్స్‌టెన్షన్ పనులు జరుగుతున్నవి. అవి చాలావరకు పూర్తి అయ్యాయని మనవిచేస్తున్నాను. కర్నూలులో, విశాఖపట్నంలో, మెడికల్ కాలేజి భవనాల నిర్మాణం పూర్తి కాగా, వాటి ఎక్స్‌టెన్షన్ పనులు కొనసాగుతున్నవి.

ఇక్కడ ఇంజనీరింగ్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ ఉన్నది. అది పి. డబ్ల్యు. డి కు సంబంధించింది. కాని దానియొక్క ఖర్చు ఇందులో చేరి ఉన్నది. అది ఆంధ్ర ప్రాంతంలో లేదు. ఇక్కడ, తెలంగాణాలో ఉన్నది. మనరాష్ట్రంలో జరిగే ఇంజనీరింగ్ పనులు, ఇరిగేషన్ పనులు, బిల్డింగ్స్ పనులు, రోడ్లు పనులు హైవేస్ రోడ్స్ పనులు గురించి, ఇంజనీర్స్ యీ ఇన్‌స్టిట్యూట్‌లో రిసర్చి

చేస్తారు. అక్కడ రిసర్చి చేసిన తర్వాత, రిసర్చి రిజల్ట్స్ డిపార్ట్మెంట్స్‌కు పంపుతారు ఆ రిజల్ట్స్ ప్రకారంగా డిపార్ట్మెంట్ వారు ఫీల్డ్‌వర్క్ నడుపుతారు.

మరొక విషయము. మనవద్ద Aero-club అని ఒకటి ఉన్నది. ఆ club నడపవలెనని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ క్లబ్ కొరకు ఈసంవత్సరము 40 వేల రూపాయలు కేటాయించబడినవి ఆక్లబ్‌ను గురించి cut motions ప్రతిపాదించారు వాటినిగురించి చర్చించినప్పుడు, దానిని గురించిన వివరాలు అన్నీ సభవారికి విశదపరుస్తాను.

మిస్టర్ స్పీకర్ : ఈ క్లబ్‌ను గురించి ఇప్పుడే చెబితే గౌరవ సభ్యులకు కొంత లాభకరముగ ఉంటుంది అందును గురించి మీ యొక్క అభిప్రాయాలు వారికి చాలా ముఖ్యమైనవిగదా.

శ్రీ యమ్. నరసింగరావు : అవి అన్నీ cut motions వచ్చినప్పుడు చెబుతాను.

ఇక మన రాష్ట్రములో Minor Ports ను గురించి ఈ బడ్జటులో లెక్కలు చూపించలేదు Minor Ports ను గురించిన లెక్కలు కేంద్ర ప్రభుత్వమువారు ఇవ్వాలి. అందువల్ల యీ బడ్జటులో ఆ లెక్కలు కనబడవు మన State Budget కు Minor Port లెక్కలకు ఏలాంటి సంబంధములేదు, వాటికి అయ్యే ఖర్చు కేంద్రప్రభుత్వము ఈ ప్రభుత్వానికి నేరుగా ఇస్తుంది. ఈ Minor Ports యొక్క లెక్కలు నాకు సరీగా జ్ఞాపకము లేవు. అయినను కొంతవరకు చెబుతాను. ఈ ports క్రింద 28 లక్షలకు మించకుండా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కొరకు Government of India వారు మనకు ఇస్తున్నారు. ఆ డబ్బు ఖర్చుచేసే నిమిత్తము. మనము కాకినాడపోర్టు, బందరుపోర్టు ముఖ్యంగా తీసుకున్నాము. పనిగూడ కొంతవరకు జరుగుతున్నది. ఇదిగాక [illegible]లనే మరొక పోర్టుకూడ ఆరంభము చేయాలని అనుకున్నాము. ఆది నెల్లూరుజిల్లా లోనిదే. దాని పేరు కృష్ణపట్టణము ఆ జిల్లాలో అది చాలా ఉపయోగించే port గా ఉంటుందని, అది బాగా అభివృద్ధిచేస్తే మంచిదని experts కూడ అభిప్రాయమిచ్చారు. ఆ పోర్టు గూడూరు తాలూకాకు గూడ చాలా సమీపములో ఉన్నది. గూడూరు తాలూకాలో ఇనుముగనులు ఉన్నవి. అక్కడి నుంచి ఈ port ద్వారా ironore ను export చేసుకోవచ్చు. ఆ ఉద్దేశముతో దానిని గూడ బాగుచేయించాలని అనుకున్నాము. [illegible]

సమీపములో ఉన్న నాయుడుపేట, సూళ్లూరుపేట వద్ద mica గనులుకూడ ఉన్నవి Mica కూడ export చేసుకోటానికి వీలుగా ఉండే port అది. దానిని బాగుచేయించితే, ముందు ముందు అది అభివృద్ధిలోకి వస్తుందని ఆశిస్తున్నాము ఈ port ను గురించి కేంద్ర ప్రభుత్వానికి గూడ వ్రాసియున్నాము. బందరుపోర్టును ఎప్పుడో అరవై డెబ్భై సంవత్సరాల క్రింద experts సర్వే చేశారు. అప్పటినుంచి పరిస్థితులు మారిపోయినవి. Indian Navy వారు వచ్చి Hydrographic Survey జరిపారు. వారు సర్వేచేసిన రిపోర్టు కొంతకాలము ప్రభుత్వము దృష్టిలో ఉన్నది. అప్పటినుంచి యిప్పటివరకు ఆపోర్టును గురించి ఏలాంటి చర్య తీసుకోకపోవడము వల్ల, ఆ పోర్టు అదే స్థితిలో ఉన్నది.

ఇకపోతే కాకినాడపోర్టుకు మంచి భవిష్యత్తు ఉన్నదని కేంద్ర ప్రభుత్వము వారుకూడ భావిస్తున్నారు. అది ఈ నాడు కాకపోయినా, కొద్దికాలములోనైనా ఒక Major Port గా తయారయ్యే అవకాశములున్నవని అందరు అభిప్రాయపడుతున్నారు. విశాఖపట్టణము Port వద్ద congestion చాలా ఎక్కుగా ఉన్నది. కాకినాడ port ను బాగుచేయించి అభివృద్ధి పరిస్తే, విశాఖపట్టణము port వద్దనున్న congestion చాలామటుకు తగ్గిపోతుందని అనుకుంటున్నాము.

ఇవిగాక మన రాష్ట్రములో ఇంకా చిన్న చిన్నపోర్టులు ఉన్నవి బారువ, వాడ్రేవు వగైరాలు చాలా ఉన్నవి. ప్రస్తుతము ప్రభుత్వము వాటిని గురించి ఆలోచించడము లేదు. వీటినిగూడ బాగుచేయించవలసిందిగా స్థానిక ప్రజలు విజ్ఞప్తులు ప్రభుత్వానికి పంపియున్నారు. అయినను అవి ప్రభుత్వము పరిశీలనలోనే పెట్టుకుని ఉన్నది. ఇక ఇంతకంటె information నావద్దలేదు. ఈ రెండు డిమాండ్లను గౌరవ సభ్యులు ఆమోదించవలసిందిగా కోరుతున్నాను.

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli)*: Sir, I beg to move :

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To request the Government to impress upon the Government of India, Railway Board to constitute a Railway Zone for Andhra Pradesh State.

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs 100/-

To discuss the policy of Government on communications.

*Sri G. Suryanarayana (Gajapathinagaram-Reserved)*: Sir, I beg to move

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the neglect of the Government about construction of roads in Gajapathinagaram constituency.

*Sri Baswa Maniah.* Sir, I beg to move

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs 100/-

To criticise the action of the Government in allotting the houses constructed for Government employees in city to the Andhra employees exclusively and charging the expenditure from the budget of Telangana

*Sri B Narasimha Reddy (Suryapeta)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Electricity by Rs. 100/-

To discuss the Scheme for connecting Suryapet with Warangal - Khammam road and also the working of the Scheme for development of rural communications in Suryapet taluq.

*Sri Krishnamachary (Sangareddy-General)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To criticise the policy of the Government.

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the delay in respect of construction of a road from Sangareddy (Dt. headquarters town) to the Head-quarters of Narasapuram taluq via. Ismail Khan peta.

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs, 100/-

To discuss the failure of the Government to construct so far a bridge over the canal known as Basawan wagu on the road between Chantkur village (Andol taluq) and Jogipeta

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to construct so far a road to Kondapur (Sangareddy taluq) a place of historical importance.

*Sri B. Dharmabhiksham (Nakrekal)*. Sir, I beg to move:

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs 100/-

To discuss the failure of the Government to give the enhancement of Rs. 6/- to Highways employees and also the reasons for removal of temporary maistries without payment of gratuity.

*Sri G. Ramulu (Huzurabad-Reserved)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to pay the enhancement of salary sanctioned to the coolies working on Highways roads.

To discuss the failure of the Government to repair the path way for which permission and licences for private bus routes have been given.

*Sri B. Sriramamurthy* Sir, I beg to move -

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to construct a bridge across the Gosthani river in Srungavarapukota, Vizianagaram

To reduce the allotment of Rs 6,41,89,800 for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to provincialise Srungavarapukota—Thamarapatti Road

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to provincialise Srungavarapukota-Thamarapatti road.

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the Government's failure to improve the State of the District roads.

To reduce the allotment of Rs. 6,41.89,800/- for Civil works by Rs. 100/-

To criticise the Government's failure to eradicate corruption, wastage and mismanagement and also to criticise the Government's failure to abolish the contract system in favour of workers co-operatives.

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the Government's failure to lay a road from Gurla (Via) Kalavacherla and Kotagaindrada to Garekidivalasa, in Vizianagaram taluk (Vizag District)

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to lay a road from Lakavarapukota (via Khasapeta, Kotyada to Alamanda in Srungavarapukota taluk (Vizag district).

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the Government's failure to form a road from Komatipalli to Garbham in Bobbili Cheepurupalli taluk of Srikakulam district and also the Government's failure to repair Salur-Duddigam road from Mamidipalli in Srikakulam district.

*Sri B. Dharma Bhiksham.* Sir, I beg to move :-

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil works by Rs. 100

To discuss the failure of the Government to prohibit Yetti (forced labour) obtained by the P. W. D. Officers from Highways gang workers.

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil works by Rs. 100

To discuss the failure of the Government to keep a proper check upon the Highways Officers contractors who are entering into mutual partnership agreements to deprive the Government of their funds property and materials.

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil works by Rs. 100

To discuss the failure of the Government to proceed with the construction of roads taken up last year in Nalgonda District and to take up the construction of roads on the basis of the needs of the public.

*Demand No. XLV. Capital Outlay on Civil Works–*
*Rs* 3,74,41,400

*Sri P. Sundarayya*: Sir, I beg to move :-

To reduce the allotment of Rs. 3,74,41,400 for capital outlay on civil works by Rs 3,74,41,400

The Government continuously, inspite of repeated reminders on the floor of the Assembly, put the items of expenditure on Governor and his pharapharnalia, as charged items though they exceed the allotted amount as found in the President's order and deprives the right of the Assembly to vote such items and as a matter of economy.

*Sri Baswa Maniah*: Sir, I beg to move .

To reduce the allotment of Rs. 3,74,41,400 for capital outlay on civil works by Rs 100

To denounce the policy of the Government in raising the allotment of Rs. 14,45,900 for Police in 1957-58 by 31,69,100 in 1958-59 and thus increase it by 100%

*Mr Speaker*: All these cut motions are now before the House.

శ్రీ బి ధర్మభిక్షమ్ - అధ్యక్షా, ఈరోజున P W.D. మంత్రిగారు ప్రతిపాదించిన రెండు డిమాండ్ల మీదనే cut motion ఇచ్చాను. మంత్రిగారు ఈ డిమాండ్లను గురించి చాలా కొద్ది వివరాలను ఇచ్చి వారి ఉపన్యాసమును తొందరలో ముగించారు కాని, గత సంవత్సరము ఈ డిమాండ్లకు సంబంధించిన కార్యక్రమములు ఎంతవరకు నిర్వహించారు, ఇంకా ఏమి మిగిలినవి అనే వివరాలు చెప్పలేదు. ఈ సంవత్సరము ఏవేవి చేయదలచారో, మాకు బడ్జటు బుక్కులు అందజేశారేగాని, ఆ వివరాలు ఏమీ మాకు వారు చెప్పలేదు. అయినను ఇదివరకు మా వద్దనున్న లెక్కల ప్రకారము, యీ buildings ను గురించి కొన్ని విషయాలు మంత్రిగారి దృష్టికి తీసుకుని రాదలచి మాట్లాడుతున్నాను. ఈ సంవత్సరము బిల్డింగులమీద మూడుకోట్ల రూపాయలు ఖర్చు చేయబోతున్నామని అన్నారు. బాగానే ఉన్నది. ప్రభుత్వము ఈ buildings మీద ఖర్చుచేసే విధానము ఎట్లా ఉన్నదిన్నీ, మంత్రిగారే చెప్పారు. ప్రభుత్వము చేసే ఖర్చు అంతా హైదరాబాదు, సికింద్రాబాదు పట్టణములలో ఉన్న గవర్నమెంటు బిల్డింగుల మీద పెట్టుతున్నట్లు స్పష్టమగుచున్నది. హైదరాబాదు

నగరములో ప్రభుత్వముయొక్క సిబ్బందికొరకే 1100 భవనములుకట్టించ టానికి డబ్బు కేటాయించామని, గవర్నరు భవనమునకు రిపేర్లు వగైరా లకు ఒక లక్ష పదివేలు కేటాయించామని చెప్పారు. అయితే యింత సొమ్ము యిక్కడ రాజధాని నగరములోనే ఖర్చు చేస్తూపోతే, యిక పల్లెలలోని buildings విషయము ఏమిచెస్తున్నారని మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను. ప్రభుత్వము చేసే ఖర్చులు చూస్తే పల్లెప్రాంతాలు వారి దృష్టిలో ఉన్నట్లు కన్పించదు అసలు అవి ప్రభుత్వముదృష్టిలో ఉన్నవా అని అడుగుతున్నాను. జిల్లాలలోని ప్రభుత్వము యొక్క భవనాలు ఏస్థితిలో ఉన్నవో ఒక్క పర్యాయము వారు వెళ్ళిచూచారా అని అడుగుతున్నాను ఆంధ్రప్రాంతానికి సంబంధించినంతవరకు యీ buildings ను గురించిన లెక్కలు నాకు దొరకలేదు కాని, తెలంగాణాకు సంబంధించిన లెక్కలు నావద్ద ఉన్నవి. తెలంగాణాలో 319 గవర్నమెంటుకు చెందిన స్కూలు buildings ఉన్నవి కొన్ని స్కూలున్ను rented buildings లో ఉన్నవి. వీటియొక్క మొత్తము 3,016. Rented buildings లో ఉన్నవి primary schools గాని middle schools గాని high schools గాని, అన్నీ చేరి 3,016 ఉన్నవి ఈ buildings మీద ప్రభుత్వము ఎంత సొమ్ము అద్దెకింద ఇస్తున్నదో మంత్రిగారు ఒక్కసారి అయినా ఆలోచించారా అని అంటున్నాను ప్రభుత్వము ఇంతసొమ్ము ఎందువల్ల ఖర్చు చేయవలసివస్తుంది Buildings కట్టించినట్లయితే ప్రభుత్వానికి ఎంతోడబ్బు మిగులుతుంది. ఒక ఉదాహరణ మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను సూర్యాపేట తాలూకాలో గుమ్మడిపల్లి అనేగ్రామము ఉన్నది అక్కడ ఉన్న స్కూలు బిల్డింగు యిప్పటికి 30 సంవత్సరాల క్రిందట పడిపోయింది బిల్డింగు గోడలతోసహా అన్నీ కూలిపోయి, యిప్పుడు భవనము ఉన్న గుర్తే లేకుండా పోయింది. ఇంతవరకు ఆ బిల్డింగును కట్టించలేదు. సూర్యాపేట తాలూకాలో అన్ని స్కూలున్ను చేరి 107 దాకా ఉన్నవి. ప్రభుత్వము బిల్డింగులలో ఏడు స్కూలున్ను ఉన్నవి. Donated buildings లో ఆరు ఉన్నవి. రెండు పోలీసుస్టేషనులలో ఉన్నవి. కొన్ని చావడిలో ఉన్నవి. ఒకటి బొత్తిగా చెట్టుక్రిందనే ఉన్నది. Rented buildings లో 89 ఉన్నవి. ఇలాంటి పరిస్థితులు ఆ తాలూకాలో ఉన్నవి. మంత్రిగారు యీ పరిస్థితిని గుర్తిస్తారని ఆశిస్తున్నాను, ఇలాంటి పరిస్థితులు గమనించకుండా ఎంతసేపటికినీ యిక్కడ రాజధాని నగరములో పెద్దపెద్ద ఆఫీసర్లకు బిల్డింగులు కట్టించడము, గవర్నరుబంగళాకు రంగులు వేయించడము, ఇలాంటి దుబారాఖర్చు చేసేబదులు, ఆ స్కూళ్లకు భవనాలు ఎందువల్ల కట్టించకూడదు అని అంటున్నాను. మంత్రిగారు ఈ విషయమును గురించి ఆలోచిస్తారనుకుంటున్నాను. ప్రభుత్వములెక్కల ప్రకారము హైదరాబాదు,

సికింద్రాబాదు నగరములలో 2,035 భవనములు ఉన్నట్లు తేలుతున్నది. తెలంగాణా జిల్లాలు అన్నింటిలోను కలసి 1653 భవనములు ఉన్నట్లు 1953 వ సంవత్సరపు లెక్కలవల్లనే కనబడుతున్నది. ప్రభుత్వమునకు ఇన్ని వేలు స్కూల్సు కొరకు బిల్డింగులు కట్టించడముగాని, శిథిలావస్థలో ఉన్న వాటిని రిపేరు చేయించడముగాని ప్రభుత్వము తలపెట్టకపోతే, యిక వాటిగతి ఏమి కావాలి అని అంటున్నాను. ఎంతసేపటికినీ, పల్లెప్రాంతాలవైపుకే చూడక యిక్కడ నగరములలోని బిల్డింగులు కట్టించడమే కనబడుతున్నది. ప్రభుత్వము యిలాంటి విధానము అవలంబిస్తున్నందుకు చాలా విచారకరముగ నున్నది.

నేను అమధ్య సూర్యాపేట తాలూకాలోని ఒక గ్రామం వెళ్లినాను. అక్కడ ఒక shed లో రాత్రిళ్లు పశువులుంటాయి, పగలు school ఉంటున్నది. ఇది అక్కడఉండే పరిస్థితి. నేను buildings విషయం యిప్పుడు అట్టే చెప్పదలచుకోలేదు. రోడ్లకుసంబంధించి నాదగ్గర అనేక వివరాలు ఉన్నాయి. కాని నాకు యిచ్చిన time 12 నిమిషాలే కాబట్టి వివరంగా చెప్పుటకు అవకాశంలేదు. రోడ్లపరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉన్నది. 1953 వ సంవత్సరం లెక్కల ప్రకారం తెలంగాణా ఏరియాలో 3,237 మైళ్ల రోడ్లు ఉన్నవి. అవిగాక వాటిలో 3,173 fair weather roads ఉన్నాయి 1951-52 సంవత్సర కాలంలో military action సందర్భంలో వారిసౌకర్యాల కొరకు సెంట్రలు గవర్న మెంటు వారు 20 లక్షల రూపాయల ఖర్చుతో ఆరోడ్లను వేశారు. ఆరోడ్లులే తప్ప యీ మొదటి పంచవర్ష ప్రణాళికలో ఏమీ పెరగలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికయొక్క అభివృద్ది పథకముల పుస్తకములో కొత్తరోడ్లు వేసినట్లు ఎక్కడాలేదు. ప్రధానమైన రోడ్లుపనులు చేయకుండా, dust proof, roads metalling మొదలైన వాటికి ఎక్కువ డబ్బు ఖర్చుచేస్తున్నట్లు తెలుస్తోంది. అవిధంగా తెలంగాణా ఏరియాలో, మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేసరికి 4,771 మైళ్లు ఉన్నాయని Second Five Year Plan book లో వ్రాయబడినది. అప్పటినుంచి యిప్పటికి 4,771 మైళ్లు పూర్తి అయినాయని చెప్పారు. 1952 వ సంవత్సరం నుంచీ మొదటి పంచవర్ష ప్రణాళికలో రోడ్లులు ఏమీతీసుకోబడలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికలో తీసుకోబడిన తెలంగాణా రోడ్లులన్నీ సగానికి సగం వదలివేయబడినాయి. తెలంగాణా ప్రాంతంలోని రోడ్లులు చాలా అధ్వాన్న స్థితిలో ఉన్నాయి. నేను జిల్లాలవారీగా వివరాలు చెప్పగలను. మెదక్ జిల్లాలో 359 మైళ్ల రోడ్లు మాత్రమే ఉన్నవి ఇవి చాలా తక్కువ. ఒక తాలూకాలోని రోడ్లసంఖ్య చూస్తే 15 మైళ్లకంటె ఎక్కువలేవు. నిజామాబాద్ జిల్లాలో 37 మైళ్ల కంటె ఎక్కువ, లేవు. అదిలాబాద్ జిల్లాలోని రాచూరు

తాలూకాలో 16 మైళ్లకంటె ఎక్కువలేవు. నల్లగొండ జిల్లాలోని రామన్నపేట తాలూకాలో 16 మైళ్ల కంటె ఎక్కువలేవు. మహబూబ్ నగరంలోని కోల్హాపురంలో 28 మైళ్లకంటె ఎక్కువలేవు. కరీంనగర జిల్లాలోని మహాదేవపురంలో 15 మైళ్లకంటె ఎక్కువలేవు. వరంగల్ జిల్లాలోని పాఖాల్‌లో 25 మైళ్లకంటె ఎక్కువలేదు.

An hon. Member: It has gone to Bombay State

శ్రీ బి. ధర్మభిక్షం వరంగల్‌జిల్లాలో పాఖాల ఉన్నది. బొంబాయి రాష్ట్రానికి కలుపబడలేదు. హైదరాబాదు జిల్లాలోని ఇబ్రహింపట్నంతాలూకాలో 25 మైళ్లు ఉన్నవి (హైదరాబాదు పట్టణం కలుపకుండా). ఈవివరాలను బట్టి తెలంగాణాలోని రోడ్లు చాలా అధ్వాన్న పరిస్థితిలో ఉన్నాయని తెలుస్తున్నది తెలంగాణాలోని రోడ్లను అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం ఏయేపనులు చేస్తున్నదో అని పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన పుస్తకాలన్నీ చూచినాను. వాటిలో ఏమీ కనిపించలేదు. ఇప్పుడు నేను వివరాలన్నీ చెబితే 12 నిమిషాలలో నా ఉపన్యాసమును ముగించలేను. హైదరాబాదు నగరమును ఇతర రాష్ట్రాలతో కలుపుటకు వేయబడిన National Highways Roads తప్ప జిల్లాలతో connect చేసే roads చాలా తక్కువగా ఉన్నాయి. ఒకవేళ కొన్నిరోడ్డులు జిల్లాలను cross చేసినప్పటికిన్నీ అవి పట్టణాల దగ్గరగా ఉండవు, ప్రజలకు అందుబాటులో ఉండవు.

సూర్యాపేటనుంచి ఖమ్మం పోయే రోడ్డు, సూర్యాపేట జనగాం రోడ్డు మధ్యప్రాంతాలు ఎడారి ప్రాంతాలు. అట్లాగే జనగాంరోడ్డు మధ్యనుంచి సూర్యాపేట రోడ్డు మధ్యభాగం, చిట్యాలరోడ్డు మధ్యభాగం నుంచి భోన్‌గిరి మధ్యభాగం ఇవన్నీ ఒకమహా అరణ్యం లాంటిది. చౌటుప్పల ప్రాంతంలోని 2, 3 తాలూకాల ఏరియా పెద్దది. హైదరాబాదు రోడ్డుపైనున్న చౌటుప్పల మీదుగా మర్రిగుడ వరకు రోడ్డు ప్లాను. నాగుపల్లి వరకు రోడ్డు ఉన్నది. ఇదివరకున్న హైదరాబాదు ప్రభుత్వ కాలంలో ఈ శాంక్షన్ యిచ్చారు. ఇవన్నీ cover అవుతాయికదా అని యిదివరకు అనుకున్నాము. ఇప్పుడు token గా 1000 రూపాయలు 500 రూపాయలు అంటున్నారు. నేను ఉదాహరణగా కొన్ని విషయాలు చెబుతాను.

చండూరు నుండి చౌటుపల్లి, చౌటుపల్లి, నుంచి పలిగొండ, పలిగొండ నుంచి తిరుమలగిరి, తిరుమలగిరి నుంచి తొర్రూరు వీటిని వరంగల్లు తాలూకాలోని రోడ్డుకు connect చేయాలని తలపెట్టారు. కానీ చండూరు నుంచి కలుపలేదు. నల్లగొండ నుంచి అనాటి ప్రభుత్వంవారు తొర్రూరుకు కలిపే ప్లాను

వేశారు. వలుగొండనుంచి తొరూర్రుకు కలిపిన రోడ్డు 44 మైళ్లు ఉంటుంది. దానికి 33 లక్షల రూపాయలు ఖర్చుపెట్టాలని అంచనా వేసి 1956 57లో కొంత డబ్బు కేటాయించారు పైమొత్తాన్ని Second Five Year Plan లో ఖర్చు పెట్టాలనుకున్నారు. కాని famine area క్రింద వలుగొండ నుంచి అర్రూరు వరకూ 12 మైళ్లు మాత్రం తీసుకున్నారు Famine area క్రింద వేయి రూపాయలు ఖర్చుచేశారు. అదేరోడ్డును బాగుచేయడానికి 5 వేలు ఖర్చు కావాలంటున్నారు తప్ప మూడు తాలూకాలను cover up చేసే పెద్దరోడ్లను తీసుకోవడం లేదు. అది వరంగల్ జిల్లాతో కూడా కలుపబడే పెద్దరోడ్డు కాని ప్రభుత్వంవారు ఆరోడ్డును తీసుకోవడంలేదు. ఇంతవరకూ తీసికొన్న దాంట్లో token గా తీసుకొన్నదేమోగాని పూర్తి చేసేపరిస్థితిలో లేదు. అదేరకంగా. సూర్యాపేటనుంచి గరిడపల్లి హుజూర్ నగర్ తాలూకా మరియు మిరియాలగూడా కలిపేరోడ్డు ప్లాను ఉన్నది. అది 13 మైళ్ల రోడ్డు మాత్రమే. దానికి 13 లక్షల రూపాయలు మాత్రం ఖర్చు అవుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరంలో దానికి 2 లక్షల రూపాయలు కేటాయించబడినవి. ఈసారి ఆరోడ్డు పేరే కనిపించలేదు. ఆరోడ్డుపై ఏమీ ఖర్చుచేయలేదు. Fair weather road వలెనే ఉండిపోతున్నది. ఆరోడ్డు ప్రాముఖ్యతను ప్రభుత్వం గుర్తించనేలేదు.

నల్లగొండనుండి నడుమనూరుకు ఒకచిన్న రోడ్డుఉన్నది దానివి కూడా యిప్పుడు తీసుకున్నట్లు కనబడుటలేదు. ఖమ్మం నుంచి ఇల్లెందు వరకూ ఒక రోడ్డు అది పెద్ద forest area. ఆరోడ్డును వేస్తే చాలా area ను cover up చేయ వచ్చునని plan లో ఉన్నది. వాటిని కూడా ఇప్పుడు token గానే తీసుకొన్నారు. కాని, పూర్తి చేయుటకు ఏర్పాటు జరుగలేదు. ప్రణాళికలోని ఈరోడ్ల విషయమై నాదగ్గర ఉన్న list ను సభ్యులకు చదివి వినిపిస్తే, బహుశా ఆశ్చర్యం కలుగుతుంది. కాని నాకు ఇప్పుడు సమయంలేదు. Dust proof black topping అనే పేరుతో national highways roads నే ఎక్కువగా తీసుకున్నారు. కాని తెలంగాణా ఏరియాను cover up చేసే roads లేవని మంత్రి గారికి చెబుతున్నాను.

రోడ్ల మెయింటెనెన్స్ క్రింద కొన్ని లక్షల ఐటెమ్సు వేసినారు. కాని రోడ్లను maintain చేసే కూలీల విషయం ప్రభుత్వం ఆలోచించనేలేదు. రోడ్లమీద జరిగే దొంగతనాలకు కూడ గ్యాంగ్ కూలీలే బాధ్యులౌతారని అధికారులు చెప్పుతున్నారు వంశపారం పర్యంగా ఈగ్యాంగ్ కూలీలు పనిచేస్తున్నా వారి జీతాలలో ఏలాంటిమార్పు చేయడంలేదు. వారి ఉద్యోగాలను కూడ ఖాయంచేయక ఎప్పుడంటె అప్పుడు వారిని పనినుండి తొల

గించడానికి వీలైన పరిస్థితిలో ఉంచినారు. తెలంగాణలో గ్రాట్యూటి మంజూరు చేసినారు కాని ఆంధ్రలో అదిలేదు అక్కడవారికి సెలవులు కూడ ఇచ్చుటకు సిద్ధంగా లేరు. కేంద్ర ప్రభుత్వం అన్ని డిపార్టుమెంటులలోని ఉద్యోగస్తులకు ఆరు రూపాయలు గ్రాంటుచేసినా నిజామాబాదు, ఆదిలాబాద్ జిల్లాలలోని వారికి ఇవ్వడం, మరల వాపసు తీసుకోవడం జరిగింది. అందువల్ల కార్మికులు చాలా ఆందోళన చెంది సమ్మెలు గూడా చేస్తున్నారు మొన్న కార్మికులు సమ్మె నోటీసు ఇస్తే మంత్రిగారు, లేబర్ డిపార్టుమెంటు జోక్యం చేసుకొని త్వరలోనే పరిష్కరిస్తామని వాగ్దానం చేసినారు ఇప్పుడది పెండింగులో ఉన్నది హైదరాబాదులో హింద్‌మజ్దూర్ సంఘం, A H T U. C సమావేశమై కార్మికుల కనీస కోర్కెలను అంగీకరించక పోయినచో జూన్ 27 నుండి సమ్మెచేస్తామని ప్రకటించారు. ప్రభుత్వం వారి కనీస కోర్కెలను మన్నించక పోవడమే కాక వారిమీద action తీసుకోవడం కూడ జరుగుతున్నది. మొన్ననే నల్లగొండ జిల్లాలో ఒక రోడ్డుమీద కంకర దొంగతనం చేయబడ్డది. అది అక్కడ ఉన్న P. W. D. అధికారులు, కంట్రాక్టర్లు తీసుకపోయారు గ్యాంగ్ కూలీలు ఈవిధంగా కంకర పోయిందని రిపోర్టుచేస్తే వారి హెడ్ కూలీని ఉద్యోగం నుండి తొలగించడం జరిగింది పరిస్థితులు ఎంత అధ్వాన్నంగా ఉన్నాయో దీనిని బట్టి తెలుసుకోవచ్చును. ఆంధ్రలో దాదాపు ఏడు వేలమంది, తెలంగాణలో మూడు వేలమంది గ్యాంగ్ కూలీలు ఉన్నారు ఈపదివేలమంది కోర్కెలను ప్రభుత్వం ఆలోచించవలసి ఉంటుంది. బడ్జెటులో వారి విషయాలన్నీ అసెంబ్లీ ముందుకు రావలసి ఉన్నది. వారి జీతాలను రెగ్యులరైజ్ చేయాలి వివరాలు చాలా ఉన్నప్పటికి నాకు సమయం లేనందున సెలవు తీసుకొంటున్నాను.

* శ్రీ జి. రామస్వామిరెడ్డి (పెదకూరుపాడు) : అధ్యక్షా, సివిల్ వర్క్సు గురించి ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ కొన్ని విషయాలను ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచాను. రాష్ట్రంలో ఉన్న రోడ్లన్నీ చాలా అధ్వాన్న స్థితిలో ఉన్నాయి. వాటిని సరిగా maintain చేయుటలేదు. రాష్ట్రంలోని ప్రధానమైన రోడ్లనన్నింటిని అనగా ఒక తాలూకాను మరొక తాలూకాకు కలుపు రోడ్లను బ్లాక్‌టాపింగుచేసి వాటిని సక్రమంగా maintain చేయవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది. దాని విషయంలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఈనాడు ఏ ప్లానింగు చూచినప్పటికి గ్రామాలను సర్వతోముఖంగా అభివృద్ధి చేయాలని ఘోషిస్తున్నది. ఈ ప్లానింగులో అనేక పద్దుల క్రింద కేటాయించిన మొత్తం అంతా వృధా. వీటికి బదులు గ్రామగ్రామానికి మధ్య రోడ్లను నిర్మించిన వారు పండించే పంటలను, ఉత్పత్తిచేసే ధాన్యాన్ని పట్టణాలకు సరఫరా చేసు

కుంటూ వారంతట వారే అభివృద్ధిచెంది దేశానికి సేవచేయుటకు వీలు ఉంటుంది. కాబట్టి ప్లానింగు దృష్ట్యాచూచినా, నాగరికత దృష్ట్యా చూచినా రోడ్లు ప్రధాన పాత్ర వహిస్తవనే విషయం ప్రభుత్వం గ్రహించాలి. ఈనాడు కొన్ని గ్రామాలకు వెళ్ళాలన్న ఒకటి, రెండురోజులు ఆలోచించి మనస్సును స్థిరంచేసుకోవలసినంత అధ్వాన్నంగా రోడ్లు ఉన్నాయి. నా నియోజకవర్గానికి సంబంధించినంతవరకు రోడ్లు చాలా హీనస్థితిలో ఉన్నవి కొన్ని గ్రామాలకు వివాహ సంబంధంలో ఆడపిల్లలను ఇచ్చుటకు కూడ భయపడుతున్నారు. రెండు మూడుసంవత్సరాల క్రితం Central Roads Aid Fund క్రింద ఆంధ్రరాష్ట్రానికి ఒకకోటి ఎనిమిదిలక్షల రూపాయలు ఇచ్చారు. దానిని సక్రమంగా వినియోగించలేదనితెలుస్తున్నది. గుంటూరు జిల్లాలో రాజుపాలెం, బోదన, అమరావతి, దొడ్లేరు ధరణికోట రోడ్లకు కొంత కేటాయించారు. ఈ ధరణికోట, దొడ్లేరు రోడ్డుకు దాదాపు లక్ష 80 వేలు ఖర్చుపెట్టి మట్టిపోసి రైతుల భూములను, డొంకలను సర్వనాశనం చేసివేశారు. వర్షాకాలంలో ఆమట్టి అంతా కొట్టుకపోయి కృష్ణానదీ గర్భంలో కలిసిపోయింది. ఆ ప్రాంతంలోని గ్రామవాసులకు ఉపయోగం లేకుండా పోయింది. ఈవిధంగా లక్ష 80 వేల రూపాయలు దుర్వినియోగమై పోయింది. కాబట్టి మరల ఈ రోడ్డును సెంట్రల్‌కు వ్రాసియో, central aid funds నుండో, లేక ఇతర జిల్లాలో ఖర్చుకాక lapse అయిఉన్న funds డైవర్టుచేసి, మెటల్ చేయవలసిన అవసరమున్నదని చెప్పుతున్నాను ఇలాంటి రోడ్లను పూర్తిచేసిన తరువాతనే క్రొత్త రోడ్లను వేయుట ప్రారంభించాలి. అప్పుడే మన నిధులు సద్వినియోగమై అభివృద్ధి పథములో పురోగమించినట్లు ఔతుంది. ఇది వెనుకబడిన ప్రాంతం కృష్ణాతీర ప్రాంతానికి ఇది ఒక్కటే రోడ్డు. ఈ రోడ్డు విషయం మంత్రిగారికి రెండు, మూడు పర్యాయాలు చెప్పుకున్నాం. కర్నూల్ దగ్గర నుండి చీఫ్ ఇంజనీర్‌గారికి పదిసార్లయినా చెప్పినాము. ఎప్పుడు అడిగినా చూద్దామనే గాని, మామొరనుగాని, మేము ఇచ్చిన 5, 6 పెటిషన్లనుగాని ఆలోచించి శ్రద్ధతీసుకున్నట్లు కనబడుటలేదు అక్కడ దాదాపు 20,30 గ్రామాలు ఉన్నవి. ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి పోవుటకు అవకాశంలేదు. కాబట్టి ప్రత్యేక శ్రద్ధతీసుకొని ఈ రోడ్డును త్వరగా నిర్మించాలని ప్రభుత్వమును కోరుచున్నాను.

ఈ పద్దుక్రింద కేటాయించిన మొత్తం చాలా స్వల్పంగా ఉన్నది. కొన్ని జిల్లాలలోని డివిజనల్ ఇంజనీర్సు ఆఫీసులలో ఉద్యోగులు డబ్బు అలాట్మెంటు చాలక పనిలేక మిన్నకున్నారు. రోడ్లయొక్క ప్రాముఖ్యతను గమనించి ప్రభుత్వం ప్రతిగ్రామానికి రోడ్ల సదుపాయం కల్పించాలని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ యల్. లక్ష్మణదాసు (పాతపట్నం - జనరల్) : అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ డిమాండును బలపరుస్తూ కొన్ని విషయాలను ప్రభుత్వదృష్టికి తీసుకురాదలచాను. రోడ్ల అభివృద్ధి విషయంలో ప్రభుత్వం ఇంకా ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. దేశాభివృద్ధి కమ్యూనికేషన్ మీదనే ఆధారపడి ఉంటుంది. రోడ్డు రవాణా సౌకర్యాలు లేనిచో రైతులు పండించే పంటకు సరియైన ధరలు వుండవనే విషయం గమనించాలని కోరుతున్నాను టెక్నికల్ ఇబ్బందులని మరికొన్ని సాకులతో శ్రీకాకుళంజిల్లాలో రోడ్లను అభివృద్ధిచేయక పోవడం చాలా విచారకరమైన విషయం. పాతపట్టణం తాలూకాలో అక్కడ ఉన్న మహారాజాగారు ప్రజల సౌకర్యార్థం రమారమి 50 మైళ్ళ రోడ్డును నిర్మించారు. ఇప్పుడు జమీందారీ పోయింది. దానిని ప్రభుత్వం వశపరచుకొన్నది. ఆ రోడ్డును ఈవేళ రెండు, మూడు లక్షలు ఖర్చుచేసి రిపేరుచేస్తే ఎంతో బాగుండేది.

ఎప్పటికైనా ఆరోడ్లను వేయక తప్పదు. అందుచేత ఆరోడ్డు జిల్లాబోర్డుకు సంబంధించినదా? గవర్నమెంటుకు సంబంధించినదా, సర్వే అయినదా ? లేదా అని ఆలోచించక వెంటనే పూర్తిచేయించాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. జమీందారులు వేసినరోడ్లు వున్నవి. కల్వర్టులు వున్నవి వాటిని neglect చేయటం వల్ల అవి పాడైపోతున్నవి. 10 వేలతో బాగుపడే రోడ్లును ఈసంవత్సరం బాగు చేయకపోతే మరుసటి సంవత్సరానికి 50 వేలు ఖర్చుపెట్టినా బాగుకాని పరిస్థితులు వుంటాయి. వాటిని ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తున్నది. ఒకనాడు ఉద్యానవనమై ఈనాడు కరువుప్రాంతమైన ఉద్యానవనమునకు ఒక రోడ్డువేశారు పొలాకి చెలమర రోడ్డు అది. అది ఈనాడు ఏమరమ్మతులు లేక చెడిపోయిన పరిస్థితిలోవుంది బ్లాక్‌టాప్ చేయకపోయినా సిమెంటురోడ్డు వేయకపోయినా కార్లు, బండ్లు పోవటానికి వీలుగా మరమ్మత్తు చేస్తే ప్రజలు ఎంతో ఆనందిస్తారు. డోల అనే గ్రామములో ప్రజలు భూమిని ఖరీదులేకుండా ఇస్తామని, రోడ్డువేయమని కోరినా మంచి రోడ్డువేయటం జరగలేదు. ఏదో 40 వేలు ఖర్చుచేసి ఒకరోడ్డు వేశారు. దానికి కల్వర్టుకడితేగాని అదిఉపయోగపడదు. అక్కడే పాలకిఛానల్ వుంది. 25 వేలు ఖర్చుచేసి కల్వర్టుకడితే ప్రజలకు ఎంతో ఉపయోగముగా వుంటుంది. ప్రజలు ఎంతో సంతోషిస్తారు.

ఇంజనీరింగ్ డిపార్టుమెంటువారు సంవత్సరములనుండి ఎందుకు ఈ విషయములో అలక్ష్యము చేస్తున్నారో నాకు అర్థంకావటములేదు తారు, సిమెంటు రోడ్లు వేయాలని నేను చెప్పటంలేదు. మన ఆర్థికస్థితిని బట్టి ఏరోడ్లయినా వేయవలసిన అవసరముంది. ప్రభుత్వము ఇంజనీరింగ్ డిపార్టుమెంటుపై ప్రత్యేకమైన

దృష్టిని నిలిపి ఆలశ్యమునకు కారణములు తెలుసుకొని అలా జరగకుండా చేయాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

పాతపట్నము తాలూకాలో ఆఫీసును ఏర్పాటు చేయాలని 3 సంవత్సరములనుండి బడ్జెటులో allot చేయటం జరుగుతున్నది. ప్రస్తుతం ఆఫీసు అద్దె ఇంట్లో వుంటువున్నది. రివర్ కు అవతల ప్రక్కన వుంది అందువల్ల ప్రజలకు చాలా కష్టముగా వుంటున్నది అందుచేత స్వంత బిల్డింగ్ అవసరమని బడ్జెటులో డబ్బు కేటాయించటం జరుగుతున్నది కాని ఆప్రయత్నము లేపి ఈనాటివరకు జరుగుటలేదు ఇటువంటి విషయములలో ప్రభుత్వం అశ్రద్ధ వహించటంవల్ల ప్రజలకు ప్రభుత్వముపై ద్వేషం కల్గుతున్నది. ఏ డిపార్టుమెంటులలో లోపంవున్నదో గమనించి వారిపై కరినచర్య తీసికోవాలని మనవి చేస్తున్నాను 18 సంవత్సరములనుండి ఇస్తున్న అద్దెతోనే ఈ భవనము తయారై వుండేది. ప్రజలు ఆ ఆఫీసుకు పర్లాకిమిడి మీదుగా వస్తున్నారు. తహసిల్దారు కూడా పర్లాకిమిడిలో వుంటాడు ఆనాడు పర్లాకిమిడిలో అల్లర్లు జరిగినపుడు ఉద్యోగస్థులందరు కర్ఫ్యూవల్ల ఆఫీసులోనే వుండిపోయిన సంగతి మీకు తెలుసు. బోర్డర్ విషయాలలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసికోవాలని మంత్రిగారికి మనవిచేశాను జిల్లాబోర్డులలో ఇంజనీరు లేడు, టెక్నికల్ డిపార్టుమెంటు లేదు హైవేస్ కు జిల్లాబోర్డుల పనిచేయటానికి వీలులేకుండా వుంది. అందుచేత వారికా పని ఇప్పిస్తే ఎంతో ఉపయోగముగా వుంటుంది. ప్రజలకు తృప్తిగా వుంటుంది. పది సంవత్సరముల క్రింద మనవి చేసినా ఇంతవరకు మాఊరిలో రోడ్లను వేయటంలేదేమని ప్రజలు అడుగుతున్నారు. గవర్నరుగారు వచ్చినప్పుడు ఏదో మన్నుతో తాత్కాలికమైన మరమ్మతుచేస్తారు. గవర్నరుగారు వస్తే కొద్దిగానైనా రోడ్లు బాగుపడతాయనే అభిప్రాయముతో గవర్నరుగారిని invite చేస్తున్నారు,

మరియొక ముఖ్యమైన విషయం మంత్రిగారి దృష్టికి తీసుకురావలసిన అవసరంవుంది అది మనరాష్ట్ర ప్రభుత్వమునకు సంబంధించినది కాకపోయినా శ్రద్ధ తీసుకోవలసివుంది. పర్లాకిమిడిలో light railway వుంది. అది నౌపాడ నుండి పర్లాకిమిడివరకు వుంది. 100 సంవత్సరాల క్రితం రైల్వేను start చేసినపుడు ఏవిధంగావున్నదో ఈనాడు అది అదే పరిస్థితిలోవుంది. ఎప్పుడూ 12 మైళ్ళ స్పీడులో వెడుతుంది. రాత్రులు 50 మైళ్ళ దూరం ఆరైలులో ప్రయాణం చేయడానికి 10 గంటలు పడుతుంది.

ఆ రైలులో, రాత్రి ప్రయాణంచేస్తే ఎలక్ట్రిక్ దీపాలు ఉండవు. ఒక్కొక్కప్పుడు మధ్యనున్న చైను తెగిపోయి, పెట్టెలు నేపాడ వరకు పోయిన

సందర్భాలు ఉన్నాయి. అది చాలా ప్రమాదమైన పరిస్థితి. ఆ rails పెద్దవి చేస్తే బాగుంటుంది. వర్షాకాలంలో అయితే దానిమీద ప్రయాణం చేయడానికి వీలే ఉండదు, ఆ rails పెద్దవి చేయడానికి సామాన్లు మూడు సంవత్సరాల క్రింద తీసుకొనివచ్చి నేపడులో పెట్టారు. ఆ మరమ్మతు చేయడానికి యింత వరకు డిపార్టుమెంటు అంగీకరించలేదు, సంజీవరెడ్డిగారిని ఒకసారి ఆ ట్రయినులో తీసుకొని వెళ్లాలని చూచాము. కాని ఆట్రయిను ప్రక్కనుంచే వారి కారు వెళ్లుట చేత ఆపరిస్థితి వారు గ్రహించే ఉంటారు, తిమ్మారెడ్డిగారు కూడ చూచారు. అందులో travel చేశారు. అందుచేత ఈ train విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను

కళింగపట్టణం పోర్టు ఉంది. అది వ్యాపారానికి చాలా ముఖ్యమైనది. మాజిల్లాలో కోట్ల విలువచేసే జూటు, వేరుశనగ, యింకా రామెటీరియల్సు యితర ప్రాంతానికి పంపించడానికి సరియైన సదుపాయాలులేవు, వాటిని రైలు మీద పంపడానికి అవకాశాలులేవు. అందుచేత కళింగపట్టణం పోర్టును అభివృద్ధి చేసినట్లయితే బాగుంటుంది ఆరేవు కొన్ని వందల సంవత్సరాలనుంచి ఉన్నది. ఈవిషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోనాలని కోరుతున్నాను. హైవేస్ డిపార్టుమెంటులో జరుగుతున్న ఆలశ్యం, neglect తగ్గించి, తప్పుచేసిన వాళ్లపై కఠినంగా చర్యతీసుకొని, దేశాభివృద్ధికి ముఖ్యమైన communication విషయంలో శ్రద్ధ తీసుకోవలెనని ప్రభుత్వాన్ని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

*శ్రీ సి. వి. సూర్యనారాయణరాజు (ఎలమంచిలి) : అధ్యక్షా, ఈ డిమాండు మీద మాట్లాడే టప్పుడు, ముఖ్యంగా విశాఖపట్టణంలో ఉన్న హైవేస్ ట్రంకు రోడ్డు గురించి చాలా మనవిచేయవలసియున్నది. తుని నుంచి, విశాఖపట్టణం పోయేమార్గంలో 20 మైళ్ల సిమెంటురోడ్డు వేశారు దానికి 20 లక్షల రూపాయలు ఖర్చు పెట్టారు. ఆ రోడ్డుమీద కొన్నివాగులు ఉన్నాయి. .. ఆవాగులకు బ్రిడ్జెస్ కట్టలేదు. వర్షాకాలంలో ఈ వాగులమీద ప్రయాణం చేసేటప్పుడు గంటలకొలది బండ్లు, మనుష్యులు నిలచిపోవలసి వస్తున్నది. మా విశాఖపట్టణానికి రావలసిన ఆహారదినుసులు అన్నీ తునినుంచి లారీలమీద ఈరోడ్డుమీదుగానే రావలసి యున్నది. దానికి కూడ చాలా ఆటంకాలు కలుగుతున్నాయి. ఒకసారి R. D. O. గారు కుటుంబంతో వస్తున్నప్పుడు ఈట్రంకురోడ్డుమీద వాగులోనే చిక్కుపడిపోయినారు. ఈ వాగుపై వంతెన విషయమై ప్రభుత్వానికి ఎన్నో సార్లు విజ్ఞప్తులు చేశాము. ఎంక్వయిరీ చేశామన్నారు. దానికోసం డబ్బు శాంక్షన్ కూడ చేసినట్లు చెప్పారు, కాని యింతవరకు ఆబ్రిడ్జెస్ కట్టలేదు.

తరువాత విశాఖపట్టణం, ఎలమంచిలి రోడ్డు ఉన్నది అది. second class రోడ్డు. దానిని ప్రొవిన్షలైజు చేశారు. దానిని బాగుచేసినట్లయితే ట్రంకురోడ్డు మీద ట్రాఫిక్ తగ్గుతుంది. అనకాపల్లిని avoid చెసినందువల్ల పదిమైళ్ల దూరం కూడ తగ్గుతుంది. ఆరోడ్డును ప్రొవిన్షలైజు చేసినప్పటి నుండి ఒక్కపార మన్ను అయినా పోయలేదు. ఆరోడ్ల మదుములు పాడైపోతున్నాయి. ఆరోడ్డుమీద వేసిన slabs పోయినందువల్ల రెండు మూడు accidents గూడ జరిగినవి. ఇంకొక ట్రంకురోడ్డు విశాఖపట్టణం నుంచి, విజయనగరమునకు, పోయేది ఈరోడ్డు విషయంలోనే, నాల్గురోజుల క్రితము పత్రికలలో చూచే ఉంటారు. ఆరోడ్డులో బ్రిడ్జిమీద ఉన్న slab పోతే, అడ్డు వేయనందువల్ల ఒక కారు అగండిలో పడిపోయింది. బ్రిడ్జీలు కట్టినా కట్టకపోయినా, అధమపక్షం ఒక లైటుగాని, obstruction గాని పెట్టినట్లయితే ఈ accident జరిగిఉండేదికాదు కదా! దానిని బట్టి ఆరోడ్లు ఎంతటి అధ్వాన్న పరిస్థితుల్లో ఉన్నాయో ఆలోచించండి మాజిల్లాలో famine roads పేరుతో 1948-49 లో రమారమి వందమైళ్లు రోడ్లు వేశారు. ప్రతిరోడ్డుకు కల్వర్ట్సు కట్టారు. కాని అవి యేపరిస్థితులలో ఉన్నవో సూపర్‌వైజ్ చేయడానికి యెవరూ లేరు. అప్పుడు ఆరోడ్లకు 7 లక్షల 50 వేలు ఖర్చు పెట్టారు. ఇప్పుడు వేయాలంటే 10, 12 లక్షలు అవుతుంది. వేసినటువంటి రోడ్లను maintain చేయకపోయినట్లయితే, వృధా అయిపోతుంది. కొన్ని రోడ్లమీద బండ్లు పోవడానికి కూడ వీలులేకుండా ఉన్నది. ఆబండ్లు రోడు ప్రక్కనుండి పోతే రైతులు ఒప్పుకోరు. ఈపరిస్థితిని యెన్నోసార్లు మంత్రులకు చూపించాము. మంత్రులు బడ్జెట్టులో డబ్బు కేటాయిస్తాము అంటారు. కాని ఈసంవత్సరం (1958-59) బడ్జెట్టులో యెక్కడా కనిపించలేదు. ఇసుకరోడ్డు అయినా సరియైన పరిస్థితిలో ఉండేటట్లు చేయమని మేము కోరుతున్నాము బ్రిడ్జీలమీద slabs వేసి ప్రయాణానికి అనుకూలంగా ఉండేటట్లు చేయుమనికోరుతున్నాం. ఎలమంచిలి తాలూకా నుంచి 250 వేల ధాన్యం బస్తాలు, విశాఖపట్టణం వస్తాయి ఆహారధాన్యాలన్నీ యీరోడ్డుమీద నుంచే రావాలి. అక్కడ నాలుగుమైళ్ల రోడ్డుమీద ప్రయాణంచేయడానికి బస్తాకు రూపాయిన్నర పుచ్చుకొంటారు. ఇట్లా ఉంటే రైతులు యెక్కువ పండించినప్పటికీ, ఏమి లాభం పొందగల్గుతారు?

ట్రావెలర్సు బంగళాలను జిల్లాబోర్డుల ఆధ్వర్యం నుంచి హైవేస్ శాఖవారు తీసుకొన్నారు. వారు తీసుకొన్నప్పటి నుంచి పాడైపోయిన ఒక్క కుర్చీని కూడా బాగుచేయలేదు. పైగా అక్కడనుంచి వాచర్లను తొలగించారు. అర్ధ రాత్రి వేళ యెవరైనా వెళ్లినట్లయితే, తాళంవేసి ఉంటుంది వాటిని హైవేస్

శాఖ maintain చేయలేకపోయినట్లయితే రెవిన్యూ డిపార్టుమెంటుకు యిచ్చి నట్లయితే బాగుంటుందని ఈమధ్య ఒక ప్రపోజల్ వచ్చింది రెవిన్యూ డిపార్టుమెంటుకు, ఏ తహశీల్దారుకో ఎవరికోయిచ్చి, ఉపయోగపరచేటట్లు చేయమని కోరుతున్నాను.

ఏజన్సీ డెవలప్‌మెంటుకు మా చింతలపల్లి తాలూకాకు రోడ్ల కోసమని నాలుగు లక్షల రూపాయలు ప్రొవైడు చేశారు. అందులో పదివేల రూపాయలు కూడ ఖర్చు పెట్టలేదు నేను ఒక యింజనీరుగారిని అడిగితే "staff లేదు, staff ఉంటేగాని మేము యేమీచెయ్యలేమని" అన్నారు. Staff ను sanction చేసి మొత్తం బడ్జెట్టులో కేటాయించారా? లేకుండా కేటాయించారా? అది సక్రమంగా ఖర్చు కాకపోతే యెందుకు? బడ్జెట్టులో చదువుకొని సంతోషించ డానికా వేస్తోంట? ఎల్లాటుచేసిన డబ్బు ఖర్చు అవుతున్నదీ, లేనిది చూడవలసిన బాధ్యత ప్రభుత్వంపై యున్నది

ఎలమంచిలి విశాఖపట్టణంరోడ్డుపైన ఉన్న మూడు వాగులపైన వంతెనలను నిర్మించాలని, ప్రావిన్షలైజు చేసినరోడ్లను సక్రమంగా maintain చేయాలని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ ఎన్. వెంకయ్య (అద్దంకి) అధ్యక్షా, ప్రస్తుతం మన వ్యాపారానికి, మన ఉత్పత్తివస్తువులు ఎగుమతి దిగుమతులకు రహదారి సౌకర్యాలుగాని, రైల్వే సౌకర్యాలుగాని, మైనరురేవులు సౌకర్యాలుగాని చాలినంత లేవనుట స్పష్టము. చౌకగా ప్రయాణం చేయడానికి వీలుగా ఉండే మైనరు రేవులను, కాలవలను అభివృద్ధి చేయుట అవసరం. బందరునుంచి నెల్లూరు వరకు ఉండే మైనర్ రేవులలో తగిన సౌకర్యాలుకలుగజేయాలి ఈమధ్యలో నిజాంపట్టణం మైనరురేవుగాఉంటూ ఉండేది. కాని ఆప్రాంతంలో యిప్పుడు ఎట్టిసౌకర్యం లేదు. మైనరు రేవులుగా అభివృద్ధి చేయడానికి రామాయపట్టణం, క్రొత్తపట్టణం, వాడరేవులాంటివి చాలా ఉన్నవి. వాటివి అభివృద్ధి చేసినట్లయితే అక్కడ ఉండే ఇనుపరాయి, పొగాకు, మిర్చి యితర ప్రాంతాలకు ఎగుమతి చేయడానికి యితర ప్రాంతాలనుంచి అనేక వస్తువులు తెప్పించుకోడానికి అవకాశాలు ఉన్నాయి.

మన బియ్యాం కేరళకు వెళ్ళాలి. కేరళనుంచి హెచ్చుగా కొబ్బరి ఇక్కడకు రావాలి. అందువల్ల మైనర్ రేవుగా ఏర్పాటుచేయబోతున్న బందరుకు, కాండ్లా రేవులకు మధ్య ఇంకొక ఓడరేవు ఉండటం చాలా అవసరం. దానికోసం క్రొత్తపట్టణాన్ని select చేసి, శ్రద్ధ తీసుకొని, అతి త్వరలో దానిని minor port గా మార్చడానికి ప్రయత్నించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

రైల్వే మార్గాల వ్యవహారం ఈ డిమాండు ప్రతిపాదించిన మంత్రిగారికి సంబంధించినదే. ప్రస్తుతం మద్రాసు నుంచి హైదారాబాద్‌కు రాకపోకలు చాలా కష్టంగా ఉంటున్నాయి. బెజవాడ నుండి రాకపోకల సౌకర్యాలు కొంచెం అభివృద్ధి అయ్యాయి కానీ బెజవాడ తరువాత చాలా ఇబ్బందిగా ఉంది. ఒంగోలు నుంచి హైదారాబాద్‌కు మాచర్లమీదుగా railway line ఏర్పడినట్లయితే, మదారాసు ప్రయాణం నూరుమైళ్ళు తగ్గుతుంది హైదారాబాద్ మాచర్లకు ఒక వందమైళ్ళలో ఉంది, తరువాత ఒంగోలు నూరుమైళ్ళలో ఉండి అందువల్ల దాదాపు 110 మైళ్ళు తగ్గించడానికి అవకాశం ఉంది దానివల్ల మాజిల్లాలకు హైదారాబాద్‌తో రాకపోకలు చాలా సుకరం అవుతాయి. అదేవిధంగా సింగరేణి నుంచి విశాఖపట్టణానికి ఒక రైల్వేలైను వేస్తే ప్రయాణీకులకు ఎక్కువ సౌకర్యం. చాలా దగ్గరదారి ఏర్పడి హైదారాబాద్‌కు రాకపోకలు వృద్ధిచెందడానికి చాలా అవకాశాలు ఉంటాయి. వీటివల్ల ఆంధ్రదేశం నలుమూలల చాలా సన్నిహితం కావడానికి, రాజధానికి రాకపోకలు సులభతరం కావడానికి అవకాశం ఉంటుంది. అందువల్ల ఈ రెండు railway lines కొరకు తీవ్ర కృషి చేస్తారని ఆశిస్తున్నాను.

మన రహదార్లపై పెట్టే ఖర్చు అవసరాలకు తగినట్లుగా లేకుండా, చాలా స్వల్పంగా ఉంది. కానీ ఉద్యోగులు మాత్రం గోళ్ళుగిల్లుకొంటూ కూర్చుంటున్నారనేది స్పష్టం. మదారాసు రాష్ట్రంలో ఖర్చుపెడుతున్నదానికి మించి మనం ఇప్పుడు ఎక్కువేమీ ఖర్చుపెట్టడంలేదు. మదారాసురాష్ట్రంలో building designing, town planning మొదలైన వాటన్నిటికి ఇద్దరు మాత్రమే ప్రధాన ఇంజనీర్లు ఉంటున్నారు కానీ ఇక్కడ ప్రతి ఒకదానికి ఒకరు ఉండటమే కాకుండా "Additional" అని, "Special" అనీ కొందరిని ఇముడుస్తున్నారు. ఇంతమంది ప్రధాన ఇంజనీర్లు ఈ రాష్ట్రానికి ఎందుకు ? వీరిని తగ్గించడానికి అవకాశంఉన్న సందర్భాలలో అయినా ఎందుకు తగ్గించకూడదు? Retire అయ్యే వారినైనా ఎందుకు retire కానివ్వరాదు ? ఈ హెచ్చు సిబ్బంది భారాన్ని తొలగించకపోతే, రాష్ట్రానికి దుబారాఖర్చు తప్పదని నేను సూచిస్తున్నాను.

అలాగే ఈరోజున సూపర్‌వైజర్, అసిస్టెంట్ ఇంజనీర్, డివిజనల్ ఇంజనీరు మొదలైనవారు ఎందరో ఉన్నారు. అసిస్టెంటు ఇంజనీర్ చేసే పని ఏమిటి ? కేవలం bills checking కు మాత్రమే అవసరం అవుతున్నారు. ఆ checking పనిని డివిజనల్ ఇంజనీర్ చేయకూడదా ? కేవలం టపాపని చేయడానికి అసిస్టెంటు ఇంజనీర్ అవసరమా ? Estimates ను final గా approve చేసే

అధికారం ఈ అసిస్టెంటు ఇంజనీరుకు లేదు వీటి దృష్ట్యా ఈ department లో ఉద్యోగులు ఎందుకు హెచ్చుగా ఉండాలో నాకు అర్థంకావడంలేదు. Department యొక్క పనులు, వాటి estimates చూచినచో ఎంత ధనం దుబారాగా వ్యయపర్చబడుతోందో తెలుతుంది. డిపార్టుమెంటులో ఉన్న విపరీతమైన దురలవాట్లను ఈ పై officers మాన్పించ గలుగుతున్నారా? ఇంత సిబ్బంది ఉండీ కూడా ఈ department ను చాలా పకడబందిగా నడపలేకపోతుంది. కాబట్టి ప్రభుత్వం ఈవిషయంలో ప్రత్యేక శ్రద్ధతీసుకొని జాగ్రత్తగా run చేయించడానికి పూనుకోవాలని కోరుతున్నాను

చినగంజాం నుంచి ఒంగోలు వరకు రహదారి అత్యవసరం. Railway line కు ప్రక్కగా ఇంకొకదారి లేదు. కేంద్రప్రభుత్వం ఎంతైనా grant ఇవ్వడానికి సిద్ధపడి ఈ railway line ను sanction చేసింది. కానీ ప్రతి సంవత్సరం allotment చూపుతున్నారు. కానీ estimates తయారుచేసి ఎందుకు ఖర్చు పెట్టలేకుండా ఉన్నారు? నాలుగు సంవత్సరాలనుంచి ఈ విధంగా జరుగుతోంది. కానీ ఈ ఇంజనీరింగ్ విజ్ఞానంలో ఏదో లోటు ఉన్నదనే అంశం వంతెన కొట్టుకుపోవడమువల్ల స్పష్టం అవుతోంది. గుండ్లకమ్మమీద కట్టిన బ్రిడ్జి రెండు సంవత్సరాలకే వరదకు కొట్టుకుపోయింది. ఈవిషయంలో అత్యంత శ్రద్ధ చూపవలసి ఉంది కేంద్ర ప్రభుత్వం ఈరోడ్ విషయంలో ఎంతైనా grant ఇవ్వడానికి సిద్ధంగా ఉంది కానీ దానిని మనం సద్వినియోగం చేసుకోలేక పోతున్నాము.

అదేవిధంగా మన రహదార్లు ఎన్నో మధ్య, మధ్య నిలచిపోయాయి. ఎన్నోదార్లు నిరుపయోగంగా ఉన్నాయి. ఎంతోకాలంనుంచి ఇంకొల్లునుంచి కడవకుదురు వరకు ఉన్నమార్గాన్ని high ways తీసుకొని అభివృద్ధి చేయించమని కోరుతున్నాము కానీ దానిని ఇంతవరకు తీసుకోవడానికి ప్రయత్నం చేయడంలేదు. ఈమార్గం రెండు తాలూకాలను కలుపుతూ 10-15 మైళ్ళ దూరం కలసివచ్చేలా చేస్తుంది. ఈ రహదారిలో రొంపేరుమీద కట్టిన బ్రిడ్జి నిరుపయోగంగా ఉంది వర్షాలు పడితే ఆరోజుల్లో రాకపోకలు నిలిచిపోతాయి. ఉత్తర ఒంగోలు తాలూకా ప్రజలు, అందులో నా నియోజకవర్గం ప్రజలందరు ఈమార్గం గుండానే ప్రయాణంచేయవలసి ఉన్నది. Railway line కు ఇంకొక దారిలేదు. అందుచేత Highways Department ఈమార్గాన్ని త్వరగా అభివృద్ధి చేయవలెనని కోరుతున్నాను.

చిన్న చిన్న buildings చాలా ఉన్నాయి. వాటికి మరమ్మతులు కూడా సరిగాలేవు. వీటి మరమ్మతుకు ఒక వందరూపాయిలైతే, ఇంజనీరింగు సిబ్బందికి ఇంకొక వంద ఖర్చవడం తథ్యం. అందువల్ల గ్రామాల్లో ఉండే ఈచిన్న చిన్న buildings repair వ్యవహారం Minor Irrigation Department కు వదిలితే చౌకగాను, త్వరగాను జరుగడానికి ఎక్కువ అవకాశం ఉంది కాబట్టి ఆవిధంగా చేయించమని కోరుతున్నాను. చిన్నచెరువులు వగైరా repairs కు ఈ Department వారు వెళ్ళినపుడు, ఈచిన్న buildings యొక్క repairs కూడా చూసుకొంటారు. ఆవిధంగా చేయమని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ ఎం. సత్యనారాయణరాజు (చీపురుపల్లి - జనరల్) · అధ్యక్షా! ఈ civil works మీద డబ్బు ఖర్చు పెడుతున్న విధానం చూచిన తరువాత ఈ demand ను బలపచరడానికి ఎంతమాత్రమూ వీలు లేకుండా ఉన్నదని, మనవి చేస్తున్నాను. మొట్టమొదట నుంచి మేము పదే పదే, చెబుతూ వస్తున్న విషయాలపై, ప్రభుత్వ విధానం ఇప్పటివరకూ మారలేదు. ఎప్పుడుచూసినా, పెద్ద పెద్ద భవనాలమీద, తదితర హెచ్చుస్థాయిల్లో ఉన్న పనులపైనే ఖర్చు పెడుతున్నారు గాని, దిగువ స్థాయిలో ఉన్న వాటికి ఏమాత్రము ఖర్చు పెడుతున్నట్లు కనపడడంలేదు. ఒక్క భవనాల విషయంలోనే కాక, రోడ్ల విషయంలో కూడ పరిస్థితి ఈవిధంగానే ఉన్నది మామూలుగా ఈపల్లెటూళ్లలో road communication, సదుపాయాలు లేక చాల ఇబ్బందులకు గురవుతున్నారని, గత సంవత్సరము నుంచి చెబుతూ వస్తున్నా ప్రస్తుతం డబ్బు లేదని సాకులు చెబుతూ ఉన్నారు. కొత్తగా ఇస్తున్న గ్రాంటులో నుంచి ముఖ్యాతిక పాళ్లు, ఈ ఉన్నరోడ్లమీద black toping కొరకు cement వేయుటకొరకు, concrete చేసే కొరకు ఖర్చు పెట్టడంవల్ల డబ్బు లేకపోతే లేకపోవచ్చు. అయితే మేము ఆ programme ను కొంచెం ఆపి, రోడ్లు లేనిచోట communications ను వృద్ధిచెయ్యమని అంటున్నాము. ఇదివరకు ఎన్నోసార్లు ఈవిధంగా చెప్పాము కూడా. కాని దానిని గురించి ఏమీశ్రద్ధ తీసుకున్నట్లు కనపడలేదు. పూర్తిగా ఖర్చుపెట్టవద్దని చెప్పడం లేదు. ఖర్చును కొంచెం తగ్గించమని దిగువస్థాయిలో ఉన్నవాటిని మరమ్మతు చేయమని, అత్యవసరమైన చోట్ల భవనాలను కట్టించమని, మేము కోరుతున్నాం. గత సంవత్సరం కంటె, ఈసంవత్సరం రోడ్ల విషయంలో, ఖర్చు తగ్గించారు. గత సంవత్సరం State Road Development క్రింద 8 లక్షల రూపాయిలు ఖర్చు పెడితే, ఈ సంవత్సరం 2 లక్షల 48 వేలు

తగ్గించారు ఒక్క, National High Ways కు మాత్రం ఆ ఖర్చును సమాన స్థాయిలో నడిపిస్తున్నారు. ఎందుకంటే దానికి అయ్యే ఖర్చు కేంద్ర ప్రభుత్వం వారు భరిస్తున్నారు కాబట్టి ముఖ్యంగా పల్లెటూళ్లలో, school buildings లేక కొన్నీ, ఉన్నవాటికి మరమ్మత్తులేక కొన్ని పడిపోయినవి. పడిపోవడానికి సిద్ధంగా ఉన్నవి కూడా కొన్ని ఉన్నాయి. ఇవన్నీ ఎన్నోసార్లు. జిల్లా officer కు Special Officer కు Collector గారికి, District Board వారికి, తుదకు ప్రభుత్వ inspecting staff కు కూడ చూపించినప్పటికినీ, వారు ఇప్పటి వరకూ, ఏవిధమైన శ్రద్ధ చూపలేదు సరికదా, వాటివిషయంలో చర్య తీసు కున్నట్లుకూడ కనిపించదు. School భవనాలు లేనందువల్ల అక్కడి ప్రాథమిక విద్య పూర్తిగా కుంటుపడుతున్నది.

గత సంవత్సరం 11 లక్షల రూపాయలు Road Fund క్రింద allot చేసి నప్పటికినీ పూర్తిగా ఆ ధనాన్ని ఖర్చుపెట్టకుండా, ఏదో, 3 లక్షల రూపాయలు మాత్రం, ఖర్చుపెట్టి ఊరుకున్నారు. Road communications చాలా ఇబ్బందికరంగా ఉన్నవని, ప్రతిసఖ్యాకు ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తుంటే, కేటా యించిన ధనాన్ని పూర్తిగా ఖర్చు చెయ్యకుండా ఈ విధంగా మిగల్చడానికి కారణం ఏమిటో కనపడడంలేదు. మొత్తం జిల్లాలు అన్నింటిలోనూ, శ్రీకాకుళం జిల్లా, ఈ Road communications సందర్భంలో, చాల వెనుకబడి ఉన్నదని, ప్రభుత్వానికి ఎన్నోసార్లు చెప్పాము. ఎన్నో రహదార్లను వెయ్యడానికి, రమారమి, 20, 30 సంవత్సరాల క్రితమే స్కీములు మంజూరుచేసి, వాటికొరకు, lands acquire చేసినప్పటికినీ. ఇప్పటివరకూ అక్కడ రోడ్డు వెయ్యడం జరగలేదు. 10, 15 వేల రూపాయల విలువగలస్థలాన్ని తీసుకొని, survey చేయించి, రాళ్లు పాతించికూడ, అలాగే ఉంచివేశారు. ముఖ్యంగా major district roads ఒక దానికి ఒకటి కలిపి, bus లను నడిపిస్తే వాటివల్ల అదనంగా డబ్బురావడానికి అవకాశం ఉంటుందని, ఎన్నోసార్లు ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చినాము. 10, 15 సంవత్సరాల నుంచి ఒక్కరోడ్డుకూడ, వెయ్యలేదు. శ్రీకాకుళం జిల్లాలో మన ముఖ్యమంత్రి tour చేసినప్పుడు, వారికి చూపించాము శ్రద్ధవహించి, వారు [illegible]ని చూచారుకూడా. అప్పుడే కోమటిపల్లి - గర్భం రోడ్డును కూడా చూపించాము. ఆప్రాంతం నుంచి manganese, ఎన్నో వేల టన్నులు ప్రతినెల ఎగుమతి అవుతున్నది దానివల్ల ప్రభుత్వానికి కూడ royalty మూలకంగా, చాల డబ్బు వస్తున్నది. నాటుబళ్లమీద manganese ను, ఆ గర్భం రోడ్డుమీదుగా, ఇటు గరివిడికి, అటు కోమటిపల్లికి తీసుకు వెళ్లడానికి చాల కష్టంగాఉన్నది. ఈ సంగతులన్నీ, శ్రీ సంజీవరెడ్డిగారికి వారు

Deputy Chief Minister గా ఉన్నప్పుడు చూపించి, చెప్పాము కూడా. ఇప్పటికి 3 సంవత్సరాలు అయినది, ఇప్పటివరకూ దానిని గురించి శ్రద్ధతీసుకో లేదు. అక్కడి రోడ్లపై పెట్టిన పెట్టుబడి, కనీసం 5 సంవత్సరాలలో తిరిగి వచ్చేస్తుందని కూడ చెప్పాము అప్పుడు కొంత డబ్బు ఖర్చుపెట్టి గర్భం నుంచి ఒక మట్టిరోడ్డు వేశారు, culverts కూడ కట్టారు. వాటిని సకాలంలో మరమ్మత్తు చెయ్యకుండా, అలాగ వొదిలివేయడం వల్ల ఈమట్టి రోడ్డు అంతా wash out అయిపోయి, culvetrs మాత్రమే మిగిలి పోయాయి. ఈవిషయాలన్నీ ఎన్నిసార్లు చెప్పినప్పటికినీ, ఒకచే పాటగా అయిపోయిందిగాని, action మాత్రం ఏమీ తీసుకోలేదు గనుక ఇప్పటికైనా ప్రభుత్వము తగు శ్రద్ధ వహించాలని మనవి చేస్తున్నాను.

మన ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న railways లో కొంతభాగం Central Railway కి, కొంత South Eastern Railway కి, కొంత Southern Railway కి, చెంది ఉండడంవల్ల తగినంత అభివృద్ధి చెయ్యడానికి అవకాశం లేకుండా ఉన్నది. కాబట్టి మూడు, ముక్కలు కాకుండా, అన్నిటినీ, సమీకరించి Waltair నుంచి Bezawada కు, Masulipatam నుంచి Guntakal కు, రెండు section లు అధమము ఈ ప్రాంతానికి కలిపి, ఒక central zone గా ఏర్పరచి, దానికి Secunderabad ను Headquarters గా పెడితే మన సోదరులు అటు నెల్లూరు నుంచి, ఇటు విశాఖపట్నం నుంచి, మన Capital కు రావడానికి చాల అనుకూలంగా ఉంటుంది అది జరుగనినాడు, ఏపని అయినా, అభివృద్ధి చెయ్యడానికి వీలుండదు. కాబట్టి, ఈ Railways ను కలిపి, ప్రత్యేకంగా ఒక zone ఏర్పాటుకుగాను, కేంద్రప్రభుత్వం మీద ఒత్తిడి తేవాలని మంత్రిగారిని కోరుతున్నాను.

ఇంకొకవిషయం ఏమంటే, Government Buildings యొక్క maintenance staff 25, 30 సంవత్సరాలనుంచి పనులు చేస్తుంటే వాళ్లకు notice లు ఇచ్చి, వాళ్ల services ను break చేస్తూ ఉన్నారు. ఈ రకంగా రమారమి 150 మంది workers ఉన్నారు. వాళ్ల service ను ఖాయం చెయ్యకుండా, break చేసుకుంటూ తీసుకువస్తున్నారు. ఇంత విపరీతంగా ఖర్చుపెట్టి కట్టించే ఆ buildings ను, మంచి స్థితిలో ఉంచడానికి ఏర్పాటు చేసిన ఆ staff యొక్క services ను ఖాయం చెయ్యకుండా, ఇలాగ ఉంచడం చాల అన్యాయము. కావున ఆ 150 మంది workers ను, ఖాయం చేసి, Government Service Rules, allowances వారికి కూడ వర్తించేటట్లు చెయ్యాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

श्री राम पा गरेश्री . (भरनाल—जनरल) माननीय अध्यक्षजी । अभी हमारे सामने माननीय मंत्रीजी ने पी डब्लू डी के जो मतालेबात पेश किये है वह असंतोशजनक मालूम होते है। यह महकुमा हर महकूमे से बहुत ज्यादा अहम समझा जाता है। क्योकि आमदोरफत के लिये यह कम्युनिकेशन ही हमारा मुख्य उद्देश्य है। लेकिन इस डिपार्टमेंट मे जितना करपशन होता है उसके लिये मै चाहता हू कि माननीय मंत्रीजी इसपर खास ध्यान दे। कंट्रेक्टर्स पी डब्लू डी इंजीनियर्स सुपरिनटेंडेंट्स वगेरा मे बहुत करपशन होता है। उसको खतम करनें के लियें खास इन्तजाम करना चाहिये ।

कम्युनिकेशन्स के तहत रेल्वे भी आता है। आंध्रप्रदेश कायम होने के बाद हम आंध्र प्रदेश के लियें अलग रेल्वे जोन चाहते थें । लेकिन वह अब तक कायम नही हुआ। मै आपको बतलाता हू नार्थ इस्टर्न फ्रान्टियर के लिये एक अलग जोन है। उसका एरिया १७३० मुरब्बा मील है। उस से बढकर आंध्र प्रदेश का एरिया २८६० मुरब्बा मील हैं। यह उससे भी ज्यादा होने पर भी यहा जोन नही बनाया गया है। तो मैं पूछता हू हमारी हुकुमत सेन्ट्रल गवर्नमेन्ट को क्यु फोर्स नही करती कि आंध्रप्रदेश के लिये अलग जोन बनाया जाये। मै हूकूमत से चाहता हू कि वह इस तरफ खास ध्यान दे।

तुंगभद्रा नदी पर हरीरी के पास एक पुल बनाया जा रहा है जो नेशनल हाइवेज मे शुमार किया जाता है। इसपर गवर्नमेन्ट खास ध्यान दे। क्यूकि यह नेशनल हाइवेज पर है। और एक स्टेट को दूसरी स्टेट से मिलाने का रास्ता है। इसपर खास ध्यान देनें को जरुरत है।

इसी तरह गोदावरी नदी पर एक पुल बनाया जा रहा है। उसका काम बहुत ही सुस्ती से हो रहा है। मै कहूगा कि १९५८-५९ का बजेट खतम होनें तक उस काम को पूरा करवाने की कोशिश करे।

गुजस्ता बजेट सेशन मे माननीय मंत्रीजी नें एरलाइन्स के बारे मे बयान दिया था हमारा उद्देश्य कम्युनिकेशन का मतलब यही है कि जनता को कपिटल तक आने के लिये हर तरह की सहूलत हो। हमारे आंध्र प्रदेश मे विशाखापटनम बहुत बडी बंदरगाह है वहां से हैदराबाद वया बेजवाडा एक एर लाइन कायम करने के लियें आंध्र प्रदेश की हुकूमत सेंन्ट्रल गवर्नमेंट सें पुर जोर अपील करें। मै आशा करता हू कि इस लाइन को जल्द ही जारी करवाया जायगा।

अब रहा तेलंगाना और आंध्र का मसला। बनिसबत आंध्र के तेलगाना मे पी. डब्लू. डी. रोड्स बहुत कम है। हुकुमत इस तरफ कम तवज्जोह देती है। माननीय मंत्री जी भी तेलंगाना के एक मंत्री है। मै उनसे चाहता हुं कि वह तेलंगाने की तरफ तवज्जोह देकर यहा रोड्स ज्यादा बनाने की कोशिश करें। डिस्ट्रिक्ट बोर्डस कें तहत जितने भी रोड्स हैं वह बिल कुल खराब और नाकिस हालत मे है। हुकुमत डिस्ट्रिक्ट

बोर्डस कें जो फड्स है उसको पी. डब्लू डी के तहत लेकर या नही तो पी डब्लू डी. कें मद मे से डिस्ट्रिक्ट बोर्डस को देकर रोड्स मरम्मत करनें मे सहायता दे मै ऐसी आशा करता हू । रोड्स के बाजू दरख्त नसब कियें जाते है । यह हमारें सेंट्रल गवर्नमेंट का उद्देश्य भी है । वह महोत्सव भी मनाया जाता हे और रोड्स के बाजू दरख्त लगाकर रोड्स को सायादार बनाने और मुसाफिरो को सहूलत पहुचाने का एक उद्देश हमारे सामने है मगर हम देखते है कि ओवरसियर्स और सब ओअरसियर्स जो दरख्त ज्यादा उम्र वाले हो जाते है उनको खतम करके उनकी लकडी अपनें चूल्हे मे इस्तेमाल करलेते है । और गेंग कूली भी इन दरख्तो को तरफ तवज्जोह नही देते । मै माननीय मत्रीजी से प्रार्थना करता हू कि वह इस बारे मे खास ध्यान देकर अैसी हर हरकत दूर करने की कोशिश करे।

इस साल के बजेट मे सिविल वर्क्स के तहत ताल्लुके मकथल की मकथल ता-नारायण पेट रोड के लिये १,७५००० रुपये एलाट किये गये है । सइके लिये रखम तीन साल से बजेट मे इसी तरह से आती रही है लेकिन काम नही होता वह वहुत ही बडा रास्ता है जो रायचूर और गुलबर्गा को मिलाता है। मै माननीय मत्रीजी से प्रार्थना करता हू कि इस बजेट मे इस काम के लिये जो रखम एलाट की गयी है वह इसी साल पूरी खर्च करके उस काम को पूरा करवाये और इस काम पर खास निगरानी करे

उसी ताल्लुके के तहत मरकल ता मनासपूर रोड जो नारायनपेट जाती है और महबूब नगर को भी मिलाती है उस रोड कि बडी जरुरत है उसके बारे मे कअी बार माननीय मत्रीजी को याद दिलाया गया है । इस बजेट मे उसके लिये १४६०० रूपये एलाट किये गये है । वह बहुत ही कम है । उसको ज्यादा करके उस रोड पर मेटलिंग करनें की जरुरत है मै आशा करता हू कि उसको पूरा किया जायगा ।

ताल्लके कोडगल मे कुछ मौजे इंटीरियर के और हिल्ली प्लेस के है । वहा रोड्स नही है । उस तरफ भी ध्यान देने की जरूरत है । मैं माननीय मत्रीजी से प्रार्थना करता हू कि वह इसपर ध्यान दें ।

इसके बाद अजीज अहमद सीनियर असिसटेंट डाइरेक्टोरेट माइन्स दकन इन्स्टेन्ड सेंडीकेट के जरये जो रोड्स बनवाये है गलत हिसाबात दाखिल करके लाखो रुपया तामीरात से हासिल किये है । उसके बारे मे सी आइ डी से तहकीकात करा रहें हैं । यह साहेब मौसूफ सी आइ डी को डरा धमका रहे है । मै माननीय मंत्रीजी से चाहता हू कि वह इस करपशन को रोकने के लियें खास इतेजाम करें ।

(*Smt T. Laxmi Kantamma in the Chair*)

गदवाल ताल्लुका इससें पहले रायचूर जिले के तहत था । अब आंध्र प्रदेश कायम होने के बाद वह आंध्र में आगया है । लेकिन गदवाल के लियें कोअी रास्ता

नही है। एक ही रास्ता गदवाल से रायचूर होता हुआ रायचूर पहुचता है। वह माकिस रोड है। इसपर मिसनरी वर्क के लिये मोरम अन्दाजी होती है। मगर पी. डब्लू डी के इजीनियर्स वक्त पर पानी न डालने की वजह से उस रास्ते पर से गुजरने वाले टी, बी मे मुबतेला होने का अन्देशा है। मै माननीय मत्रीजी से चाहता हू कि वह इजीनियरो की इस गलती को देखें। और उस रोड को बहुत जल्द तकमील किया जाय तो अच्छा है।

निजाम सागर डेवलपमेट आफिस के तहत २६० मील की एक रोड तामीर करने के लिये कअी बार स्टीमेट किया गया। इसमे से ६० मील पर काम हो गया है। अभी २०० मील का काम होना है। इसके जरये निजामसागर के कअी बडे बडे प्राजेक्ट्स को इम्प्रु करने मे मदत मिलेगी। हुकुमत को इस तरफ खास ध्यान देकर इसको जल्द पूरा करना चाहिये।

मै आखिर मे माननीय मत्रीजी से यह चाहता हू कि उनके डिपार्टमेंट मे जो बहुत ज्यादा करपशन है उसको रोकने की कोशिश करे। मै आशा करता हूं कि वह इस दृष्टिकोन का सामने रखेगें।

आखिर में मे यह भी कहुगा कि जक्कलता चिक्कडपल्ली रोड मिनिस्टर साहब की इनायत से मजूर हो गअी है। लेकिन वहा काम नही होरहा है। इसपर मिनिस्टर साहब खास तवज्जोह करे। मुझे आशा है कि वह इस काम को पुरा करेंगे।

मै माननीय अध्यक्षजी का आभार मानते हुअे अपने शद्व को समाप्त करता हू।

*శ్రీ యస్. నారాయణప్ప (గూటి-జనరల్) :- అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన రహదారులకు, బిల్డింగులకు, వంతెనలకు, సంబంధించినటువంటి పద్దును సమర్థిస్తూ కొన్ని సూచనలు చేయదలచినాను. ఇపుడు హైవేస్ డిపార్టుమెంటుకు కేటాయించిన మొత్తము రోడ్ల మరమ్మతుకు చాలదనియు, దానిని ఇంకా హెచ్చుచేయమనియు మంత్రిగారిని కోరుచున్నాను. ఇపుడు దాదాపు రాయలసీమలో 2 సంవత్సరములకు 3 సంవత్సరములకు ఒకసారి వర్షాభావము వల్ల కరవు వస్తూవుంటుంది. కరవు వచ్చినపుడు వ్యవసాయ కూలీలకు, బీదలకు, హరిజనులకు పని కల్పించేనిమిత్తమై ప్రభుత్వము రోడ్ల మరమ్మతు కార్యాలు ఏర్పాటు చేస్తున్నారు. ఈ సందర్భంలో దాదాపు 2-3 వందల మైళ్ళ రోడ్లను ప్రభుత్వమువారు అనంతపురం జిల్లాలో వేయించినారు.

ఇప్పుడు అక్కడ మట్టిరోడ్లు మాత్రమే ఉన్నాయి. అక్కడ చెట్లు చేమలు మొలిచి అవి పెద్ద వృక్షములై పోయినాయి, కాని ఆ రోడ్ల మరమ్మతు మాత్రం జరుగ

లేదు. ముఖ్యమంత్రిగారికి ఈ విషయం తెలుసును. ఎన్నోసార్లు ఆశాఖ మంత్రి గారికి చెప్పాను. ఒక సంవత్సరంలోనే ఈ famine రోడ్లనన్నింటిని మరమ్మతుచేసే ఆర్థికస్తోమతు మనకు లేదు కాబట్టి కనీసం అయిదు సంవత్సరాలో పది సంవత్సరాల లోపుగా ఈ రోడ్ల మరమ్మతు చేయడానికి ఒక విధమైన ప్రణాళికను ఏర్పాటుచేసి ప్రతిసంవత్సరం కొన్నివేలరూపాయలైనా కేటాయిస్తే కొంత పని జరుగుతుంది. కేవలం వెనుకబడిన ప్రాంతం కాబట్టి అక్కడ ఉండే మట్టి రోడ్లనైనా metal రోడ్లు చేయాలని కోరాము. విజ్ఞప్తులు పంపాము, దీనిని మంత్రిగారు దృష్టిలో పెట్టుకోవాలని కోరుతున్నాను గుత్తి తాలూకాలో నాగసముద్రం అని ఒక ఊరు కొండల ప్రాంతంలో ఉన్నది అక్కడకు చాలా ప్రాంతాలనుంచి చాలా వేలు వందలు మైళ్ళ దూరంనుంచి ప్రతి అమవాస్య రోజున రోగులువచ్చి మందులు ఉచితంగా తీసుకుపోయే సాంప్రదాయం చాలవేలసంవత్సరాలనుంచి ఉన్నది గుత్తినుంచి నాగసముద్రం మీదుగా వజ్రకరూరు పోయే రోడ్డును మరమ్మతుచేసే విషయం, గుంతకల్లునుంచి నాగసముద్రంమీదుగా పామిడికి ఒకరోడ్డు వేయించే విషయమై ఎన్నోసార్లు ప్రభుత్వ దృష్టికి తెచ్చాము వాటి విషయమై ఇంతవరకు ఏ చర్య తీసుకోలేదు. దయుంచి మంత్రిగారు ఈ రెండు రోడ్లవిషయం దృష్టిలో పెట్టుకుని మరమ్మతుచేసే ప్రయత్నం చేస్తారు అని ఆశిస్తున్నాను గుత్తిపట్టణం తాలూకా కేంద్రం. అక్కడనుంచి బళ్ళారిపోయేరోడ్డుపై తారువేయాలని ఇదివరలో కోరాము. కొంతవరకు తారువేయడానికి డబ్బుకూడా కేటాయించారు. పనిమాత్రం చురుకుగా జరగడం లేదు కంట్రాక్టర్లు రేట్లు తమకు గిట్టటం లేదని ముందుకు రావడం లేదు అటువంటప్పుడు డిపార్టుమెంటుద్వారానే ఆ పని చేయిస్తే బాగుంటుంది, లేదా, రేట్లను revise చేసి కేటాయించిన మొత్తాలు lapse కాకుండా పని చురుకుగా జరిగే ఏర్పాట్లు చేస్తారని ఆశిస్తున్నాను. గుంతకల్లును జిల్లా కేంద్రం చేయాలని ఇదివరలో ప్రజలు ఎన్నోసార్లు విజ్ఞప్తులు ఇచ్చారు. గుంతకల్లు వ్యాపారకేంద్రం, రైల్వేకేంద్రం. రైతులు పండించే ముడి పదార్థాలను గుంతకల్లుకు తీసుకువచ్చే లారీలు, బస్సులు- వీటి traffic ఉరవకొండమీదుగా రావలసియున్నది. గుంతకల్లునుంచి ఉరవకొండ 22 మైళ్ళదూరం, ఈ రోడ్డును తారురోడ్డు చేయాలని కోరాము. ముఖ్యమంత్రిగారు దయతో లక్ష రూపాయలు కేటాయించారు, చీఫ్ ఇంజనీరుగారు కూడా ఆ రోడ్డు బాగుచేయించడానికి special interests చూపించారు. టెండర్లను పిలిస్తే కంట్రాక్టర్లు రేట్లు మాకు గిట్టడంలేదు, పనిచేయడానికి వీలుకాదు అని చెబుతున్నారు. సూపరింటెండింగ్ ఇంజనీరుగారితో చెబితే అవి షెడ్యూల్డు రేట్లు, revise చేయడానికి

వీలులేదు, అంటున్నారు కంట్రాక్టర్లకు గిట్టకపోతే డిపార్టుమెంటుద్వారా చేయించి లేదా రేట్లను రివైజుచేసి కంట్రాక్టర్లకు ఇచ్చి వెంటనే కేటాయించిన మొత్తాలను అనుకున్న కాలంలోపల ఖర్చుపెట్టి ప్రజాసౌకర్యం కలుగజేయాలని మనవిచేస్తున్నాను గుంతకలునుంచి బళ్ళారిపోయే రోడ్డులో రెండు వంతెనలు కడుతున్నారు. గడచిన సంవత్సరంలో అక్కడ పెద్ద వర్షాలు కురిసి రెండు మూడు లారీలు ప్రవాహంలో మునిగి కొట్టుకుపోవడం, నలుగురైదుగురు చనిపోవడం జరిగింది. ఈ దుస్సంఘటన కారణంగా రెండువంతెనలను కడుతున్నారు. ఇవి చాలవు. ఇంకా పెద్ద వంకలున్నాయి అది నల్లరేగడిభూమి. అంచనహాలు దగ్గర వంతెన పని ప్రారంభం జరుగుతోంది. దోనేకల్లు, అంచనహాలుకు మధ్య ఒక వంతెన కడుతున్నారు. అది కాకుండా దోనేకల్లుకు గడేకల్లుకు మధ్య ఒక పెద్ద వంక ఉన్నది. అది బళ్లారిసరిహద్దు సమీపంలో ఉన్నది. మైసూరు ప్రభుత్వమువారు చక్కని రోడ్లు వేశారు, చెట్లునాటుతున్నారు. రోడ్లను బాగామరమ్మతుచేసి black top చేసి సుందరంగా, అందంగా చేస్తున్నారు మన వైపురోడ్డు అధ్వాన్నంగా ఉన్నది ఎందుకు అట్లా ఉన్నది అంటే కంటాౄక్టర్లు రావడం లేదని డిపార్టుమెంటువారు చెబుతున్నారు. ఈ రోడ్లను మరమ్మతుచేసి అటువైపురోడ్లకంటె ఇవి మిన్నగా ఉన్నవని చెప్పే ప్రయత్నం చేయవలెనని కోరుతున్నాను డిపార్టుమెంటువారు శ్రద్ధగానే ప్రయత్నం చేస్తున్నారు. అయితే రేట్లు కారణంగా కంటాౄక్టర్లు ముందుకు రావడంలేదనే స్థితిలో ఏదో ఒక మార్గాన్ని వెదకి వెంటనే పనులు చేయాలని కోరుతున్నాను మరొక విషయమేమంటే అనంతపురం జిల్లాబోర్డు భవనాలు మరమ్మతుకావడంలేదు. వీటికి కేటాయించే మొత్తం చాలా స్వల్పం జిల్లాబోర్డు అధ్వర్యంక్రింద జరిగే పాఠశాలలు చాలా ఉన్నాయి. వందలకొలది పాఠశాలలున్నాయి. అవి ఈనాడు పడిపోతున్నాయి. వాటికి స్వల్ప మొత్తాలనైనా ఖర్చుచేసి మరమ్మతు చేయించి నిలుపుకుంటే బాగుంటుంది. వీటిని మరమ్మతుచేసే విషయమై శ్రద్ధతీసుకొని ప్రభుత్వం అనంతపురం జిల్లాబోర్డుకు building grants ఎక్కువ ఇవ్వాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

* శ్రీ టి. లక్ష్మీనారాయణరెడ్డి (అనవర్తి): అధ్యక్షా, మంత్రిగారు ఈరోజున రవాణా సౌకర్యాలగురించి ప్రభుత్వభవనాలగురించి పద్దును ప్రవేశపెడుతూ కొద్దిసేపు మాట్లాడారు. మాట్లాడుతూ ఈసంవత్సరంలో గతసంవత్సరంలోకంటె రోడ్ల మరమ్మతులకు, రవాణా సౌకర్యాలకు ఎక్కువఖర్చుచేస్తున్నామని చెప్పారు. కాని ఇక్కడ ఉండే కొన్ని పద్దులను చూస్తే ఆరీతిగా ఖర్చుపెట్టడం

లేదని తెలుస్తోంది. ముఖ్యంగా మనరాష్ట్రంలో రవాణా సౌకర్యాలు సరిగా లేవు మనరాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాలలో రవాణా సౌకర్యాలు చాలా తక్కువగా ఉన్నాయి. బడ్జెటును చూస్తే జాతీయ రహదారులక్రింద ఎక్కువ ఖర్చు చేస్తున్నట్లు స్పష్టం అవుతుంది Major District Board Roads క్రింద 17 లక్షలు ఖర్చుచేస్తున్నారు. Ordinary రోడ్లక్రింద రెండు లక్షలు మాత్రం ఖర్చు చేస్తున్నారు ఈ విధంగా ordinary రోడ్లమీద ఖర్చు చేస్తుంటే మన రాష్ట్రంలోని ప్రతిగ్రామానికి రోడ్ల సౌకర్యం అందచేయడానికి కొన్ని శతాబ్దాలు పడుతుంది. గతసంవత్సరం కర్నూలు డివిజన్‌లో కొన్ని పనులకు డబ్బు కేటాయించి దానిని ఖర్చుచేయకపోవడానికి కారణాలు తెలియడం లేదు. ఈ విషయమై మంత్రిగారు చెబుతారని అనుకుంటాను కర్నూలు స్పెషల్ డివిజన్‌లో 'forming a by-pass at Dhone' అనే పనికి పోయిన సంవత్సరం లక్ష రూపాయిలు కేటాయించారు. Revised estimate చూస్తే అందులో 100 రూపాయిలు మాత్రం ఖర్చుచేసినట్లు తెలుస్తోంది. అదికూడా ఎందుకు ఖర్చుచేశారో తెలియచేయాలని మంత్రిగారిని కోరుతున్నాను. డబ్బు బడ్జెటులో కేటాయించి ఖర్చు చేయకపోవడం శోచనీయం. ఇక నా నియోజకవర్గం గురించి కొంచెం చెబుతాను. అందులో కృష్ణగిరిఫిర్కా అని ఒకటి ఉన్నది ఆ ఫిర్కాలో కనీసం ఒకమైలు రోడ్డు అయినా లేదు. అది బీద ఫిర్కా. ఎక్కువమంది వేరుశనగకాయ పంట పండిస్తారు, రవాణా సౌకర్యాలు లేని కారణంచేత మార్కెటు రేటుకంటె ఒక రూపాయి తక్కువ అమ్ముకుంటుంటారు. ఫిర్కాచుట్టూ 9, 10 మైళ్ళలోపల రోడ్డే లేదు. ప్రభుత్వం ఈ విషయాల గమనించి ఈ ఫిర్కాలో కనీసం ఒక రోడ్డునైనా, ధోన్‌నుండి కోడుమూరు వరకు అయినా, వేయించాలని కోరుతున్నాను. ఈ రోడ్డు విషయం ఇదివరలో ఆలోచనలో ఉన్నట్లు తెలుస్తోంది. ధనాభావంవల్ల ఆ రోడ్డు వేయడానికి సాధ్యం కాదని అక్కడ అధికారులు చెప్పారు

ఈ విషయములన్నింటినీ విచారించి కావలసిన డబ్బు కేటాయించాలని కోరుతున్నాను. మేజరు డిస్ట్రిక్టురోడ్లుకు గత సంవత్సరము కొన్ని లక్షల రూపాయలు కేటాయించారు. మైనరు రోడ్లుకు కూడా కొంత కేటాయించడము జరిగింది. ఈ విధంగా కేటాయించిన డబ్బును సరిగా ఖర్చుచేయడము లేదు. ప్రతిసంవత్సరము డబ్బు మిగులుస్తూంటే రోడ్లు అభివృద్ధి చెందడం కష్టం. పత్తికొండనుండి ఆదోనికి పోయే రోడ్డులో ఒక వంతెనకు స్థంభాలు కట్టడం కూడా జరిగింది. మూడేళ్ళక్రిందట పెద్ద తుఫాను వచ్చి ఆ స్థంభాలు పడిపోయాయి. ఈ విధంగా ప్రభుత్వము డబ్బు నష్టముగా ఖర్చుకావడంలేదు. ఖర్చు

చేసిన డబ్బు సటిపాలవుతున్నది. ఇకముందు ఇట్లా జరగకుండా ఆ వంతెనను వెంటనే పూర్తిచేయవలెనని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను.

* శ్రీ బి. రామారెడ్డి (మైదుకూరు):- అధ్యక్షా, సివిల్ వర్క్సుకు సంబంధించిన బడ్జట్ మొత్తాన్ని ఆమోదిస్తూ మంత్రిగారికి కొన్ని సూచనలు తెలియ చేయదలచుకున్నాను హైవేస్ డిపార్టుమెంటులో లోయస్టు టెండర్సు కే కాంట్రాక్టుల ఇవ్వవలెనని ఒక నియమము. ఇది చాలా సబబుగా కనిపించినప్పటికి ఇందులో ఉన్న కష్టములను ఆలోచించవలసియున్నది కాంట్రాక్టరుకు సాధారణంగా పన్నెండున్నరనుంచి పదిహేను శాతమువరకు మార్జిన్ ఉంటుందని జనవాక్యము. ఐతే కొందరు కాంట్రాక్టర్లు 25 శాతము, 50 శాతమువరకూ కూడా తక్కువగా కోట్‌చేస్తూ ఉంటారు. అట్టి సందర్భములో లోయస్టు టెండరును అంగీకరించినందువల్ల కొంత నష్టం వస్తుంది పని సరిగా జరగడానికి అవకాశముండదు. ఇంత తక్కువ మొత్తానికి కాంట్రాక్టు తీసుకున్న ఆసామి పనిని కట్టుదిట్టంగా చేయడు కదా అనే విషయము ఆలోచించాలి. పని సక్రమంగా చేయడమయినా అతను మానాలి, లేదా ఉద్యోగులతో ఏవిధముగనైనా లాలోచి పడాలి. అతడు న్యాయంగా పనిచేయాలంటే ఆ మొత్తము సరిపోదు- 12 శాతము కాంట్రాక్టరుకు లాభమున్నది. ఎస్టిమేటు తయారుచేసినప్పుడు ఆ పనికి 40,50 శాతము తక్కువగా కాంట్రాక్టు తీసుకున్నట్లయితే అతనికి ఏ విధముగా గిట్టుబాటవుతుందో నాకు అర్థంకాదు. ఇంజనీర్లు వేస్తున్న ఎస్టిమేట్లను ఎక్కువగా ఉన్నాయని భావించి ప్రతి సంవత్సరమూ 10 శాతమువంతున ఎస్టిమేటును తగ్గిస్తున్నారు ఇట్టి సందర్భములలో కూడా కాంట్రాక్టర్లు పోటీపడి చాలా తక్కువరేట్లకు టెండర్లు పెట్టినందువల్ల ఎట్టి దుష్ఫలితాలు, దుష్పరిణామాలు సంభవిస్తవో గమనించవలసి ఉంది. వీటి కారణంగా పని సక్రమంగా జరుగకపోవడం సంభవిస్తుంది. రెండు సంవత్సరములుండవలసిన రోడ్డు 6 నెలలలోనో, 3 నెలలలోనో పాడైపోతున్నది. ఈ విషయములన్నింటిని గమనించి అధికారులు టెండర్లను అంగీకరించే సందర్భంలో విచక్షణ చూపవద్దని లోయస్టు టెండరు ఐనంతమాత్రాన దానిని అంగీకరించవలెననే నిర్బంధం ఉండరాదని మనవి చేస్తున్నాము. విచక్షణరహితంగా లోయస్టు టెండరుకు యీ పనులు అప్పగించినట్లయితే యీ నిర్మాణాలు సరిగా ఉండవు. ఐతే ఉద్యోగులకు ఇట్టి అవకాశము ఇచ్చినట్లయితే లంచగొండితనము పెరుగుతుందని అనవచ్చు. మనము మన ఉద్యోగులపై మానవత్వంపై నమ్మకముంచాలి. అట్టి నమ్మకము లేనట్లయితే ఇట్టి నిర్మాణాలు చేయించడం కష్టం.

జిల్లా బోర్డు క్రింద ఉన్న ఫామిన్ రోడ్సు వేసే సమయంలో కంట్రాక్టర్లు కట్టిన ధరావత్తు సొమ్ములను ఇంతవరకూ వాపసు చేయడంలేదు. 5,6 సంవత్సరములనుంచి కూడా డబ్బు ఇవ్వని సంఘటనలున్నాయి ఈ కంట్రాక్టర్లలో కూడా చాలా మంది బీదవారున్నారు. రెండు మూడు రూపాయల వడ్డీకి కూడా అప్పుతెచ్చి కంట్రాక్టులు చేసినవారున్నారు. ఇట్టి వారి ఇబ్బందులను గమనించి వారికి వెంటనే ధరావత్తులు వాపసుచేసేటట్లు చూడగోరతాను ఎన్. ఇ. యస్. బ్లాకున్న ఉన్నచోట రోడ్లు వేస్తున్నారు రోడ్సును మూడు స్టేజెస్‌లో పూర్తిచేయవలసి యున్నది మొట్టమొదట మట్టిరోడ్డు వేయాలి ఆ మట్టి సెటిల్ అయిన తర్వాత గ్రావెల్ పరచాలి. అది కూడా సెటిల్ ఐనతర్వాత కంకరరోడ్డు వేసినట్లయితే కొన్ని సంవత్సరాలపాటు ఆ రోడ్డు పనికివస్తుంది. ఈ విధంగా చేయడానికి రెండేండ్లు పడుతుంది. ఐతే ఈ ఎన్. ఇ ఎస్ బ్లాకున్న ఉన్నచోట్ల రెండు, మూడు నెలల్లోనే అన్నిరకముల పనులు ముగించి రోడ్డునిర్మాణము పూర్తి అగుతున్నది ఇటి రోడ్డు రెండు నెలలు కూడా ఉండడము కష్టము గట్టిగా వర్షము కురిస్తే అవి కొట్టుకుపోతాయి. అందువల్ల ఈ ఎన్ ఇ. ఎస్ రోడ్ల విషయంలో కూడ అన్ని స్టేజెస్‌ను పాటించి. కట్టుదిట్టంగా రోడ్డు వేయించగోరుతున్నాను. మా బద్వేల్ తాలూకా తరచు క్షామానికి గురవుతూంటుంది. ఆ సందర్భంలో కూలీలకు పనిచూపించే నిమిత్తం ఫామిన్ రోడ్సు వేస్తారు. ఐతే ఇదివరకున్న బండ్లబాటలమీద మట్టి మశానం తెచ్చి వేయడమువల్ల వర్షాకాలములో బురద క్రింద మారిపోవడము, బండ్లు వెళ్ళడానికి కూడ అవకాశం లేకుండా ఉండడము సంభవిస్తున్నది ఇందువల్ల ప్రభుత్వానికి, యీ పనులు చేయించిన ప్రజానాయకులకు ప్రజలనుంచి దీవనలకు బదులు తిట్లువస్తున్నవి. దైవదుర్విపాకంవల్ల యీ సంవత్సరము మా ప్రాంతములో క్షామపరిస్థితులేర్పడ్డాయి. కాబట్టి ఫామిన్ వర్క్సును ఏర్పాటుచేయించవలెనని మంత్రిగారికి తెలియచేశాను. నాగిశెట్టిపల్లి. సంగిరెడ్డిపల్లిరోడ్డు, సేమరాజుపల్లి- ముడుమాల రోడ్డు ముందుగా నిర్మించవలెనని కోరుతున్నాను

మా తాలూకాలో విరాట్‌స్వరూపం శ్రీ శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారి దేవాలయం ఉన్నది. బొంబాయి, మైసూరునుండి కూడా ఎంతోమంది భక్తులు అక్కడకు వస్తూఉంటారు. ఆ రోడ్డు చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నది. దానిని హైవేస్ డిపార్టుమెంటువారు తీసుకుని మేన్‌టేన్ చేయాలని కోరుతున్నాను చెరుకుపల్లి వేలి అనే ప్రాంతమున్నది. వర్షాకాలంలో అచటి ప్రజలకు ఇతర ప్రపంచంతో సంబంధమేమీఉండదు. ఆ ప్రాంతములో రహదారులను వేయవలెనని కోరుతున్నాను. ఈ పనులను రోడ్డు డెవలప్‌మెంట్ స్కీము క్రింద

తీసుకోనవలెనని మంత్రిగారికి తెలియచేస్తున్నాను వారు దీనిని గురించి ఆలోచిస్తామన్నారు

నంద్యాల—మైదుకూరు—కాడ్పాడి రైలుమార్గాన్ని నెల్లూరు ఇంకొక రైలుమార్గాన్ని వేయవలెననే ప్రపోజలు చాలకాలంనుంచి ఉన్నది. అది ఏ స్థితిలో ఉన్నదీ యీనాటికి తెలియడంలేదు ఈ రైలుమార్గాలు వెనుకబడిన తాలుకాలగుండా పోతాయి కాబట్టి వీటినిగురించి మంత్రిగారు శ్రద్ధచేయవలెనని కోరుతూ నాకవకాశమిచ్చినందుకు అభినందిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

* శ్రీ యన్. పి. చెంగల్రాయనాయుడు (వేపంజేరి) · అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జెట్ పద్దును బలపరుస్తూ రోడ్లను గురించి కొన్ని సూచనలు ఇవ్వదలచుకున్నాను. కరువుపనులుగా మా జిల్లాలలో అనేక గ్రామాలకు రహదారులు ఏర్పాటుచేస్తున్నారు ఈ రహదారులు చాలా అధ్వాన్న స్థితిలోఉంటున్నాయి వర్షములు వచ్చినప్పుడు గండ్లుపడినా వాటిని సరిచేయడానికి ఎవరూ ముందుకు రావడంలేదు జిల్లాబోర్డువారిని అడిగితే యీ రహదారులను ఇంకనూ వారికి స్వాధీనం చేయలేదని అందువల్ల వారు ఏమీ చేయలేమని అంటున్నారు. దీనినిగురించి ప్రభుత్వమువారు ఒక విస్పష్టమైన పద్ధతిని అమలు చేయాలి.

ప్రభుత్వమువారు యిందుకుగాను ఏమీ ఏర్పాట్లు చేయలేదు 2 సంవత్సరాలముందు కొన్ని జిల్లాలలో, ఫామిన్ రోడ్లు మైన్‌టైన్ చేయడానికి కొంత డబ్బు యిచ్చారు మరుసటి సంవత్సరం అటువంటి డబ్బు ఏమీ కేటాయించక పోయినందున, ఆ రహదార్లు చాలా అధ్వాన్నస్థితికి వచ్చాయి. చిత్తూరు జిల్లాలో షుమారు రు 20 లక్షలు ఖర్చుపెట్టి 500 మైళ్లు రహదార్లు వేశారు అన్ని గ్రామాలకు సౌకర్యంగా ఉండేవి. కాని ఈ రోడ్లు యిప్పుడు బండ్లు పోయేందుకు వీలు లేకుండా చాలా అధ్వాన్నపరిస్థితిలో ఉన్నవి. వాటికి ప్రతి సంవత్సరం జిల్లాబోర్డుకు గ్రాంటుగానో, లేక ఏ రూపంగానైనా కొంతడబ్బు యిచ్చి ఆ రహదార్లకు పైన మట్టి పనైనా చేయించే ఏర్పాట్లు చేయాలని కోరుతున్నాను. ఈ రహదార్లు తమకు స్వాధీనం కాలేదని జిల్లాబోర్డ్సు చెప్పుట సబబు కాదు. ప్రభుత్వము, జిల్లాబోర్డ్సు ద్వారా యీ రహదార్లపనులు ప్రారంభించి పూర్తి చేయించారు. కాబట్టి గవర్నమెంటునుంచి రహదార్లను స్వాధీనం చేసుకొనే విషయంలో కాదు. అటువంటి యిబ్బందులేమైనా ఉంటే తొలగించి ప్రభుత్వంవారు స్పష్టంగా ఉత్తర్వులివ్వాలని కోరుతున్నాను.

మార్కెటింగ్ రోడ్సు జిల్లాలో అనేకం ఉన్నవి. జిల్లాబోర్డువారు మేన్‌టైన్ చేస్తున్నారు. పోయిన సంవత్సరం కొన్ని హైవేస్ తీసుకొంటా మన్నారు. చిత్తూరుజిల్లాలో వాటిని జిల్లాబోర్డునుంచి హైవేస్‌వారు స్వాధీనం చేసుకోలేదు. పల్లెపట్టునుంచి నగరికి, దామంచర్లనుండి తిరుపతికి వచ్చేటప్పుడు నేంద్రగుంట వద్ద కలిసే రోడ్డు, చిత్తూరునుంచి అరగొండకు పోయే రోడ్డు—అధ్వాన్నస్థితిలో ఉన్నవి. జిల్లాబోర్డువారు అక్కడ ఎలాంటి పనులు చేయించలేకుండా ఉన్నారు. అక్కడకు కంట్రాక్టర్సు రావడంలేదంటారు అందుకు కేటాయించిన డబ్బుకు వాయిదా పోతున్నది కంట్రాక్టర్సు రాకపోతే ఆ రేట్సు 5, 10 పర్‌సెంట్ పెంచి కంట్రాక్టర్సు వచ్చేటట్లు చూడాలి దామంచర్ల—నేంద్రగుంట రోడ్డు చూస్తే చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నది. బండ్లుకూడా పడిపోతున్నాయి. ముఖ్యముగా నేను యిప్పుడు చెప్పిన మూడు రోడ్లనైనా హైవేస్‌వారు తీసుకొని మేన్‌టైన్ చేయాలని కోరుతున్నాను.

చిత్తూరు జిల్లా నుంచి హైదరాబాదుకు రావాలంటే, రైలు సౌకర్యంగాని, రోడ్డు సౌకర్యంగాని లేక చాలా కష్టముగా ఉన్నది. కాశీకి పోవుటసులభ సాధ్యామేమో గాని హైదరాబాదుకు రావడం కష్టముగా ఉన్నది రైలులో రావాలంటే రెండుమూడు చోట్ల మారాలి. రోడ్డుమీద రావాలన్నా, బెజవాడకు పోయి అక్కడనుంచి రావాలి. ఇటు కర్నూలు నుంచి హైదరాబాదుకు వచ్చే సౌకర్యం కలిగిస్తే బాగుంటుంది. తుంగభద్రపైన బ్రిడ్జి కట్టుటకు ప్రభుత్వం శాంక్షన్ చేసి కంట్రాక్టు యిచ్చారు. అది ఏ స్థితిలో ఉన్నదో తెలియదు. ఆ పనిలో యింతవరకు ఏమీ ప్రోగ్రెస్ కనబడుటలేదు. బెజవాడవద్ద కృష్ణా బ్యారేజి కంట్రాక్టు యిచ్చినప్పుడు పని చురుకుగా జరిగింది. తుంగభద్ర బ్రిడ్జి గురించి కంట్రాక్టర్సు శ్రద్ధ వహించి పని చేయ నట్లయితే వారిని తీసివేసి పనులు చురుకుగా చేయగలిగిన వారికి, కొంత డబ్బు అధికమైనా యిచ్చి పనులు సక్రమంగా త్వరలో జరిగే ఏర్పాట్లు చేయించాలని కోరుతున్నాను ఆ బ్రిడ్జి పూర్తిచేసి, కృష్ణపైన కూడా బ్రిడ్జి కట్టి రహదారి ఏర్పాటు చేస్తే చిత్తూరు జిల్లానుంచి హైదరాబాదుకు వచ్చేందుకు చాలా సౌకర్యముగా ఉంటుంది. ఇప్పుడు నాగార్జునసాగర్ వద్ద బ్రిడ్జి కట్టారు. దానిమీదుగా హైదరాబాదుకు రావచ్చును. కాని ఒంగోలునుంచి, గుంటూరుకుపోయి మాచర్లనుంచి రావాలి. కాని ఒంగోలు నుంచి తిన్నగా, నాగార్జున సాగర్‌కు రహదారి ఏర్పాటు చేస్తే 50, 60 మైళ్ళ దూరం తగ్గుతుంది. ఆ రోడ్డునే వేస్తే చిత్తూరు, నెల్లూరు జిల్లాలనుంచి వచ్చేవారికి వీలుగా ఉంటుంది. అది అవసరమని మనవి చేస్తున్నాను.

ప్రతి సంవత్సరం హైవేస్‌వారికి కొంత అలాట్‌మెంట్ యిస్తున్నారు. అది ఖర్చు చేయలేక పోతున్నారు ఆ డబ్బు ముందుగా యిచ్చి పనులు పూర్తి చేయమంటే చేయగలరుగాని జనవరిలో యిచ్చి మార్చి 31 లోగా చేయమంటే సాధ్యంకాదు. ఈ సంవత్సరం సెంట్రల్ గవర్నమెంట్‌నుంచి యింత రావచ్చును, మన ప్రభుత్వం యింత యివ్వవచ్చును అని అంచనాలు వేసుకొని పనులు ముందుగా ప్రారంభిస్తే మార్చి 31 లోగా పూర్తి చేయడానికి వీలుంటుంది కాబట్టి ఆవిధంగా చేయవలెనని కోరుతున్నాను.

మునుపు జిల్లాబోర్డుల క్రింద ఉన్నప్పుడు ప్రజలు పోయి తమ కష్టసుఖాలు చెప్పుకునేందుకు వీలుగా ఉండేది ఇప్పుడు ఏ రహదార్ల రిపేరు కావాలన్నా నేరుగా ప్రభుత్వానికి చెప్పుకోవలసిన పరిస్థితి ఏర్పడింది అందువల్ల ప్రతి సంవత్సరం కొంత డబ్బు యీ జిల్లాబోర్డులకు యిచ్చి చిన్న చిన్న రహదార్లు రిపేరులు చేయించడానికి ఏర్పాటు చేయాలని మనవిచేస్తున్నాను. ఇంతకు ముందు, తార్‌రోడ్లు కానివి, మెటల్ రోడ్డు—గాంగ్ కూలీలను పెట్టి మేన్‌టైన్ చేసేవారు వారిని యిప్పుడు నిలిపి వేశారు. అలాట్‌మెంట్ డబ్బు ఖర్చు పెట్టాలనే ఉద్దేశంతో మార్చి నెలలో ఆ రోడ్లకు ప్రక్కన పాతగుంటలే తవ్వి కొంత మట్టి పోసి కొత్తగా చూపించడం జరుగుతోంది. డిపార్టుమెంటు వారే అన్ని రోడ్లూ చూడాలంటే సాధ్యంకాదు. మార్చి నెలలో జరిగే పనులు సక్రమంగా జరుగుట లేదు. అందువల్ల గాంగ్ కూలీస్‌ను పెట్టి అన్ని రోడ్లు మేన్‌టైన్ చేస్తే బాగుంటుందని మనవిచేస్తూ విరమిస్తున్నాను

* శ్రీ పి గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు): అధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరుస్తూ, కొన్ని విషయాలు తమద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకు వస్తాను. ప్రభుత్వము రహదారి సౌకర్యములకొరకు ఎన్నో అభివృద్ధి కార్యక్రమములు అమలు జరుపుతోంది. కొన్ని కోట్లు, లక్షలు ఖర్చుపెట్టి యిదివరకు మట్టి రోడ్లుగా ఉన్నవాటిని తారురోడ్లుగానూ, సిమెంటు రోడ్లుగానూ చేస్తున్నారు. అందుకు యీ ప్రభుత్వమునకు నా హృదయపూర్వక ధన్యవాదములు.

శ్రీకాకుళం జిల్లాలో—చీపురుపల్లి, పాతపట్నం, ఇచ్ఛాపురం, సోంపేట యివి కరువు ప్రాంతాలు. పూజ్యులు ప్రధానమంత్రిగారుకూడా ఆ ప్రదేశంలో తిరిగి ప్రజల కష్టసుఖాలను స్వయముగా చూశారు ఇరిగేషన్ వసతులకు [illegible] లక్షల రూపాయలు ఏప్రిల్ నెలలో ఖర్చు చేయడానికి శ్రీకాకుళం జిల్లాకు [illegible] అందుకుగాను చాలా పనులు జరుగుతున్నట్లు భోగట్టా తెలిసినది. కూలివాళ్లకు చాలా పని కల్పించారని ప్రభుత్వమును అభినందిస్తున్నాను.

రోడ్ల మరమ్మతులుకూడా శ్రీకాకుళం జిల్లాలో చేయవలసినవి చాలా ఉన్నవి. పాతపట్టణం తాలూకాలో జమీందారీ రోడ్లు చాలా ఉన్నవి అలాగే టెక్కలి తాలూకాలో ఉన్నవి. ఇచ్ఛాపురం, సోంపేట కరువుప్రాంతమని చెప్పి, రోడ్లు వేశారు. ఆ రోడ్లకు కూడా మరమ్మతు పని ఉన్నది ఆ కరువు ప్రాంతాలలో రోడ్లకోసం యీ బడ్జెటులో కొంత డబ్బు కేటాయించి అక్కడ బీద ప్రజానీకమునకు పనులు కల్పించాలని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను.

రహదారి సౌకర్యాల విషయంలో మా జిల్లాలో తారు రోడ్లు, సిమెంటు రోడ్లు వేయటం జరిగింది అవి చాలవు. ఇంకా చాలా రోడ్లు వేయవలసిఉన్నది. శ్రీకాకుళం-పార్వతీపురం రోడ్డుమీద పాలవలస దగ్గర ఒక చిన్న గడ్డ పైవంతెన కట్టవలసి ఉన్నది. దాని విషయం ప్రభుత్వం వారికి అనేక దఫాలు మనవిచేశాను ఆ పాలవలస దగ్గర ఒక బ్రిడ్జి కడితే బస్సులు, బళ్ళు ప్రమాదం లేకుండా నడప కలుగుతాయి. వంశధారా నదికి నవగాం దగ్గర బ్రిడ్జి కట్టించి పాతపట్నం తాలూకా ప్రజలకు సదుపాయం కలుగజేయవలసిందిగా కోరుతున్నాను. బాహుదా నదికి కొరసవాడ దగ్గర ఒక బ్రిడ్జి కట్టటానికి ఇంజనీర్ గారు అక్కడకు వెళ్ళి చూశారు ఆ బ్రిడ్జినికూడ ప్రభుత్వంవారు కడతారని ప్రజలు భావిస్తు న్నారు అక్కడకూడ ఒక బ్రిడ్జి కట్టటానికి ప్రభుత్వంవారు ప్రయత్నం చేయవల సిందిగా ప్రార్థిస్తున్నాను. నారాయణపురం - పార్వతీపురం రోడ్డు సరైన పరిస్థి తిలో లేదు. జనవరి 6 వ తేదీన ముఖ్యమంత్రిగారు ఆ ప్రాంతానికి వచ్చినప్పుడు అక్కడి ఏజన్సీ ప్రజలు వారికి మెమోరాండాలు ఇచ్చారు ఆ రోడ్డుమీద ప్రతి రోజు రెండు బస్సులు తిరుగుతున్నాయి. ప్రతి సోమవారం సంతకు 200, 300 బళ్ళు వెళుతున్నాయి పార్వతీపురంనుండి 8 మైళ్ళవరకు ఒక రోడ్డు ఉంది. 8 వ మైలు రాయిదగ్గర బ్రిడ్జి కట్టవలసిఉంది ఈ బ్రిడ్జి విషయంలో మనప్రభుత్వం వార్లు ఒరిస్సా ప్రభుత్వంతో సంప్రదించి, ఆ బ్రిడ్జి కట్టేందుకు ప్రయత్నం చేయ వలసిందిగా ప్రార్థిస్తున్నాను అక్కడి ప్రజలకు సౌకర్యం కలుగజేస్తారని ఆశిస్తున్నాను.

పాతపట్నం తాలూకాలో ఉన్న ట్రామ్వే చాలా చిన్నది. అది ఎద్దుబండి వలె నడుస్తుంది. ఆ సంగతి ప్రభుత్వానికికూడ తెలుసు. దానిని మంచి ఇంజన్‌తో బాగా నడిపించేటట్లు చేయించి, గుణుపురంనుంచి పార్వతీపురంవరకు ఆ రైలును నడిపించినట్లయితే ఏజన్సీ ప్రాంతంలో ఉన్న ప్రజలకు ప్రభుత్వంవారు సౌకర్యం కలుగజేసినవారౌతారు.

ప్రస్తుతం ఈ రోడ్ల పని పెద్దపెద్ద కంట్రాక్టర్స్‌కు ఇస్తున్నారు ఆ పని కంట్రాక్ట్‌కివ్వవచ్చును పనిచేయించవచ్చును కాని అక్కడఉన్నఆఫీసర్స్, కంట్రాక్టర్ ఏదో లాలోచి పడుతున్నారని ప్రజలు అనుకొంటున్నారు. అది పోవాలంటే. ఇరిగేషన్ శాఖలో ఎడ్వయిజరి కమిటీలు ఏర్పాటుచేసినట్లు, ఈ రోడ్ల నిర్మాణం విషయంలో కూడ, రాష్ట్ర స్థాయిలో చీఫ్ ఇంజనీర్ అధ్యక్షత క్రింద ఒక కమిటీ ఏర్పాటు చేయాలి అలాగే జిల్లాస్థాయిలో అక్కడఉన్న పెద్దలతో, యం ఎల్ ఏ లతో ఒక కమిటీని ఏర్పాటు చేసి యీ డబ్బు దుర్వినియోగం కాకుండా సద్వినియోగం అయ్యేటట్లు ప్రభుత్వంవారు చేయాలని కోరుతున్నాను. ఆవిధంగాచేస్తే, ఆఫీసర్స్‌లో ఉన్న చెడ్డతనము, కంట్రాక్టర్స్‌లో ఉన్న చెడ్డతనము పోతాయని నేను ఆశిస్తున్నాను ఈ రోడ్స్ వేయటములో, యీ క్వారీలు మార్చమని మా జిల్లా ఇంజనీర్‌గారితో అనేక దఫాలు చెప్పాము కొన్ని క్వారీలు మార్చకుండా తెల్లరాళ్ళు వేస్తున్నారు. దానిమీద బళ్ళు పశువులు తిరిగి నందువల్ల నాలుగు మాసాలు అయ్యేటప్పటికి, ఆ రాయి చితికిపోతోంది నారాయణపట్నం వెళ్ళే రోడ్డులో మూడు మైళ్లవరకు నల్లరాయి వేయమని అనేకసార్లు చెప్పాము. రిక్షాలు, జట్కాలుకూడ ఆ రోడ్డుమీద తిరిగి, విరిగిపోతున్నాయి. కొత్తపట్నం పార్వతీపురం మధ్య రాత్రి 10, 12 గంటలవరకు రిక్షాలవాళ్ళు తిరుగుతూనే ఉంటారు. అటువంటి రోడ్డుమీద మూడు మైళ్ళవరకు నల్లరాళ్ళు వేయించమని అక్కడ ఉన్నటువంటి అసిస్టెంట్ ఇంజనీర్, సూపరవైజర్ మొదలైనవారితో చెప్పాము. ఆ విధంగా చెప్పి రెండు సంవత్సరాలు అయినది. కాని ఇంతవరకు తెల్లరాళ్ళే వేస్తున్నారు అది మెయిన్ రోడ్డుకు సంబంధించింది కాబట్టి, రెండు మూడు మైళ్ళు నల్లరాళ్ళు వేసి, దానిని బాగుచేయించి, అక్కడ ఉన్న ప్రజానీకమునకు తగిన సౌకర్యాలు కలుగజేస్తారని ఆశిస్తున్నాను. బొబ్బిలి తాలూకాలో బలిజిపేట నుండి ఉద్దవాలు, గంగాడ, రాజాం మీదుగా ఒక రోడ్డు వేయటానికి ఎన్నాళ్ళనుండో ప్రపోజల్స్ ఉన్నవని మేము అనుకొంటున్నాము. జిల్లా బోర్డుకూడ ఈ రోడ్డు వేయాలని తీర్మానం చేసినట్లు వారు చెప్పారు. ఇంజనీర్స్ ఇంతవరకు ఆ రోడ్డు పరిశీలించలేదని నేను అభిప్రాయపడుతున్నాను. ఇప్పటికైనా, చీఫ్ ఇంజనీర్‌గారు శ్రీకాకుళం జిల్లా వచ్చి, బలిజిపేటలో కేంప్ చేసి, బలిజపేటనుండి రాజాం పోవటానికి ఒక రోడ్డు వేయించాలని ప్రార్థిస్తున్నాను. జిల్లాబోర్డులో డబ్బు ఖర్చు పెట్టటానికి, జిల్లా బోర్డు రోడ్స్ బాగుచేయించటానికి ఏవిధమైన అధికారం శాసనసభ్యులకు లేదు. ఆ అధికారం అక్కడి ప్రజలకుకూడ లేదు. ఆ అధికారం అంతా కలెక్టరుచేతిలో ఉంది. "జిల్లా బోర్డు ఎన్నికలు జరుగలేదు; బ్లాక్ కమిటీలు వస్తాయి" అని అంటున్నారు కనుక, ఆ బ్లాక్

కమిటీలు వచ్చేంతవరకు యం. ఎల్. ఏస్ లెవెల్‌లో ఒక కమిటీ ఏర్పాటుచేసి జిల్లాబోర్డు డబ్బు బాగా సద్వినియోగం అయ్యేటట్లు ప్రభుత్వంవారు చూస్తారని ఆశిస్తున్నాను

ఇదివరకు మంత్రిగారితో రెండుమూడు దఫాలు నేను మనవిచేశాను హైదరాబాదు రావాలంటే, పార్వతీపురంలో బండిఎక్కి ఒక రోజంతా విజయనగరంలోనో, విశాఖపట్నంలోనో ఉంటేగాని మేము హైదరాబాదు రైలు అందుకోటానికి వీల్లేకుండా ఉంది. హైదరాబాదు వచ్చే రైలుకు, రాయపూర్ మెయిల్‌కు కనక్షన్ ఉండేటట్లుగా టైమ్స్ ఏర్పాటు చేస్తే, మాకు, ప్రజలకు ఇబ్బంది లేకుండా ఉంటుంది ఆవిధంగా చేసి మాకు ఇబ్బంది లేకుండా చేస్తారని ఆశిస్తున్నాను బొబ్బిలినుండి విజయనగరం వరకు ఒక పాసింజర్ రైలు వేయమని బొబ్బిలి లేబర్ ఎసోసియేషన్‌వారు, సుగర్ ఫ్యాక్టరీవారు అనేకసార్లు అడిగిఉన్నారు. సాలూరుకు ఎలాగూ పాసింజర్ వేశారు కాబట్టి, విజయనగరం వరకు ఆ బండిని నడిపించే ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను బొబ్బిలి, సీతారాం సుగర్ ఫ్యాక్టరీలు ఉన్నవి వాటికి ప్రభుత్వం కొంతడబ్బు ఇస్తున్నట్లు తెలుస్తోంది. చెఱకు ప్రతి గ్రామంలోను హెచ్చుగా పండించబడుతున్నది 500 రూపాయలు పెట్టి పశువులు కొన్నప్పటికీ, అవి 20 టన్నుల చెరకు లాగేటప్పటికి పనికిరాకుండా పోతున్నవి. ఎందుకంటే అక్కడ రోడ్లు సరిగా లేవు. ఫ్యాక్టరీవారి దగ్గరనుండి ఈ రోడ్ల నిమిత్తం కొంతడబ్బు తీసుకొని, ప్రభుత్వంవారుకూడ కొంతడబ్బు ఈ రోడ్ల కొరకు ఖర్చుపెట్టి, బాగుచేస్తారని ఆశిస్తూ, నాకు ఈ అవకాశం ఇచ్చిన అధ్యక్షులకు నా ధన్యవాదాలు తెలియజేస్తూ విరమిస్తున్నాను.

శ్రీ డి. నరసయ్య (హుజూర్‌నగర్) : అధ్యక్షా, ఈ పద్దు ప్రవేశపెట్టిన మంత్రిగారిని అభినందించలేకపోతున్నందుకు నేను విచారిస్తున్నాను. మనము ఈనాడు రెండవపంచవర్షప్రణాళిక గురించి మాట్లాడుకొంటున్నాము. రెండవ పంచవర్షప్రణాళిక ద్వారా, దేశంలో ఎన్నోమార్పులు తీసుకురావాలని అనుకొంటున్నాము. గ్రామాలలో ఉన్నటువంటి రోడ్ల సౌకర్యాలు [illegible] గ్రామాలలో ఉండే భవనాలు అభివృద్ధిపర్చటంద్వారా గ్రామాలలో మార్పుతీసుకురావాలని అనుకొంటున్నాము. ఇప్పుడుఉన్న రోడ్లపైన [illegible] రోడ్లపైన డబ్బు ఖర్చుపెట్టబడుతున్నదేగాని, క్రొత్తగా తీసుకువస్తున్న స్కీములేవీ ఇందులో లేనట్లు, మంత్రిగారు ప్రవేశపెట్టిన పద్దు చూస్తే తెలుస్తుంది. ప్రస్తుతం కమ్యూనికేషన్సులేని ప్రాంతంలో క్రొత్తగా మనం కమ్యూనికేషన్స్ సౌకర్యాలు కలుగజేస్తున్నామనిచెప్పటానికి అవకాశం కలుగజేయనందువల్ల, నేను మంత్రిగారిని అభినందించలేకపోతున్నాను.

ఈపరిస్థితినంతా వివరించటానికి నాకు ఇప్పుడు టైములేదు. కాని యీవిషయములన్నీ మంత్రిగారి దృష్టిలోనే ఉన్నవి వారు స్వయముగ యీ ఎసెంబ్లీలోనే సమాధానము చెప్పిన సందర్భములున్నవి సూర్యాపేట నుంచి వరంగల్లుకు రోడ్డు సౌకర్యాలు కలుగజేయవలసిందని స్థానిక ప్రజలు చాలా కాలముగ ఆందోళన చేస్తూవచ్చారు. దీనిని గురించి క్రిందటి సమావేశములో చర్య తీసుకుంటున్నానని మంత్రిగారు చెప్పారు కాని ఆవిషయము యీడిమాండును గురించి వారు చేసిన ఉపన్యాసములో ఏమీ కన్పించదు. దానిని యీడిమాండులో ఎందువల్ల చేర్చలేదో మంత్రిగారు వివరించాలని అంటున్నాను అన్నింటికంటె ముఖ్యంగా ఆ తాలూకా కేంద్రానికి నాలుగువైపుల నుంచి రావటానికి రోడ్డు సౌకర్యాలు ఏర్పాటును గురించి ఆలోచించవలసిన అవసరమున్నది పూర్వము ఎప్పుడో వేసిన రోడ్లు ఉన్నవికాని వాటితో కలిసే రోడ్లు మూలప్రాంతాల నుంచి ఏవీ ఏర్పాటుచేయలేదు ఒక జిల్లానుంచి ఒక జిల్లాకు పోవటానికి జిల్లాలో మూలప్రాంతాలనుంచి రావటానికి రోడ్డుసౌకర్యాలు బొత్తుగాలేవు. నల్లగొండజిల్లాకు సంబంధించిన విషయాలను గురించి బైటజరిగే చర్యలకు, ప్రచారానికి అనుగుణ్యముగ మంత్రులుకూడ ప్రవర్తిస్తున్నారు నల్లగొండ జిల్లామీద మంత్రులు సీతకన్ను వేసినట్లుగా నేను భావిస్తున్నాను. దానికి రాజకీయాలే కారణమని స్థానికప్రజలు చెప్పుకుంటున్నారు నిజపరిస్థితి మంత్రిగారికి తెలుసును నలగొండ జిల్లాలోని సూర్యాపేట ముఖ్యమైన వ్యాపారకేంద్రము. సూర్యాపేటనుంచి వరంగల్లుకు పోతున్నప్పుడు, మధ్యన సగమునుంచి ఉత్తరమున మానికోట తాలూకాకు పోవటానికి రోడ్డు సౌకర్యాలు కలుగజేయమని ఎంతోకాలముగ ప్రజలు ఆందోళన చేస్తున్నారు కానీమానుకోట తాలూకాకు రోడ్డు వేయటానికి స్కీము యిందులో చేర్చలేదు. అదేవిధముగ సూర్యాపేట నుంచి మిరియాలగూడెం పోవటానికి ఒక్కరోడ్డు అయినాలేదు. తరువాత హుజూర్‌నగర్ తాలూకాలో కృష్ణాతీరపు ప్రాంతము ఉన్నది. అక్కడ దాదాపు 20, 25 మైళ్ల వరకు అనేక గ్రామాలు ఉన్నవి. ఆగ్రామాలనుండి తాలూకా కేంద్రానికి రావాలంటే, అటు జగ్గయ్యపేటకు అయినా పోవాలి. లేదా, యిటు హుజూర్‌నగరముకైనా రావాలి. ఈలోపల ఎక్కడచూచినా వ్యాపారకేంద్రాలు దగ్గరలోలేవు. రోడ్డు సౌకర్యాలు చూస్తే, సరైనవిలేవు. ఇలాంటి పరిస్థితి ఎందువల్ల ఏర్పడింది? ఆప్రాంతము చాలా సారవంతమైనది. దానికే కృష్ణాతీరపు ప్రాంతమంటారు. అక్కడ పొగాకు, మిర్చి వగైరా వ్యాపార పంటలు లక్షలకొలది ఖరీదు చేసేవి పండిస్తున్నారు. ఈవ్యాపార పంటలు అమ్ముకోవాలంటే వ్యాపారకేంద్రానికి పోయి అమ్ముకోవాల్సిందే దానికి 20, 25 మైళ్లలోపల ఎక్కడను రోడ్డు

సౌకర్యాలుగల కేంద్రాలులేవు రోడ్డు సౌకర్యాలు బాగుగలేవు ప్రభుత్వము కోట్లకొలది, లక్షలకొలది డబ్బు ఎక్కడెక్కడో ఖర్చుచేసేబదులు అక్కడమంచుగ రోడ్డు సౌకర్యాలు ఎందువల్ల ఏర్పాటు చేయకూడదు? ప్రభుత్వము శ్రద్ధ వహించకము లేదని స్థానికప్రజలు గుర్తించగలిగిన పరిస్థితిలోనే ఉన్నారు. ప్రభుత్వము డబ్బు ఖర్చుచేయకూడదని నేను చెప్పడములేద కాని, అవసరమైన అలాంటి చోట్లలో ముందు సరైనరోడ్డు సౌకర్యాలు కలుగజేయమని మంత్రిగారిని కోరుతున్నాను. ప్రభుత్వము ఎక్కడైనా రోడ్డు ఉంటే దానిమీద తారువేయండి లేకసిమెంటు రోడ్డు చేయండి, వద్దని చెప్పడములేదు. కాని ఏదిముందు, ఏదివెనుక అనే వివక్షణతో ఖర్చు చేయమని అంటున్నాను పండించిన పంటలనైనా అమ్ముకొనటానికైనా రైతులకు ఈ కనీసపు సౌకర్యాలు అవసరము ఇంతవరకు అలాంటిది ప్రభుత్వము ఆలోచించి చేయకపోవడము చాలావిచారకరముగ ఉన్నది. ఆవిధముగ చేయకపోవడమువల్ల ప్రభుత్వము దుబారా ఖర్చుచేస్తున్నారని ప్రజలు భావిస్తున్నారని చెప్పవలసివస్తున్నది హుజూరునగరము తాలూకాలో కృష్ణా తీరపు ప్రాంతాన్ని కలపటానికి రోడ్డు వేయవలసిందిగా పూర్వము నైజాము ప్రభుత్వము ఉన్నప్పటి నుంచి ప్రజలు కోరుతూ, ఆందోళన చేస్తూవచ్చారు ఆనాటి ప్రభుత్వము రోడ్డు వేస్తామని కూడ వాగ్దానము చేసింది కాని ఈనాటి వరకు అది జరగలేదు మంత్రిగారు ఇప్పటికైనా దానియొక్క అవసరమును గుర్తించి వెంటనే ఆరోడ్డు వేయుటానికి చర్యతీసుకుంటారని ఆశిస్తున్నాను. వరంగల్లు జిల్లాలో జనగాం తాలూకాలో బమ్మెర మొదలైన యాత్ర ప్రదేశములున్నవి. ఎంతో మంది యాత్రీకులు వస్తూఉంటారు జనగాం తాలూకాలో గణాపురం నుంచి పాలకుర్తికి పోవటానికి రోడ్డు వేయమని ప్రజలు ఆందోళన చేశారు. ఇది చాలా ముఖ్యమైన యాత్రాస్థలము. ఇటీవల లోక్‌సభ స్పీకరు అనంతశయనము అయ్యంగారు వచ్చిచూచారు వారితో అక్కడ ప్రజలు విజ్ఞప్తిచేశారు. వారు కూడ కేంద్రప్రభుత్వముతో సంప్రదిస్తానని వాగ్దానముచేసి వెళ్లారు. ఇలాంటి ముఖ్యమైన ప్రదేశమునకు రోడ్డువేయటానికిఒక స్కీమునైనా చేర్చలేదు.

[*Mr. Speaker in the Chair*]

ఇంకను మరికొన్ని ముఖ్యమైన ప్రదేశాలు రోడ్డు వేయవలసినవి ఉన్నవి. పాకాల, రామప్ప, లేతవోలు మొదలైనవి పెద్దపెద్ద చెరువులు ఉన్నవి. వాటికి ఆయకట్టురోడ్డు లేదు. ఆకారణము చేత ఆప్రాంతములో వ్యవసాయము దెబ్బ తింటున్నది. ఆయకట్టురోడ్డు ఏర్పాటు చేయకపోవడమువల్ల రెండవ పంటకు సాగుకావటములేదు. కాబట్టి ఈ ఆయకట్టు రోడ్డుకూడ త్వరలో నిర్మించటానికి మంత్రిగారు శ్రద్ధవహిస్తారని ఆశిస్తున్నాను.

నల్లగొండ జిల్లాకు ఉపయోగించే నాగార్జునసాగర్ ప్రాజెక్టు తయారవుతున్నది అక్కడినుంచి బొగ్గుగనులకు పోవటానికి రైలుమార్గము వేయాలని ప్రజలు కోరుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌కు అంతటికీ ఒకె రైల్వే జోను ప్రభుత్వం సాధించలేక పోయినందులకు విచారకరముగనున్నది కేంద్రప్రభుత్వమును ఒత్తిడి చేసి అయినా మనకు ప్రత్యేకంగా రైల్వే జోనును సాధిస్తారనుకుంటున్నాను నల్లగొండ జిల్లాలో భువనగిరి ఒకమూలగ ఉన్నది. దానికి మాత్రమే రైలు సౌకర్యాలులేవు. ఈనాడు మనకు నాగార్జునసాగర్ అనేది ఒకటి జాతీయ ప్రాజెక్టును నిర్మించుకుంటున్నాము గనుక దానితో కలిపే రైలుమార్గమును ఏర్పాటుచేయటానికి అవసరమైన స్కీమును త్వరలో అమలు పరచటానికి ప్రభుత్వము శ్రద్ధ తీసుకుంటుందని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

* ఆర్. నరసింహారెడ్డి (గజ్వేల్—జనరల్) అధ్యక్షా, గౌరవనీయులైన P. W. D మంత్రిగారు ఈ దినము ప్రవేశపెట్టిన డిమాండ్లను నేను బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయాలు వారి దృష్టికి తేదలచుకున్నాను గజ్వేల్ తాలూకాలో ఒడ్డారం నుంచి గజ్వేల్ వరకు ద్వితీయ పంచవర్షప్రణాళిక క్రింద రోడ్డు వేయటానికి ప్రథమ పంచవర్షప్రణాళిక అమలు జరిగేటప్పుడే జిల్లాబోర్డువారు సిఫార్సుచేసి యున్నారు. కాని ఇది యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడ చేర్చబడియుండలేదు. ఎల్లాపురము వంతెన ఒకటి కట్టటానికి మూడు సంవత్సరముల పరిమితి అని నిర్ణయించారు. ఆ నిర్ణయముజరిగి యిప్పటికి 2 సంవత్సరములు జరిగినను అందులో ఎనిమిదవ వంతు పని అయినా జరగలేదు. పని ఎందువల్ల చురుకుగ చేయించడములేదని ఆ కంట్రాక్టరు పైన ఏలాంటి చర్యకూడ తీసుకోలేదు అక్కడ జరిగే పని చూస్తే దినమునకు 10, 15 మంది కూలీలకంటే పని చేయడములేదు ఇంత కొద్దిమంది కూలీలతో ఆ పని పూర్తికావటానికి ఎన్నాళ్లుపడుతొందో ఇంజనీర్లు అయినా గుర్తించి ప్రభుత్వానికి తెలియజేసినట్లులేదు. ఈ పని ఈ రేటున జరిగితే, అది పూర్తిఅయ్యేటప్పటికి ఏ పదిహేను ఇరవై సంవత్సరాలో పట్టేటట్టుగా ఉన్నది ఇంత ఆలస్యము ఎందువల్ల జరుగుతున్నదని అక్కడ పని ఆజమాయిషీచేసే ఇంజనీరుకూడ ఏలాంటి చర్యతీసుకోకుండా మిన్నకొన్నాడు. ఇద్దరు పరీకు అయినట్లు అనుమానము కలుగుతున్నది. ఈ విషయమును గురించి మంత్రిగారు వెంటనే విచారణ చేయించి తగుచర్య తీసుకోవలసిందిగా కోరుతున్నాను.

గజ్వేల్ యీమధ్యనే తాలూకా కేంద్రంగా ఏర్పాటు చేయబడినది. కాని అక్కడ ఒక్క ప్రభుత్వ కార్యాలయానికి కూడా భవనంలేదు. తహసీల్దారు

ఆఫీసు ఉన్న ఇంటిలోనే పోలీసు కచేరీ, వ్యవసాయశాఖ ఆఫీసులు కూడా ఉంటు న్నాయి. వాటికి వేరే buildings నిర్మించాలని యిదివరకెన్నోసారులు ప్రభుత్వానికి మనవిచేశాము. కనీసం తహసీల్దారు ఆఫీసుకు అయినా యీ రెండవ పంచవర్ష ప్రణాళికలో ఒక building నిర్మించాలని కోరుతున్నాము.

మెదక్ నుంచి ఎల్దుర్తి వరకూ (Local Fund Road) ఒక మట్టిరోడ్డు యిదివరకే వేయబడినది. సుమారు 10 సంవత్సరాలనుంచీ దానిని మరమ్మత్తులు చేయించకపోవడంవల్ల దానిపై బండ్లు పోవడానికి వీలులేకుండా ఉన్నది. కనీసం పక్కారోడ్డుగానైనా ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఈ పని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కనిపించడంలేదు. దీనిని రెండవ పంచవర్ష ప్రణాళికలో చేరుస్తారని ఆశిస్తున్నాను. సంగారెడ్డి నుంచి నర్సాపురం మీదుగా తూపరాకు ప్రభుత్వంవారే ఒక రోడ్డును ఏర్పాటుచేశారు. కాని యింతవరకూ ఆరోడ్డు విషయం ఏమి జరిగినదో మాకు తెలియలేదు. ఇక కొద్దిరోజులలో tenders పిలువబడుతుంది, contract ఇవ్వబడుతుంది అన్నారు. కాని ఇంతవరకూ contract కు ఇవ్వబడలేదు, tenders పిలువలేదు. ఆరోడ్డుపని ఎప్పుడు పూర్తిచేయబడుతుందో చెప్పాలని మంత్రిగారిని కోరుతున్నాను. దానిని ఇంతవరకూ పూర్తిచేయక పోవడానికి కారణాలు ఏమిటి?

మెదక్ తాలూకాలో సర్దెననుంచి ఘనాపూర్ వరకు Local Fund Road ఉన్నది. అది 10 సంవత్సరాల క్రితం వేయబడినది. అప్పటినుంచి మళ్లా ఆరోడ్డును మరమ్మత్తు చేయకపోవడంవల్ల అక్కడక్కడ కట్టినవంతెనలు అన్నీ రోడ్డుతోబాటు శిథిలమైపోతున్నాయి. రోడ్డు పనికిరాకుండా పోతున్నది. కాబట్టి దానిని పక్కారోడ్డుగా అయినా తయారు చేయమని చెబుతున్నాను. లేక దానిని local fund నుంచి మరమ్మతు చేయించడానికి అవకాశాలున్నాయా, లేదా, చెప్పాలని కోరుతున్నాను. ఎల్లాపూరు రోడ్డు విషయంలో - ముందుగా ఇంకొక రోడ్డువేసి అది తీసివేసి మరల యింకొక రోడ్డు ఏర్పాటు చేసినందువల్ల ఎన్ని వేల రూపాయిలు వృథాగా ఖర్చు అయినాయో చెప్పలేదు. అట్లజరగడానికి కారణాలు ఏమిటి? ఆపని-చేయించుటలో అక్కడి ఇంజనీరు ఎవరు? ఆయనపైన ఏమిచర్య తీసుకొన్నారు? వీటిపైన మంత్రిగారు సరైన సమాధానం చెప్పలేదు. కాబట్టి ఇప్పుడు ఆ ఇంజనీరుపైన ఎలాంటి చర్యలు తీసుకున్నారో చెప్పాలని కోరుతున్నాను. నాకు యీ అవకాశం ఇచ్చిన అధ్యక్షులకు ధన్యవాదాలర్పిస్తూ విరమిస్తున్నాను.

* శ్రీ జి. సూర్యనారాయణ అధ్యక్షా, రోడ్లను, బిల్డింగులను గురించి మనం కొన్ని కోట్ల రూపాయలను ఖర్చుచేస్తున్నాము. అయితే యీ Building Societies వలన మధ్యతరగతి వారికి పేదప్రజలకు ఏమైనా లాభం కలుగుతున్నదా అని ఆలోచిస్తే ఏమీలేదని స్పష్టంగా తెలుస్తుంది. అయితే, ఇవి ఎవరికి లాభిస్తున్నదనేది నా ప్రశ్న. దీనివల్ల డబ్బున్నవారే ఇంకా డబ్బు సంపాదించుకోడానికి అవకాశాలు కల్పిస్తున్నారు, కాని పేదవారికేమీ సహాయం లభించడం లేదు. కొన్ని వంతెనలు నిర్మించడానికి ప్రభుత్వం ఆలోచిస్తోంది."విశాఖపట్టణంలో రెండు వంతెనల నిర్మాణం పూర్తి అయినది, యింకా కొన్ని వంతెనలు కట్టే విషయం ప్రభుత్వాలోచనలో ఉన్నదని మంత్రిగారు చెబుతున్నారు. కాని విశాఖపట్టణంలో రెండు వంతెనలు ఎక్కడ నిర్మించారో తెలియదు. ఈ వంతెనలు నిర్మించుటలో High Ways Department కు contract ఇస్తున్నారు. శృంగవరపుకోట తాలూకాలోని కోరుకొండ ప్రాజెక్టు 4 సంవత్సరములనుంచీ నిర్మాణంలో ఉన్నది. ఇప్పటికి రెండు మూడు కానాలు తయారుచేశారు, కాని పూర్తి కాలేదు. ఆపని పూర్తి అయిపోయినదని ప్రభుత్వదృష్టికి వచ్చినదనుకొంటాను. దానిని కట్టే విశాఖపట్టణంలో రెండువంతెనలు పూర్తి అయినాయని మంత్రిగారు ప్రకటించారు కాబోలును. కాని నిజంగా, ఆ వంతెన నిర్మాణం పూర్తికాలేదు. శృంగవరపుకోటలోని గొల్లపల్లివద్ద ఒక వంతెన నిర్మించాలని 1952వ సంవత్సరం నుంచీ ప్రభుత్వానికి పదేపదే విజ్ఞప్తిచేస్తున్నాము. దానినిగురించి ప్రభుత్వం ఏవిధమైన చర్య తీసుకోలేదు. గజపతినగరం నియోజకవర్గంలోని చంపావతి నదికి వంతెన నిర్మించాలని ప్రభుత్వానికి అనేక మెమొరాండాలు పంపించగా, 3 లక్షల రూపాయలకు estimate చేసినట్లు, ప్రభుత్వం మంజూరుచేసినట్లు ప్రకటించారు. కాని ఈ మధ్య ప్రశ్నల సందర్భంలో దానిని గురించిన ప్రసక్తేలేదని మంత్రిగారు చెప్పారు. ఈ విధంగా పరిపాలనావిధానం సాగుతున్నది. విషయాలన్ని ప్రజలు తెలుసుకొంటున్నారు. ప్రకటనలు చేసినవిధంగానే, ప్రజలకు కావలసిన కార్యకలాపాలను కూడా చేస్తే మంచిది అనుకొంటున్నాను అట్లా చేస్తే ప్రజలు ఆనందంతో ప్రభుత్వాన్ని గౌరవిస్తారు. అంతేకాని, ఇదిగో జరిపిస్తున్నాము, అంచనాలు వేస్తున్నాము, కాగితాలమీద ఉన్నాయి" అని చెప్పడం చాలా విచారకర్యం.

విశాఖపట్టణం జిల్లా రోడ్ల విషయంలో చాలా వెనుకబడి ఉన్నది. విశాఖపట్టణం జిల్లా గజపతినగరం నియోజకవర్గంలోని గ్రామాలనుండి గరిక వలస — యీమధ్య 25, 30 గ్రామాలవారు, స్థానికఉద్యోగులకు అందరికి ఒక రోడ్డు

వేయించాలని మెమోరాండాలు పంపించారు. ప్రభుత్వానికి పదే పదే చెబుతున్నాము. అదేవిధంగా గజపతినగరంనుండి ఆంధ్ర జమీందారు ఉండే గ్రామానికి ఒకరోడ్డు ఉన్నది. ఏజెన్సీప్రాంతం ప్రజలు ఎక్కువగా ఆ రోడ్డు మీద వస్తుంటారు. ఏజెన్సీప్రాంతం నుంచి ఆహారదినుసులను తీసుకొని విజయనగరం మార్కెట్టుకు పోవడానికి అదే త్రోవ. అనేకవేలమంది ఆత్రోవన వెళ్ళవలసి యున్నది. చాలా కాలం నుంచీ ఆ రోడ్డు పాడైపోయిఉన్నది. దానిని గురించి అక్కడ జిల్లాకలెక్టరు లగాయితూ, ఇక్కడ మన ప్రభుత్వం దృష్టికికూడా తెచ్చాము కాని ఇంతవరకూ దానిని గురించి ఏవిధమైన చర్యలూ తీసుకోలేదు. ఆ రోడ్డు అట్లానే ఉండిపోయింది. ప్రభుత్వం మాటలు చెప్పడంకంటె అక్కడి ప్రజలకు కావలసిన కార్యములు వెంటనే చేయవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను "ఏదో సోషలిస్టు పార్టీవారు, కమ్యూనిస్టు పార్టీవారు చెబుతున్నారు. మేము దానిని రాజకీయ పార్టీలవారిగా గుర్తించము. వారు అబద్ధాలన్నీ తీసుకువచ్చి అసెంబ్లీలో అరుస్తున్నారు" అనే దృష్టితో కాకుండా ప్రజా ప్రతినిధులు చెబుతున్నారనే విషయాన్ని ప్రభుత్వం గుర్తించాలి "Opposition party వారు కాబట్టి oppose చేస్తున్నారు' అనే విషయం ఎల్లప్పుడూ వస్తూంటుంది. కాని మాకు అటువంటి దృక్పథం లేదు. ప్రజాసౌకర్యాలను గురించి మేము చెబుతున్నాము ప్రజలకు సౌకర్యాలు కలుగజేయకపోతే ఇది ప్రజాస్వామ్య ప్రభుత్వం అనిపించుకోదు 'ప్రజాస్వామ్యం' అని ఒక ప్రక్కన అంటూ ఉంటారు. ప్రజలకు సౌకర్యాలు కలుగజేస్తున్నామని చెప్పుతున్నారు. అయితే ఏ ప్రజలకు సౌకర్యాలు కలుగుతున్నాయి అని ప్రశ్నిస్తున్నాను. Building Societies వలన పేద ప్రజలు ఇండ్లు కట్టుకోడానికి అవకాశాలు కల్పిస్తున్నాము అని చెబుతున్నారు. ఎంతమంది పేదప్రజలు యీ బిల్డింగులలో నివశిస్తున్నారో, ఎంతమంది యీ సౌకర్యాలను అనుభవించుతున్నారో ప్రభుత్వానికీ తెలుసును. ప్రజాప్రతినిధులందరికీ తెలుసును. పెదప్రజలకు ఏమాత్రమూ ఉపయోగించటలే . ఎక్కువగా డబ్బుఉండి, contracts పొందినవారికి వాటివలన సౌకర్యాలు కలుగుతున్నాయి ఇంకా డబ్బును సంపాదించుకొంటున్నారు. ఇప్పుడు ప్రభుత్వం అవలంబించే పద్ధతి సరైనదికాదు. సమగ్రంగా ఆలోచించి ఒక చక్కని విధానాన్ని అవలంబించాలని పదే పదే చెబుతున్నాము. ఇట్లా అయితే ఇది ప్రజాప్రభుత్వం అనిపించుకోదు అనుకొంటున్నాను. ఉన్నవాడికే తిండిపెట్టి లేనివాడి పొట్టనూడ్చడం అనేది ప్రజాస్వామికం కాజాలదు.

అందువల్ల ఒక చక్కని మార్గాన్ని ఆలోచించి పేదలకు ఇండ్లసౌకర్యం, తిండి సౌకర్యం కలుగ జేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేయుచున్నాను

భీమునిపట్టణం ఒక ప్రధాన స్థానం. అక్కడఓడరేవు పురాతనకాలంలో ఉండేది. కాని మధ్యకాలంలో ఏకారణంవల్లనో పోయింది. అది మంచిరేవు అంతేగాక చిట్టివలసలో Ju'e Mill ఉన్నది. రాకపోకలకు ప్రధానమైన స్థలం కాన భీమునిపట్టణంలో ఒక కేంద్రమును ఏర్పాటుచేసి అక్కడఉన్న ప్రజలకు వృత్తులు కల్పిస్తారని ఆశిస్తున్నాను

గజపతినగరం నియోజకవర్గంలోని చంపావతి నదిమీద ఒక వంతెన కట్టడం చాలా అవసరం. విశాఖపట్టణం, పెద్దాపురం, కాకినాడ, బెజవాడమొదలైన ప్రాంతాలనుండి సరకులు బొబ్బిలి, రాయగడ మొదలైన ప్రాంతాలకు పోవుచున్నవి. ఈ చంపావతినది పొంగి నీరు ప్రవహించుచుండుటచే రాకపోకలు, రవాణా స్తంభించిపోతున్నవి. కాబట్టి వచ్చే సంవత్సరమైనా ఈవంతెనను నిర్మించాలని విజ్ఞప్తిచేస్తున్నాను.

తర్వాత గోపాలపల్లివద్దకూడ ఒక వంతెనను నిర్మించాలి శృంగవరపుకోట ఏజెన్సీ ప్రాంతంనుండి విజయనగరం మార్కెట్టుకు కొండప్రజలు దినుసులు తీసుకువచ్చుటకు ఈవంతెన నిర్మాణం చాలా ముఖ్యం అదేవిధంగా కోనాడు నుండి శ్రీకాకుళమునకు పోయేరోడ్డు చాలా పాడైపోయింది కోనాడులో Salt Factory ఉన్నది. ఆరోడ్డును బాగుచేయాలని విజ్ఞప్తిచేస్తూ సెలవు తీసుకుటున్నాను.

శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి (కాసిగి) : అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈపద్దును సమర్థిస్తూ ఈదిగువ సూచనలు చేయదలచుకున్నాను.

కర్నూల్ నుంచి ఆదోనికి 62 మైళ్ళు ఉన్నది. ఇదివరకు కర్నూల్ ముఖ్యపట్టణంగా ఉన్నప్పుడు ఆరోడ్డును బ్లాక్ టాపింగు చేస్తామని ప్రభుత్వంవారు అన్నారు. కాని ఇంతవరకు చేయలేదు. అది హైవేస్ రోడ్డు అది చాలా పాడైపోతున్నందున ట్రాఫిక్ ఇబ్బందిగా ఉన్నది. కాన త్వరగా దానికి బ్లాక్ టాపింగు చేయించాలని కోరుతున్నాను.

ఆదోని - మంత్రాలయంరోడ్డు దాదాపు 85 మైళ్ళు ఉన్నది. అది పవిత్రమైన యాత్రాస్థలం. అచ్చటికి ఉత్తర, దక్షిణ దేశంనుండి చాలామంది యాత్రికులు వస్తుంటారు. ఆరోడ్డు చాలా హీనస్థితిలో ఉన్నది. ఆరోడ్డులో కొంత డిస్ట్రిక్టుబోర్డు క్రింద, మరికొంత హైవేస్ క్రింద ఉండేది. మొన్ననే పూర్తిగా

హైవేస్ క్రిందికి మార్చాట్లు మంత్రిగారు తెలిపినారు అది చాలా సంతోషం ఆరోడ్డులో మూడు నాలుగు బ్రిడ్జీలు ఉండేవి. వాటిలో రెంటిని 1947-48 లో abandon చేసి foundation మాత్రం వేసి వాటిని అలాగే వదలివేసినారు. బ్రిడ్జీలను కట్టనందువల్ల అక్కడ వాటి డైవర్షన్ సరిగా చూపనందువల్ల మూడు నెలల క్రితం దాదాపు 30 వేల ఖరీదు చేసే ఒక క్రొత్తలారీ తాటిచెట్టుతో ఢీకొని లారీ భస్మంకావడం, నలుగురు మరణించడం జరిగింది. డిపార్టుమెంటువారు అశ్రద్ధగా ఉండి ఆబ్రిడ్జీలపని జరపనందున డైవర్షన్ సరిగాలేనందున అంత అఘాయిత్యం జరిగింది. అందువల్ల పదియేండ్ల క్రితం abandon చేసిన ఈ బ్రిడ్జీలను త్వరలో కట్టించాలని ప్రభుత్వమును కోరుచున్నాను. మంత్రాలయ గ్రామానికి మంత్రాలయ రోడ్డు రైల్వేస్టేషన్ తొమ్మిది మైళ్ళు ఉంటుంది. అక్కడ తుంగభద్రా నది పాత హైదరాబాదును, బళ్ళారి జిల్లాకు విభాగం చేస్తుంది దానిమీద ఉన్న రైల్వే బ్రాడ్ గేజ్ బ్రిడ్జి దాదాపు 1230 అడుగులు ఉంటుంది. దానిప్రక్కనే పిల్లర్స్‌కూడా ఉన్నవి. పిల్లర్సుమీద ఒకరోడ్డు బ్రిడ్జిని వేసిన బొంబాయి రాష్ట్రాన్ని ఆంధ్రప్రదేశ్‌ను లింకు చెయుటే కాకుండా అది బొంబాయి - మద్రాసు హైవే క్రింద మారుతుంది. దానివల్ల ఆదోని రాయచూరు మీదుగా హైదరాబాదుకు దగ్గర ఔతుంది. ఆరోడ్డు బ్రిడ్జి నిర్మించిన వ్యాపారం ఎక్కువగా సాగుతుంది. లారీల రాకపోకలు ఎక్కువ ఔతాయి. అందువల్ల ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది. ఆబ్రిడ్జి లక్ష రూపాయలు కూడా చేయదని ఇంజనీర్లు చెప్పుతున్నారు. కాబట్టి త్వరగానే ప్రభుత్వం తగిన చర్య తీసుకోవాలని కోరుతున్నాను.

ఆదోని తాలూకాలో కేతాళం ఫిర్కా ఒకటి ఉన్నది. కేతాళం దాదాపు 20 గ్రామాలకు కేంద్రం. కాని ఆ గ్రామానికి ఒక రోడ్డు కూడ లేదు. వర్షాకాలంలో అది ఒక island గా తయారౌతుంది అప్పుడు ఆ గ్రామానికిగాని, అచ్చటినుండి ఇతర గ్రామాలకుగాని పోవుటకు వీలుండదు కాబట్టి ఆ గ్రామాలకు పోవుటకు రోడ్లు కట్టించాలని ప్రభుత్వమును కోరుతున్నాను అక్కడ ఉరుకుంది వీరన్న అనే గ్రామదేవత ఉన్నది. శ్రావణ, కార్తీకమాసాలలో ఆ జిల్లాలోని అన్నిప్రాంతాల నుండి ప్రజలు వందలకొలది బండ్లమీద వచ్చి దేవుని దర్శనంచేసుకొనే ఆచారం ఉన్నది ఆగ్రామానికిపోయే ప్రతి పదిబండ్లలో రెండు, మూడు బండ్ల ఇరుసులు విరిగిపోవడమో లేక ఎద్దుల కాళ్ళు విరిగి ఎద్దులు చనిపోవడమో జరుగుతున్నది. దానివల్ల పంచాయతి, జిల్లాబోర్డులకు ఆదాయం ఉన్నది. కాని ఆ రోడ్డును బాగుచేయుటకు జిల్లాబోర్డుగాని, ప్రభుత్వంగాని ఏమీ చర్య తీసుకోవడంలేదు. ఆ గ్రామానికి నీటివసతి గూడ లేదు. ఆ రస్తాను బాగు

చేసి, అక్కడ సౌకర్యములు కలుగజేయాలి 5,6 ఏండ్ల క్రితం famine రోడ్డు వేసినారు. కాని అది గుంటలు పడిపోయింది.

పాత బళ్ళారి జిల్లాలో జిల్లాబోర్డు క్రింద చాలమంది కంట్రాక్టుచేసి డబ్బు పొందకుండా ఉన్న సందర్భములు ఉన్నవి. 1953 నుండి అర్జీలు పెట్టుకొని డిపాజిట్స్ వగైరా డబ్బు చెల్లించమని కోరినా ఇంతవరకూ రాక చాలామంది ఇబ్బందిపడుతున్నారు మామూలుగా జిల్లాబోర్డులలో చిన్నచిన్న కంట్రాక్టర్లు ఉంటారు కనుక వారి పరిస్థితులు చాలా అధ్వాన్నంగా ఉన్నవి వారికి రావలసిన డబ్బును బళ్ళారి డిస్ట్రిక్టు బోర్డునుండి ఇప్పించుటకు ప్రభుత్వం త్వరలోనే చర్య తీసుకోవాలని కోరుతున్నాను.

మా కర్నూల్ జిల్లాబోర్డుకు ప్రభుత్వం ఐదులక్షల రూపాయలు శాంక్షన్ చేసింది. ఆ ఐదులక్షలలో ఒక లక్ష రూపాయలు ఆదోని, ఆలూరు తాలూకాల రోడ్ల రిపేరుకు వచ్చినది కాని ఈ గ్రాంటు ఇంకా కొంచెం ముందుగా ఇచ్చి ఉండిన పనులు జరుగుటకు వీలుఉండేది ఒక నెలక్రిందటే గ్రాంటు వచ్చినందున కంట్రాక్టర్లు సకాలంలో దొరకరు. అందువల్ల గ్రాంటు lapse అయ్యే అవకాశమున్నది. కాబట్టి అలాంటి గ్రాంటులు వీలైనంత త్వరగా మంజూరుచేయాలని ప్రభుత్వమును కోరుతున్నాను.

* శ్రీ ఇ. చిన్నప్ప (మహబూబ్‌నగర్) :- అధ్యక్షా ! మీరు అవకాశము తక్కువ ఇచ్చారు కనుక అతిముఖ్యమైన విషయాలు మాత్రమే నేను మీద్వారా మంత్రిగారికి తెలుపదలచుకున్నాను.

రోడ్ల నిర్మాణ విషయములో P W.D. వారు ఎస్టిమేట్లను చాలా ఆలస్యముగా తయారు చేస్తున్నారు టెండర్లను పిలువటములోను, మార్కెటింగ్ సౌకర్యములు కల్గించటములో ఆలశ్యము అవుతున్నందువల్ల దానికి కేటాయించిన డబ్బు లాప్స్ అయిపోతున్నది. బడ్జెటు పాస్ అయిన ఒకటి, రెండు నెలలలో పునే, వర్షాకాలం ప్రారంభమగటంవల్ల పనులు జరగటానికి ఇబ్బంది కల్గుతుంది. అందుచేత వెంటనే ఎస్టిమేట్లను తయ్యారుచేయించే విషయములో ప్రత్యేకశ్రద్ధ మంత్రిగారు తీసుకోవాలని మనవిచేస్తున్నాను.

మహబూబ్‌నగర్ తాలూకా బూద్యూరు నుండి బిజనాపల్లివరకు రోడ్డు సౌకర్యము లేదు. దానివల్ల రెండువిధముల నష్టము కలుగుతున్నది. ప్రభుత్వ బస్సు సర్వీసులేక దానిని కంట్రాక్టర్లకు ఇవ్వటంవల్ల ప్రభుత్వమునకు రావలసిన ఆదాయం రావటంలేదు. సమీపములో వున్న వనపర్తి తాలూకా,

నాగర్ కర్నూలు తాలుకా, అమీరాబాద్ తాలుకా, కొల్హాపురం తాలూకాలోని ప్రజలకు ఎంతో ఇబ్బంది కలుగుతున్నది. 7, 8 మైళ్ళువున్న ఈ రోడ్డు ఉపయోగం నరశింగరావుగారికి తెలుసును. ఈ రోడ్డు అవసరాన్ని గురించి తాలుకా ప్లానింగ్ కమిటీలో అనేకసార్లు చెప్పినా ఇంతవరకు ఆపని జరగలేదు.

పల్లెటూరి వారికి కొంత విజ్ఞానమును కలిగించటానికి సంచారగ్రంథాలయము వుంటే చాలా బాగుంటుంది. ఈ గ్రంథాలయం ద్వారా గ్రామ గ్రామముల ప్రజలకు పుస్తకాలను అందించటానికి మనం నిజముగా కృషిచేస్తేనే ఇది ప్రజాస్వామ్య పరిపాలన అనిపించుకొంటుందని మనవిచేస్తూ సెలవు తీసికొంటున్నాను.

* శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) :— అధ్యక్షా, ఒక కొత్త విషయం ఈ డిమాండులో కనిపిస్తోంది. Charged items అనేవాటిని గురించి మనం చర్చించటానికి వీలుంది కాని, వోటింగ్ కు పెట్టటానికి వీలులేదనే రూపంలో గవర్నరుగారి పద్దును మంత్రిగారు తీసుకువచ్చారు. షెడ్యూల్ ప్రకారము, కాన్‌స్టిట్యూషన్ ప్రకారము 4,25,000 ఆయన ఖర్చుపెట్టాలని పరిమితి వున్నప్పటికి ఈనాడు దానికంటె పెద్దమొత్తాన్ని ఇక్కడ వుంచటం జరిగింది. స్టాఫ్ కు బిల్డింగులకు, తోటలకు, ప్రయాణాలకు ఇంతపెద్దమొత్తమును ఎందుకు కేటాయించారో నాకు అర్థం కావటము లేదు. గతసంవత్సరపు బడ్జెటులో ఈ మొత్తమును చూపలేదు. కాని ఈ సంవత్సరం charged items అని చూపవలసిన అవసరం ఎందుకు ఏర్పడిందో నాకు తెలియటం లేదు. షెడ్యూల్‌ను మించి కేటాయించటం చూస్తే 10 సంవత్సరాల క్రింద బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ పెత్తనం క్రింద తమ అధికారదర్పానికి ఏవిధంగా డబ్బును వినియోగిస్తున్నారో ఆవిధంగా ఈనాడు కూడా చేస్తున్నారని స్పష్టమౌతుంది. ఆరోజులు ఈనాడు కూడా గుర్తుకు వస్తున్నవి. ఈనాడు కూడా డాబు దర్పములు జాస్తిగా జరుగుతున్నవి. ముఖ్యమంత్రిగారు ఒక సందర్భములో "మన State Head ను మనం గౌరవించుకోవాలి" అని చెప్పారు. ఈనాడు కూడా ఆడాబు దర్పాలను చూస్తుంటే స్వాతంత్ర్యం పొందిన ప్రజాస్వామ్య యుగములోనే మనం వున్నామా అని అనిపిస్తుంది. బెజవాడకు చాలా పర్యాయములు (గవర్నరు) వారు వచ్చారు. వారు వస్తున్న సమయంలో రోడ్లపై ట్రాఫిక్‌ను గంటలకొలది ఆపటం జరుగుతున్నది. వారు రావచ్చును. ప్రజల అవసరాలను వారు దృష్టిలో వుంచుకోవచ్చును. కాని ఇలా గంటల తరబడి ప్రజానీకాన్ని ఆపటం మాత్రం అన్యాయమని, ఆ పద్ధతిని మానివేయించాలని మీద్వారా మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

స్వాతంత్ర్య ఉద్యమములో పాల్గొని, కాంగ్రెసు సేవకులుగా వున్నవారే మన State Head గా వున్నారు కాబట్టి వారు కూడా simple గా వుండే పద్ధతిని అవలంబిస్తే మనం చెప్పుకునే బీదరికం పోదుపు ఉద్యమాలకు ఆదర్శప్రాయంగా వుంటుదని మనవిచేస్తున్నాను

సామాన్యంగా ఏరోడ్లకు కేటాయించిన డబ్బు ఆ రోడ్లకు వినియోగింప బడటంలేదు. అది సరైనపద్ధతి కాదు. కనుక ఏరోడ్డుకు కేటాయించిన డబ్బును ఆ రోడ్డుకే ఖర్చుపెట్టాలని మంత్రిగారిని కోరుతున్నాను."State roads of economic and Inter-State importance"అనేదాని క్రింద 13,66,000రూపాయలు కేటాయించినా దానికి 5,65 000 రూపాయలు మాత్రమే ఖర్చుపెట్టడం జరిగింది సుమారు 8 లక్షలను ఎందుకు ఖర్చుచేయలేదో నాకు అర్థంకావడంలేదు. రోడ్ల పరిస్థితి ఏమీ బాగాలేదు గత శాసనసభలో చెప్పినట్లుగా విమానాలమీద నేకాక రోడ్లమీద ప్రయాణంచేసేటప్పుడు కూడా ఇన్సూర్ చేసుకోవలసిన పరిస్థితి కూడా ఈనాడు ఏర్పడింది.

రిపేరుచేసే రోడ్లకు అడ్డుకట్టలుగాని సైన్‌బోర్డులు కాని వుండటంలేదు దాని వల్ల అనేక ప్రమాదములు జరుగుతున్నవి అనేకమంది చనిపోయిన సంఘటనలు వున్నాయి Closed roads అనే బోర్డులు లేకపోవటంవల్ల, అడ్డకట్టలు లేకపోవటంవల్లనే ఈ ప్రమాదములు జరుగుతున్నవి. క్రింది ఉద్యోగస్థులు అజాగ్రత్తగా వుంటే వారిపై ప్రభుత్వం చర్య తీసుకోవాలి.

ఎండనక, వాననక రోడ్లపై పనిచేసే కూలీలు ఉన్నారు. వారిని గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు లేదు.

ఆంధ్ర ప్రాంతంలో జిల్లా బోర్డులలో గత 20, 30 సంవత్సరాలనుంచి పని చేస్తున్నారు. ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న తరువాతకూడ, వారు పనిచేస్తు న్నారు. అయినప్పటికి వారి సర్వీసు రెగ్యులరైజ్ చేయలేదు. ఎందుకు చేయలేదని అడుగుతున్నాను ? ఇంతవరకు వారిసర్వీసు రెగ్యులరైజ్ చేయలేదంటే, వారి విషయంలో ఆలనాపాలనా లేదని చెప్పవలసివస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత, "వారిని సంవత్సరానికి యింతమంది చొప్పున మొత్తం అందరినీ రెగ్యులరైజ్ చేస్తామని" ముఖ్యమంత్రిగారు చెప్పారు. అనేక వేలమందిఉన్నా ఇప్పటికి 350 మందిని మాత్రమే regulariseచేశారు. ప్రభుత్వం యిచ్చిన హామీ, వాగ్దానం ప్రకారం అయినా చేయలేదంటే వారిని బాధపెట్టడానికి ప్రభుత్వం చేస్తున్నారని అనుకోవలసివస్తుంది. ఆంధ్రప్రాంతంలో సంవత్సరాలనుంచి పనిచేస్తున్నప్పటికీ ఈ [illegible] work charged establishment అని చేసి

పెట్టారు వాళ్ళకు 38 రూపాయల చొప్పున యిస్తున్నారు. అందులో మళ్ళీ 10% కోతకోస్తున్నారు ఆ కోతకోసిన డబ్బు మళ్ళీ వాళ్ళకు ఇస్తారో లేక ప్రభుత్వ ఖజానాకు జమ కడుతున్నారో తెలియదు. ఒక్కొక్కప్పుడు గ్రాంట్సు సరిగా రాలేదని work charged కూలీలను పనిలోంచి మానిపిస్తారు. తిరిగివారిని పనిలో పెట్టుకొనేటప్పుడు 38 రూపాయలు కాకుండా 34/- 30/- రూపాయలు ఇస్తున్నారు. ఎందువల్ల అట్లా తగ్గించి యిస్తున్నారు? 10 సంవత్సరాలు, 20 సంవత్సరాలుగా పనిచేస్తున్నవారికి అలా 30/- 34/- రూపాయలు యివ్వడం న్యాయమేనా? సీనియారిటీని బట్టి ఉద్యోగాలు యివ్వాలని ప్రభుత్వ రూల్సులో ఉన్నాయి ఎందుకు ఆ రూల్సును అమలు జరుపరు? ఎండఅనక, వానఅనక రాత్రింబగళ్లు పనిచేసిన దానికి ప్రతిఫలము ఇదేనా అని అడుగుతున్నాను. మనరోడ్లను కాపాడాలంటే సురక్షితంగా ఉంచాలంటే ఆ బాధ్యతను నిర్వహించేవారి విషయంలో, శ్రద్ధ వహించవలసిన అవసరం ఉన్నది. అందుచేత వెంటనే వాళ్ళకు సర్వీసు ఖాయపరచి, జీతాలను నిర్ణయించాలని కోరుతున్నాను. వాళ్ళకు ఆదివారం శెలవులుగాని, C. L గాని, P L గాని యేమీలేవు. అంటే నెలపొడుగునా పనిచేయాలి. రోడ్డుమీద పనిలేకపోతే యే అసిస్టెంటు యింజనీరు యింట్లోనో, డివిజనల్ ఇంజనీరు యింట్లోనో వాళ్ళ స్వంతపనులు చేయాలి. అక్కడ పని చేస్తూన్నప్పటికి ఒక్కొక్కప్పుడు ఆబ్సెంటు వేయడంకూడ జరుగుతోంటుంది. వీటి అన్నింటిని ప్రభుత్వంవారు దృష్టిలో పెట్టుకొని వెంటనే వారందరిని ఖాయపరచవలెనని కోరుతున్నాను.

ఇక తెలంగాణాలో కూలీలు మూడురకాలుగా ఉన్నారు మజ్దూర్ కూలీలు boy కూలీలు, స్త్రీకూలీలు అని. స్త్రీలు అయినా, పురుషులు అయినా పనిని బట్టి వేతనాలు యివ్వాలని అంటున్నాం. ఆ విధంగా యివ్వాలని పార్లమెంటు ఒక శాసనంకూడ చేసింది. కాని స్త్రీ కూలీలకు తక్కువ వేతనాలు ఇస్తున్నారు. ఇదివరకు మంత్రులు ప్రశ్నల సందర్భంలో చెబుతు "ఆడకూలీలు తట్టలతో మన్ను మోస్తారు కాబట్టి తక్కువకూలీ యివ్వడం జరుగుతోంది" అన్నారు. రోడ్డు బాగు చేయడానికి, పురుషుడు యెంత అవసరమో, స్త్రీకూడ అంత అవసరము, కాబట్టి స్త్రీ పురుషుల మధ్య ఈ తారతమ్యం లేకుండా వారి జీతాలను పెంచాలని కోరుతున్నాను.

ఇక boy కూలీల సిద్ధాంతం ఒప్పుకోన్నాను. ఏనాడో 15 సంవత్సరాల వయస్సులో వారిని boy కూలీలుగా చేర్చుకొన్నారు. వారు యిప్పుడు పెద్దవాళ్ళే యున్నారు. ఒక్కొక్కరికి 25 సంవత్సరములు పైగా ఉన్నాయి.

కాబట్టి వాళ్ళ జీతాలనుకూడ పెంచాలని ప్రభుత్వ దృష్టికి తీసుకుని వస్తున్నాను. ఇంకొక ముఖ్య విషయము. ప్రభుత్వోద్యోగులందరికి 100/- రూపాయల లోపులో ఉన్నవారికి 6 రూపాయలు ఇవ్వాలని ప్రకటించారు. అది ప్రభుత్వోద్యోగులందరికీ వర్తింపజేయాలని కోరుతున్నాను. ఇది కొంతమందికి వర్తింపజేయలేదు. కేంద్ర ప్రభుత్వం సహాయంచేసే కేటగరి క్రిందకు రాదని చెబుతున్నారు. కొన్ని డివిజన్సులో కూలీలకు ఈ 6 రూపాయలు యిచ్చారు. కొన్ని డివిజన్సులో యివ్వలేదు. రోడ్డు రోలర్సుమీద పనిచేసేవారికి యిచ్చారు. T M yard లో పని చేసేవారికి బెజవాడలోను, రాజమండ్రిలోను, ఈ 6 రూపాయలు ఇవ్వడం జరిగింది. ఈ ఆరురూపాయలు అందరికి యివ్వాలని అడుగుతే, ఆ యిచ్చేది ఆపుచేసి, యిచ్చినటువంటిది మినహాయించాలని ఆర్డర్సు యిచ్చినట్లు తెలిసినది. అట్లా మినహాయించినట్లయితే వారు పడే బాధ చెప్పడం కష్టం. అందుచేత ఆవిధంగా మినహాయించవద్దని, మిగతా అందరికికూడ ఆరు రూపాయలు యివ్వవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అందుచేత ఈ కూలీల విషయమై ప్రభుత్వం శ్రద్ధ వహించినట్లయితే ఈ రోడ్డు చాలావరకు బాగుపడే అవకాశాలు ఉన్నాయి.

మా కృష్ణాజిల్లాలో ఇబ్రాహీంపట్టణంనుంచి, తిరువూరువరకు ఒక హైవేస్ రోడ్డు ఉంది. అది State Highways road. ఇది సుమారు 52 మైళ్లు ఉంది. ఈ రోడ్డుమీద నాలుగు వాగులు ఉన్నాయి. ఒక్క వాగుమీదకూడ బ్రిడ్జికట్టలేదు. ఎందుకు కట్టలేదో అర్థంకావడం లేదు. ఇది భద్రాచలంనుంచి బెజవాడకుపోయే పెద్ద రోడ్డు బెజవాడకుపోయే కట్టెల లారీలు అన్ని ఈ రోడ్డుమీద నుంచే పోతాయి. కాని ఆ రోడ్డుకు మరమ్మతులు చేయడం కాని, ఆ వాగులమీద బ్రిడ్జిలు కట్టడంగాని జరుగలేదు. వెంటనే కట్టాలని కోరుతూ శలవు తీసుకొంటున్నాను.

* శ్రీ యమ్. నరసింగరావు: అధ్యక్షా, ఈ రోజు చర్చలో 18 మంది గౌరవ సభ్యులు పాల్గొన్నారు. వారందరికి నా కృతజ్ఞతలు తెలియచేసుకొంటున్నాను. మొదట రెండు మూడు విషయాలుచెప్పి తరువాత తక్కిన విషయాలు తెలుపుతాను.

Village roads గురించి, Building గురించి ఒక చిన్న misunderstanding ఉన్నట్లు ఉంది. దానిని తొలగించడం మంచిది, ఇద్దరు సభ్యులు మాట్లాడుతూ "భవనాలపై కోట్లకొలది రూపాయలు ఖర్చుచేస్తున్నారు, కాని పల్లెలలో ఉండేవారిని దృష్టిలో ఉంచుకొని ఈ ఖర్చు జరగడం లేదన్నారు." వారికి నేను మనవిచేసేది ఏమిటంటే—ఈ భవనాలు క్రింది తరగతివారికో,

మధ్యతరగతి, లేక పై తరగతి ప్రజలు ఉండటానికో కట్టేవికాదు వీటిని ప్రభుత్వ officers కోసం కట్టించినారు. ఈ విషయాలు వేరే Local Administration మంత్రిగారి Demand వచ్చినప్పుడు చర్చకు రావచ్చు, కానీ P.W D. కే ఈ Low income group, Middle income group housesకు సంబంధం లేదు ఏదైనా Department "మాకు ఇన్ని ఇండ్లు కావాలని" request ను పంపుతుంది అప్పుడే మేము ఆ పనిని తీసుకొంటాము. అంతే కాని ప్రభుత్వం వీటివిషయంలో అనవసరంగా ఖర్చు చేసేదేమీ లేదు. గౌరవ సభ్యులు ఈ విషయంలో పొరపాటు అభిప్రాయంతో ఉన్నారని మనవి చేస్తున్నాను.

ఈ డబ్బులోనుంచి రాజభవనం పైన ఖర్చుపెడుతున్నారని చెప్పారు. ఈ విషయంపైనచర్చ ఇదివరకు కర్నూలులోను, ఇప్పుడిక్కడ వచ్చింది క్రొత్తగా రాష్ట్రాలు ఏర్పడినప్పుడు Governors కు భవనాలు నిర్మించినారు హైద్రాబాద్ State లో నిజాంనవాబు ఉండేవారు గవర్నరుగా. వారికి స్వంత భవనాలు ఉండేవి. అందువల్ల బొంబాయిలోను, కలకత్తాలోను, లక్నోలోను ఉన్నట్లుగా, ఇక్కడ గవర్నరుకు భవనంలేదు. అందుచేత ముఖ్యమంత్రిగారి official residence అయిన "షామంజిల్"ను గవర్నర్‌కు residence గా నిర్ణయించారు ఈ "షామంజిల్"లో ముఖ్యమంత్రిగారు ఉండటానికి ఏవో నాలుగు గదులు ఉండేవి. దీనిని రాజభవనంగా మార్చిన తరువాత గవర్నరుగారి వద్దకు వచ్చే visitors కు, "very important personnel" కు సౌకర్యాలు కలిగించాలి కదా ? వీటన్నిటికి "షామంజిల్" సరిపోనందున, దానికి extenstions చేయాలనే proposals వచ్చాయి. గత సంవత్సరం కొంత పని జరిగింది. ఈ సంవత్సరం కొద్దిగా డబ్బు కేటాయించారు. ఈ విషయంలో ముఖ్యమంత్రిగారు ఒకసారి సెలవిచ్చి ఉన్నారు "Governor యొక్క dignity ని maintain చేయవలసిన బాధ్యత మనపైన ఉంది" అని నేను కూడా అదే భావంకలవాణ్ణి. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొనే ప్రభుత్వం ఖర్చు చేస్తోంది, దుర్వినియోగం మాత్రం కావడం లేదు. గౌరవ సభ్యులు నాతో ఏకీభవిస్తారని ఆశిస్తున్నాను.

(శ్రీ) పి. సుందరయ్య : President's order కు వ్యతిరేకంగా charged item గా ఎందుకు చూపిస్తారు ? [illegible] Budget item గా లేక charged item గా చూపవలసిన అవసరం ఏముకు వచ్చింది ? గత Budget లో [illegible] item గా చూపించి, ఈ సంవత్సరం charged item గా ఎందుకు చూపిస్తున్నారు ?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి: ప్రతిసంవత్సరం buildings యొక్క maintenance కోసం చేసే ఖర్చంతా charged item క్రిందకే వస్తుంది. క్రొత్త expenditure ప్రెసిడెంటుగారి order లేకుండానే- extension of buildings etc. State Budget లోనికే వస్తవి I have not seen the figures. This is the slight difference రొటీన్‌గా ప్రతిసంవత్సరం జరిగే ఖర్చు అయితే it is charged item, over which we cannot vote క్రొత్త buildings, ఈలాంటి extensions ఉంటే, they are not recurring expenditure for every year అవి సహజంగా మీముందుకు వస్తూ ఉంటాయి, అంతే difference ఉంటుందనుకొంటాను

శ్రీ పి సుందరయ్య Difference లేదండి అందుచేతే గత సంవత్సరం కూడా Capital expenditure క్రింద మామూలు budget లో చూపించారు.

*Sri N. Sanjeeva Reddy*: Last year we could not spend it.

శ్రీ పి. సుందరయ్య గత సంవత్సరం కొంతఖర్చుపెట్టినా, ఈ సంవత్సరం మరికొంత ఖర్చుపెట్టబోతున్నారు. కానీ ఇది నిజంగా charged item కాదు. వీలులేని రీతిగా charged item గా పెట్టారు Accounts ప్రకారం, constitution ప్రకారం, అది print చేసినంతమాత్రాన, charged item కాదు. అందుచేత దానిపైన Speaker గారు cut motion allow చేశారు ఈలాంటి irregular procedure ను ఈ ప్రభుత్వం తీసుకువస్తోంది. ఈ విషయంయొక్క merit పైన sanction ఇవ్వడమా ? లేదా ? అనేప్రశ్న కాదు. ఈవిధంగా చేయడం పొరపాటనే విషయం ప్రభుత్వదృష్టికి తీసుకొనిరావలసి ఉంటుంది.

శ్రీ యమ్. నరసింగరావు : ఈ విషయమై కేంద్రప్రభుత్వంతో కొంత correspondence చేశాము వారివద్దనుంచి సమాధానం వచ్చింది. అది ఇప్పుడు కనిపించడము లేదు. మళ్ళీ కావలిస్తే గౌరవ సభ్యులకు చూపిస్తాను. ఈ పద్దు ఏ-head క్రింద పెట్టవలెనో, ఆ ప్రకారమే చేయబడిందని మనవి చేస్తున్నాను, [illegible] ఎక్కువ ఏమీ చెప్పలేను.

[illegible] విషయం village roads గురించి చెప్పారు. Village roads [illegible] నేను ప్రతిపాదించిన demand కు ఎట్టిసంబంధంలేదని గౌరవ సభ్యులకు మనవి చేస్తున్నాను. Village and District roads కు గ్రామ [illegible] ఇది గౌరవ సభ్యులకు తెలిసిన

విషయమే, క్రొత్తది ఏమీకాదు. N. E S Blocks లో తయారయ్యే రోడ్లను గురించి కొంతమందిసభ్యులు చెప్పారు వీటి విషయమై Planning మంత్రిగారి Demand వచ్చినపుడు మాట్లాడండి, ఇది వారికి సంబంధించిన విషయం.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : Village roads, co-operative scheme క్రిందఉన్నాయి. దానిలో కేంద్ర ప్రభుత్వం ఒక వంతు, రాష్ట్ర ప్రభుత్వం ఒక వంతు, గ్రామప్రజలు ఒక వంతు ఇవ్వాలి దీని విషయమై తెలియ చేయమని కోరుచున్నాను

శ్రీ యమ్. నరసింగరావు : కేంద్ర ప్రభుత్వం village roads అభివృద్ధి చేయడానికి రు 26 లక్షలు కేటాయించింది ఈ రెండవ ప్రణాళికా కాలానికి, ప్రతి సంవత్సరం దీనికోసం కొద్దో, గొప్పో ఇస్తూనే ఉన్నారు. 1958-59 వ సంవత్సరానికి రు 8 లక్షలు కేటాయించబడ్డాయని మనవి చేస్తున్నాను త్వరలోనే ఇంకో రు. 5 లక్షలు జిల్లాబోర్డులకు ఇస్తున్నారు. గ్రామపంచాయితీలు కోరినప్పుడు జిల్లాబోర్డువారు ఇందులో నుంచి ఇస్తారు.

మిస్టర్ స్పీకర్ Grants to some body else. వారు ఆ village roads కు ఇస్తారు. కాబట్టి మేనేజిమెంటు వారిదే.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : ప్రభుత్వం జిల్లాబోర్డులకు ఇస్తుంది. వారు గ్రామపంచాయితీలకు ఇస్తారు.

మిస్టర్ స్పీకర్ Department కు ఇస్తున్నారు. The village roads do not belong to the Government. అవి Highway లోకి రావు. Grants ఇవ్వవచ్చు కదా ?

శ్రీ యమ్. నరసింగరావు . అదే నేను మనవి చేస్తున్నాను. అది మునిసిపాలిటీలకుకూడా ఉపయోగపడాలని ప్రభుత్వ ఉద్దేశ్యం. 1958-59 సంవత్సరంలో రు. 15 లక్షలు కేటాయించడం జరిగింది. District Board roads మంచి స్థితిలో లేవని నేను మొదటే మనవి చేశాను. District Board roads అన్నింటిని ప్రభుత్వం వారు స్వాధీనం తీసుకోరని సభ్యులు పదే పదే అడుగుతున్నారు. District Boards క్రింద ఇంకా రెండు వేలమైళ్లకు పైగా roads ఉన్నాయి. వాటి అన్నింటిని తీసుకొని సక్రమంగా maintain చేయడం అనేది ఒక ప్లాను ప్రకారం జరగాలే కాని, ప్లాను లేకుండా తీసుకొని, చేస్తేద్ది ఎప్పు

లేదని సభ్యులకు సవినయంగా మనవి చేస్తున్నాను. ప్రతి సంవత్సరం రెండు వందల మైళ్ళ roads ను తీసుకొంటామని మనవి చేశాము అదే policy ప్రకారం నడుస్తున్నాము ఈ సంవత్సరం District Boards కు ఈ roads maintenance చేసేదాని కొరకు రు. 25 లక్షలు ఇవ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది. దీనిని వారు సక్రమంగా వినియోగించుకో గలుగుతారని ఆశిస్తున్నాను. కొందరు సభ్యులు, పల్లెలలో schools కట్టించే సందర్భంలో, కొంత డబ్బు ఖర్చుపెట్టాలని చెప్పారు. అది నిజమే, కాని, Education Department నుంచి ఆ proposals వస్తాయి. వాటిని మీరు budget లో చూచి ఉండవచ్చును. ఈ సంవత్సరపు Education Department Budget లో 57 లక్షల 75 వేల రూపాయలు education క్రింద, దానికి సంబంధించిన భవనాలకు కేటాయించబడిఉన్నది. తెలంగాణాలో ఇదివరకు primary schools కు తప్ప, secondary schools అన్నింటికి ప్రభుత్వమే డబ్బు ఇస్తూఉండేది. కొన్ని సందర్భాలలో కొంత డబ్బు district board ఇస్తుండేది. కొంత public contributions ద్వారా, కొంత ప్రభుత్వము, ఈ విధంగా ఇప్పుడు schools కట్టడానికి provide చెయ్యబడుతుందని మనవి చేస్తున్నాను. కొందరు ఏమంటున్నారంటే, ఈ డబ్బును ఎప్పుడూ వృధాగా ఖర్చు పెడుతున్నారని, పనులు సరిగ్గా జరగడంలేదని, చెబుతున్నారు. దీని విషయంలో మొదట తెలంగాణాకు సంబంధించినవి మనవి చేస్తాను

మిస్టర్ స్పీకర్: Constitution లోని 202 Article లో, Governor, Speaker and Judges కు సంబంధించి యిలా వుంది. The salaries and allowances of the Speaker and the Deputy Speaker and the Chairman and Deputy Chairman come under charged items. So also, expenditure in respect of the salaries and allowances of Judges of the High Court.

ఇక పోతే, "the emoluments and allowances of the Governor, and other expenditure made on his office" గురించి ఈ ప్రశ్న, other penditure made on his office క్రింద, వెయ్యదగిందా? న్యాయమో, [illegible]మో, ఆక్షేపి, మీరు discuss చెయ్యడానికి అవకాశం ఉంటుంది.

శ్రీ [illegible] ...ందరయ్య: ఈ పద్దు కింద ఖర్చుపెట్టింది అంతా ordinary items [illegible] ఇక పోతే, President's order కు లోబడి ఖర్చుపెట్టేది అంతా, [illegible] Officers residence క్రింద ఇచ్చింది, 20 వేల రూపాయలు [illegible] ఖర్చుపెట్టింది [illegible] లక్షల 25 వేలు. ఈ

సంవత్సరం ఖర్చుపెట్టేది నాలుగులక్షల పైచిల్లర, ఈ order క్రిందకు రాదు. అందుచేత అది votable item.

మిస్టర్ స్పీకర్ : సరే

శ్రీ ఎమ్. నరసింగరావు ఇక పోతే, రోడ్లకు సరిగ్గా డబ్బు ఇవ్వడంలేదని కొందరు అంటున్నారు రోడ్లు ఎక్కడ వేస్తున్నారో, జిల్లాలను అసలే చూడడం లేదు. ఎప్పుడూ పట్టణాలనే చూస్తున్నారని, అంటున్నారు. గాని, తెలంగాణాకు సంబంధించినంతవరకు

The amount allotted for these works is Rs. 218 lakhs in Telengana in which proper distribution has been made to all Telengana Districts in the Second Five-Year Plan as follows:-

| | |
|---|---|
| Medak | Rs. 40,68,000 |
| Mahbubnagar | Rs 28,35,000 |
| Hyderabad | Rs. 20,43,000 |
| Nizamabad | Rs 7,15,000 |
| Warangal | Rs. 8,63,000 |
| Khammam | Rs. 30,95,000 |
| Karimnagar | Rs. 19,98,000 |
| Adilabad | Rs. 12,55,000 |
| Nalgonda | Rs. 35,14,000 |
| TOTAL | Rs. 2,03,86,000 |
| Survey Divisions | Rs. 8,70,000 |

రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రతిజిల్లాకు ఈవిధంగా ఇవ్వాలని ఒక నిర్ణయం చెయ్యబడింది. గనుక, జిల్లాలకు ఇవ్వడంలేదని అనడం చాల పొరపాటు అని మనవి చేస్తున్నాను.

ఇక ఆంధ్రలో, ఈ 5 సంవత్సరాలలోను, కొత్తరోడ్లు ఎక్కడ వెయ్యాలి, జిల్లాబోర్డు రోడ్లు ఎన్ని తీసుకోవాలి, అనే దానిని గురించి, నాదగ్గర రెండు G. O. లు ఉన్నాయి. జిల్లాబోర్డు రోడ్లు ప్రతి సంవత్సరం, ఏ జిల్లాలో ఎన్ని తీసుకుంటామో, milage తో సహా fix చేసి పెట్టాము. దానిప్రకారంగానే నడుస్తున్నామని మనవిచేస్తున్నాను. తయారుచేసిన works list ప్రకారంగానే అమలు జరుపుతాము.

తెలంగాణాలో ఉన్నరోడ్ల గురించి, ఆంధ్రప్రాంతంలో ఉన్న రోడ్ల గురించి, ప్రతి గౌరవ సభ్యుడు, తమ తమ నియోజకవర్గాలలో రోడ్లు ఏవిధంగా develop కావాలో కొన్ని సూచనలుచేశారు. వారికి నేను చాల కృతజ్ఞుడను.

నేను మొదటే మనవిచేశాను, రోడ్లు బాగాలేవని, వంతెనలు సరిగా లేవని, ఇవన్నీ నేను ఒప్పుకున్న విషయాలే. వీటినన్నింటినీ సరిచెయ్యడానికి ఒక plan ప్రకారంగా నడవాలి. అక్కడక్కడ కొన్ని పొరపాట్లుకూడ ఉండవచ్చును. ఒకేసారి వీటిని అన్నింటినీ సరిచెయ్యాలంటె చాల కష్టమని మనవి చేస్తున్నాను. ఏవైతె plan లో ఉన్నవో అవి అన్నీ వదలకుండా తప్పక take up చేస్తామని మనవిచేస్తున్నాను. ఖమ్మం- ఎల్లందు రోడ్డు plan లో ఉన్నది. అక్కడ శీఘ్రంగా పనిప్రారంభించేటట్లు చూస్తాము. సూర్యాపేట నుంచి హుజూర్‌నగర్ రోడ్డు, plan లో లేదు వాటిని take up చెయ్యమంటే plan యొక్క cieling హెచ్చు అవుతుందని మనవిచేస్తున్నాను. ఇదే విధంగా ఎన్నో రోడ్లు ఉన్నాయి ప్రతిరోడ్డు గురించి చెప్పుకుపోతే చాల time అవుతుంది.

శ్రీ డి. నరసయ్య: అధ్యక్షా! ఒలిగొండ- తుఙ్ఞూరు రోడ్డుగురించి ఇదివరకు మంత్రిగారు చెప్పారు కాని, ఈసారి దానిని ఎందుకు తీసుకోలేదు ?

శ్రీ ఎమ్. నరసింగరావు: ఈసారి తీసుకుంటామా లేదా అనేప్రశ్న అంత ముఖ్యమైనదికాదు. ఒలిగొండనుంచి తుఙ్ఞూరు రోడ్డు plan లో ఉన్నది. దాని alignment కొంత మార్చాలని కొందరు మిత్రులు ఒక representation ఇచ్చారు. దానిని examine చేయిస్తున్నాను. దానివల్ల plan expenditure కొంత పెరుగుతుంది. ఇదంతా ఆలోచించవలసి ఉన్నది. అందువల్ల మేము తీసుకోమని అనడంలేదు. దానిని examine చేయిస్తున్నామని మాత్రము మనవి చేస్తున్నాను.

శ్రీ బి ధర్మభిక్షం : తుఙ్ఞూరురోడ్డు విషయమై plan లో వుంది. డిస్ట్రిక్టుప్లానింగ్ కమిటీ, గవర్నమెంటు దీనిని అంగీకరించారు. కాని ఇంతవరకు దాని విషయమై ఏమీ తలపెట్టలేదు. దీనినిగురించి పునరాలోచించాలని మంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ యమ్. నరశింగరావు :- ఒలిగొండ- తొఙ్ఞూరు రోడ్డు ప్లాన్‌లో వుంది. కాని అలైన్‌మెంట్ మార్చాలని representation రావడంవల్ల మళ్ళీ కొంచెము ఆలోచనలో పడినాము. దీనిని plan లో నుంచి తీసివేయడం

లేదు ఈ రోడ్డును తీసికొంటామని హామి యిస్తున్నాను. ఇక జగ్గయ్యపేట తాలూకాలో మున్నేరు విషయమై పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లుగారు చెప్పినారు. నేను cut motion ను move చేయడం లేదు. కాని దాని విషయమై మీరు చెప్పండి అని అన్నారు, కనుక మనవిచేస్తున్నాను. దానిని ఇండియా గవర్నమెంటుకు పంపినాము అది వచ్చినవెంటనే పని ప్రారంభము చేస్తామని మనవి చేస్తున్నాను ఇక ఒంగోల్ నుంచి చిన్నగంజామ్ రోడ్డును గురించి కొందరు చెప్పినారు. అది ప్లాన్‌లోవున్న ప్రకారం తీసికొని దాని మరమ్మతుకోసం ఇండియా గవర్నమెంటుకు కూడా వ్రాసినాము. కాని ఉయ్యూరులో ఖర్చు పెట్టవలసిన డబ్బును ఒంగోలు-చిన్నగంజామ్ రోడ్డుపై ఖర్చు పెట్టడానికి కూడా ఒప్పుకొన్నారు. ఎందుకంటే sugar cane సెస్సు నుంచి కొంతడబ్బు వస్తుంది. Sugar cane cess నుంచి వుయ్యూరు రోడ్డు బాగుచేయవచ్చును. కనుక ఈ డబ్బును ఒంగోలు-చిన్నగంజామ్ రోడ్డుకు ఖర్చు పెట్టడానికిగాను ఇండియా గవర్నమెంటుకు పంపించినాము

శ్రీ వి. విశ్వేశ్వరరావు: On a point of information, Sir ఈ sugar-cane cess fund తాలూకు డబ్బు అంతా కూడా Sugar Factory చుట్టు వున్న రోడ్లకు మాత్రమే ఖర్చు పెట్టాలని Highways కు ఆ డబ్బు ఖర్చు పెట్ట కూడదని లోగడ వాగ్దానాలు చేస్తూవచ్చారు. కాని ఆ వాగ్దానానికి విరుద్ధంగా ఇపుడు Highways రోడ్లకు ఖర్చుపెట్టడం సరికాదని చెప్పుచున్నాను. ఆ డబ్బును ఫ్యాక్టరీకి చుట్టువున్న రోడ్లకు మాత్రమే ఖర్చుపెట్టడానికి ఆలోచించ మని మంత్రిగారిని కోరుచున్నాను

శ్రీ యమ్. నరసింగరావు : Sugar Factory అక్కడ లేకుండావుంటే sugar cane cultivation ఇంత హెచ్చుగా వుండేదికాదు. Highways రోడ్లు యింతగా చెడిపోవుకూడా. Heavy traffic వల్ల ఈ రోడ్లు చెడిపోతున్నవి. అందువల్ల sugar cane cess fund నుంచి కొంతభాగము రోడ్డుకుగ్రాను ఇవ్వాలని. తతిమ్మాదానికి మేమే ఖర్చు పెట్టుకొంటాము. ఈ సంవత్సరం 20 లక్షలు, మరి 3 సంవత్సరాల వరకు 20 లక్షల రూపాయల చొప్పున మన ఆంధ్ర ప్రదేశ్‌లో ఎన్ని sugar cane factories వున్నవో వాటిసమీపమున వున్న areas ను develop చేయాలనే నిర్ణయానికి ప్రభుత్వము వచ్చింది. ఆ విధంగా ప్రభుత్వము చేస్తుందని మనవిచేస్తున్నాను

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు: Sugar cane fund ఒక్క Highways కేనా లేక branch రోడ్లకు కూడానా?

మిస్టర్ స్పీకర్ : రెంటికీ అని వారు చెప్పారు.

శ్రీ యమ్. నరసింగరావు : ఫ్యాక్టరీకి 20 మైళ్ళ లోపున వుండే ఏ రోడ్డుకైనా ఇది వర్తిస్తుంది నిజామాబాదు area లో sugar factory వుండడము వల్ల నిజామాబాదునుంచి బోధన్‌వరకు కూడా సిమెంట్‌రోడ్డు వేస్తున్నారు. ఇక ప్రతివిషయం చెప్పడము చాల కష్టము. కొన్ని ముఖ్యమైన విషయాలున్నవి. రైల్వే సౌకర్యాల గురించి సభ్యులు మాట్లాడినారు ఇదివరకే ఈ సభలో నేను మనవిచేశాను. అది ఏమంటే - మన ఆంధ్రప్రదేశ్‌లో ఒక రైల్వే జోన్‌ను వేరే ఏర్పాటు చేయడానికి అది ఈ ప్రభుత్వానికి ఏలాంటి అభ్యంతరము లేదు అని నా మనవి. అదేప్రకారం ఇండియా గవర్నమెంటుకు మళ్ళీ వ్రాసినాము— "మాకు ప్రత్యేక రైల్వేజోన్ యివ్వవలసిందని, లేదా కనీసము ఇప్పుడు బొంబాయిలోవున్న Central Railway జోనల్ Headquarters ను హైదరాబాద్‌కు గాని, సికందరాబాద్‌కు గాని మార్చవలసింద"ని. ఇక్కడ వున్న సౌకర్యాలను గురించి కూడా వ్రాసినాము. ఇక రైల్వే లైన్సును గురించి చెప్పారు. నాగార్జునసాగర్ నుంచి సింగరేణివరకు కొత్తగూడెమ్‌నుంచి విశాఖపట్టణం వరకు ఇంకా ఎన్నెన్నో చెప్పినారు నేనొక్కటిమాత్రం మనవిచేస్తాను. ఇండియాగవర్నమెంటులో ఇదివరకు హైదరాబాద్ పంపిన proposals ఆంధ్ర గవర్నమెంటు పంపిన proposals వున్నవి. వాటినన్నిటినివారు చూచి ఏమన్నారంటే — ఎక్కడైతే plan development కోసం industries develop అయినాయో అక్కడ తప్ప మరెక్కడ మేము రైల్వేలైనులు వేయడం లేదని చెప్పినారు. కనుక దీనిని మనము రెండవ పంచవర్షప్రణాళికలో వదిలు కొన్నట్లే అని అర్థము ఈ విషయమై ఇండియా గవర్నమెంటును ఎక్కువ ఒత్తిడిచేసి లాభము లేదని నా అభిప్రాయము. తర్వాత పోర్టుల విషయమై మాట్లాడినారు కొందరు మిత్రులు. కళింగపట్టణము, కొత్తపట్టణము పోర్టులగురించి కొందరు చెప్పారు. నేను మొదటనే మనవిచేసినాను మన coastal area చాలపెద్దది. పోర్టులు ఎన్నోవున్నవి. అవన్నిటిని develop చేయడం సాధ్యమా ? Traffic అంత వుందా ? అనే ప్రశ్నలు వస్తాయి. కనుక అందులో ముఖ్యమైనవాటిని రెండు లేక మూడు పోర్టులను develop చేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. Corruption విషయంలో ఇద్దరు, ముగ్గురు మిత్రులు మాట్లాడినారు. అందరు దేవతలు, అందరూ 'ఫరిస్తే' నని నేను మనవిచేయడం లేదు. ఈ డిపార్టుమెంటులో లంచగొండితనము వుండవచ్చును. దీనిలో తినేవానికి ఎక్కువ అవకాశముండవచ్చును. పి. డబ్ల్యు. డి. డిపార్టుమెంటులో ఎక్కు వలంచగొండితనముందంటే దానిని [illegible] అంగీకరించడానికి సిద్ధంగా లేను. అన్ని డిపార్టు

మోటులలో వున్నట్లు దీనిలో కూడా వుండవచ్చును. లంచగొండితనము వున్నదని చెప్పడమువల్ల లాభము లేదు. నేను ఒకటిమాత్రము సభ్యులకు మనవి చేస్తున్నాను Specific instances ప్రభుత్వ దృష్టికి తీసుకురండి. అప్పుడు చర్య తీసుకోకపోతే ప్రభుత్వాన్ని అనండి. ఎక్కడైనా specific instance ప్రభుత్వ దృష్టికి వచ్చినట్లయితే తప్పకుండా చర్య తీసుకుంటాము. గవర్నమెంటు, departmental గా enquiry చేయిస్తుంది తర్వాత సి ఐ డి. ex-Branch కి పంపిస్తున్నాము. తర్వాత tribunal కు పంపిస్తున్నాము ఇవన్నీ జరుగుతున్నాయి. ఇక contract system పై మాట్లాడినారు. నిజమే contract system చాల రోజులనుంచి వున్నది. Contract system తీసివేస్తే వేరే system ఏదైనా వున్నదా అనేది ఒక పెద్ద సమస్య. Labour co-operatives బాగా organise ఐతే ఏదో కొంతవరకు చూడవచ్చును. ఈ contract system లో కొన్ని లోపాలు వున్నవి. ఒక మిత్రుడు "మీరు lowest tender rates పై యిస్తున్నారు. దానివల్ల పని త్వరగా సాగడము లేద' ని చెప్పినారు. ఇందులో కొన్ని కష్టాలు వుండినా అవి తప్పవని మనవిచేస్తున్నాను,

Avenue trees (చెట్లు) విషయంకూడా చెప్పారు. Famine రోడ్ల గురించి చెప్పారు ఇది పెద్దసమస్య. ఆంధ్రలోను తెలంగాణాలోను కూడా ఇటువంటి రోడ్లున్నాయి. కరువుకాలంలో relief works క్రింద రోడ్లువేయించారు కొంత సామగ్రి అక్కడ ప్రోగుచేశారు, కంకర అక్కడ వేశారు. తరువాత కంకరను ఎత్తుకు పోతుంటారు. ఎవరికి ఆవిషయం పట్టదు. ఈ సమస్యను ఆలోచించవలసినదే. ఈ విషయమై ఇక ఏమీచెప్పకుండా ఆలోచిస్తామని మాత్రం చెబుతున్నాను ఏమి ఆలోచించవలెనో ఏమో, చూడవలెను. విశ్వేశ్వరరావుగారు highways gangmen గురించి చెప్పారు మిత్రులతో ఈ విషయాలు చర్చిస్తూనే ఉన్నాము, Highways మేస్త్రీలను provincialise చేయాలనే తీర్మానం తెచ్చామని అన్నారు. కొంతమంది మేస్త్రీలును provincialise చేశాము. నాదగ్గర ఉన్న అంకెలను బట్టి 700 మంది పైచిల్లర మేస్త్రీలున్నారు. ఇందులో 240 మందికి confirm చేశారు, provincialise చేశారు. లోగడచేసుకున్న పరిష్కారం ప్రకారం 421 మందిని కూడా provincialise చేస్తామని మనవిచేస్తున్నాను. మిగిలిన సుమారు 300 మంది విషయంలో seniority మొదలైన విషయాలు చూడవలసి ఉంటుంది. ఆవిషయం కూడా పరిశీలన చేస్తామని మనవిచేస్తున్నాను.

కూలీల విషయం, వారిని తీసివేస్తుంటారు, మరల ఉద్యోగంలో వేస్తుంటారు మరల వేసినపుడు తక్కువ జీతంమీద పెట్టుకుంటారు. వారికి సెలవులు లేవని అన్నారు. వారికి కూడా ఆదివారం సెలవు, ఉగాది మొదలైన పండుగలకు సెలవు. వారు work charge establishment కు చెందినవారు గౌరవ సభ్యులు కోరేది ఏమిటంటే-ఇతర ప్రభుత్వోద్యోగులకు ఉన్న అన్నిహక్కులు - పెన్షన్, సెలవు మొదలైనవి- ఇచ్చి వారిని regularise చేయాలని. ఇది కొంచెం కష్టమైన సమస్య అని నేను భావిస్తాను. తెలంగాణా highways gangmen, ఆంధ్రప్రాంత highways gangmen సర్వీసులను ఒకే పద్ధతిలోనికి తీసుకురావలసియున్నది. కనుక ఏవిధంగా చేయవలెనో ఆలోచిస్తామని మనవి చేస్తున్నాను వారివారి నియోజకవర్గాలలోని విషయాలను తెలియజేసిన మిత్రులందరికి విడివిడిగా జవాబుచెప్పడం కష్టం. ఈ డిమాండు మొత్తం తక్కువగా ఉన్నదని కొంతమంది చెప్పారు రోడ్ల ప్రాముఖ్యం విషయమై ప్రభుత్వానికి ఏమీ అభ్యంతరంలేదు, ఒప్పుకుంటాము. గౌరవ సభ్యులను తమ కోత తీర్మానాలను ఉపసంహరించుకుని ఈడిమాండును ఏకగ్రీవంగా అమోదించాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ 801 కోత తీర్మానాన్ని గోపాలకృష్ణయ్యగారు ఉపసంహరించుకుంటారా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : ఆంధ్రప్రదేశ్‌కు ఒక రైల్వే zone ఏర్పాటు చేసే విషయంలో అందరికి ఏకగ్రీవమైన అభిప్రాయం ఉన్నది కాబట్టి ఆవిషయమై specific గా, Central Railway ఆఫీసులు కొన్ని ఇక్కడకు తరలించాలనే విషయంతో కలపకుండా వ్రాయడానికి అంగీకరిస్తారా ?

శ్రీ ఎమ్. నరసింగరావు : ఆవిధంగా వ్రాస్తున్నామని మనవి చేస్తున్నాను.

## *Demand No. XXVIII-Civil Works Rs. 6,41,89,800*

*Shri Vavilala Gopalakrishnayya*: Mr. Speaker Sir, I beg leave of the House to withdraw my cut motion.

The cut motion, was with leave of the House, withdrawn

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil Works by Rs. 100/-

To discuss the policy of Government on communications.

The motion was negatived.

*Mr. Speaker.* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil Works by Rs. 100/-

గజపతినగరం నియోజక వర్గములో రోడ్ల నిర్మాణమును గురించి ప్రభుత్వం అశ్రద్ధచేసినందులకు

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil Works by Rs. 100/-

పట్టణములో ప్రభుత్వ ఉద్యోగులకు గురించి గృహములు నిర్మించి, ఆంధ్ర ఉద్యోగులకేయిచ్చి, తెలంగాణా బడ్జెటులో ఖర్చు రాసే ప్రభుత్వ విధానమును విమర్శింపగలందులకు—

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs 6,41,89,800 for Civil Works by Rs. 100/-

సూర్యాపేటకు వరంగల్లు ఖమ్మం రోడ్డుతో కలిపే రోడ్డు పధకం గురించి, సూర్యాపేట తాలూకాలో విలేజి రోడ్సు డెవలప్మెంటు స్కీము గురించి.

The motion was negatived.

*Mr. Speaker:* The question is.

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil Works by Rs. 100/-

ప్రభుత్వ విధానమును విమర్శించుటకు

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

సంగారెడ్డి జిల్లా హెడ్క్వార్టర్సునుండి ఇస్మాయిల్ఖాన్పేట గ్రామము మీదుగా నర్సాపురము తాలుకా హెడ్క్వార్టర్సు వరకు రోడ్డు వేయుటలో ఆలస్యము చేయుచున్నందులకు.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs 100/-

చౌటకూరు గ్రామము తాలుకా అందోలు మరియు జోగిపేట మధ్య రోడ్డుపై గల బసనవాగనబడు కాలువపై ఇంతవరకు వంతెన నిర్మించనందులకు

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

చరిత్రాత్మకమైన కొండాపురం గ్రామమునకు సంగారెడ్డి తాలూకా వెళ్లుటకు ఇంతవరకు రోడ్డు నిర్మాణము జరుగనందుకు.

The motion was negatived

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

హైవేస్ ఎంప్లాయీస్‌కు 6 రు. లు పెంచకపోవడం గురించి చర్చించుటకుగాను, టెంపరరీ మేస్త్రీలను గ్రాట్యుయిటీ యివ్వకుండా ఉద్యోగాలనుండి తొలగించుటకు గల కారణాలను చర్చించుటకుగాను.

The motion was negatived.

*Sri B. Dharma Bhiksham*: I demand a division Sir.

The House then divided.

Ayes: 39; Noes: 88;

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

రాకపోకల రహదారుల రోడ్లపై పనిచేసే కూలీలకు ఎక్కువ జీతము మంజూరి అయినది యివ్వకపోయినందులకు.

The motion was negatived.

*Mr. Speaker*. The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to construct a bridge across the Gosthami river in Srungavarapukota, Vizianagaram.

The motion was negatived.

*Mr Speaker*. The question is:

To reduce the allotment of Rs 6,41,89,800 for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to provincialise Srungavarapukota-Thamarapatti road.

The motion was negatived.

*Mr. Speaker*: The question is.

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to provincialise Srungavarapukota—Thamarapatti Road.

The motion was negatived.

*Mr Speaker*: The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the Government's failure to improve the State of the District roads.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To criticise the Government's failure to eradicate corruption, wastage and mismanagement and also to criticise the Government's failure to abolish the contract system in favour of workers co-operatives.

The motion was negatived.

*Sri B. Sriramamurthy* I demand a division, Sir.

The House then divided.

Ayes· 39; Noes 89.

The motion was negatived.

*Mr. Speaker* The question is:

To reduce the allotment of Rs 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the Government's failure to lav a road from Gurla (Via) Kalavacherla and Kotagandredu to Garikivalasa, in Vizianagaram taluq (Vizag District).

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the failure of the Government to lay a road from Lakkavarapukota (via, Khasapeta, Kotyada to Alamanda in Srungavarapukota taluk (Vizag district).

The motion was negatived.

*Mr. Speaker·* The question is·

To reduce the allotment of Rs. 6,41,89,800/- for Civil works by Rs. 100/-

To discuss the Government's failure to form a road from Komatipalli to Garbham in Bobbili Cheepurupalli taluq of Srikakulam district and also the Government's failure to repair Salur-Duddigam road from Mamidipalli in Srikakulam district.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil works by Rs. 100/-

[illegible] గ్యాంగు వర్క్‌షాప్స్‌లో పి. డబ్ల్యు. డి. అధికార్లు తమ స్వంత పనులకై తీసుకొంటున్న వెట్టిని నిరోధించకపోవడం గురించి చర్చించుటకు

The motion was negatived.

*Mr. Speaker* The question is:

To reduce the allotment of Rs 6,41,89,800 for Civil works by Rs. 100/-

హైవేసు అధికార్లు కాంట్రాక్టర్లు, వాటాదార్లుగా చేరి ప్రభుత్వ ధనాన్ని ఆస్తిని, వస్తువులను కాజేస్తున్నా చర్య-ను ప్రభుత్వం చెకప్‌చేసి శిక్షించకపోవడం గురించి చర్చించుటకు గాను.

The motion was negatived.

*Mr. Speaker:* The question is

To reduce the allotment of Rs. 6,41,89,800 for Civil works by Rs. 100/-

నల్లగొండ జిల్లాలో గత సంవత్సరం నిర్మాణానికై తీసుకోబడినా రోడ్ల నిర్మాణం తీసుకోకపోవటం, జిల్లా ప్రజల అవసర రీత్యా రోడ్ల నిర్మాణం జరుపక పోవటం గురించి చర్చించుటకుగాను.

The motion was negatived.

*Demand No. XLV—Capital Out-lay on Civil Works*
*Rs* 3,74,41,400

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,74,41,400 for Capital Outlay on Civil works by Rs 3,74,41,400

The Govt. continuously, inspite of repeated reminders on the floor of the Assembly, put the items of expenditure on Governor and his pharapharnalia, as charged items though they exceed the allotted amount as found in the President's order and deprives the right of the Assembly to vote such items and as a matter of economy.

The motion was negatived.

*Sri P. Sundarayya*: I demand a division Sir,

The House then divided.
Ayes 39; Noes : 90:

The motion was negatived.

*Mr. Speaker:* The question is.

To reduce the allotment of Rs. 3,74,41,400 for Capital Outlay on Civil Works by Rs. 100/-

1957–58 లో పోలీస్ గురించి 14,45,900 ఉంటే 1958-59 లో 31,69,100 లు చేర్చి నూటికి నూరు పెంచిన ప్రభుత్వ విధానమును ఖండించగలందులకు.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

That Government be granted a sum not exceeding Rs. 6,41,89,800- under Demand No. XXVIII-Civil Works

The motion was adopted.

*Mr. Speaker:* The question is:

That Government be granted a sum not exceeding Rs. 3,74,41,400 under Demand No. XLV - Capital Outlay on Civil Works.

The motion was adopted.

*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 25th March 1958.*



# The
# Andhra Pradesh Legislative Assembly
# Debates

[*Part II-Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

**51st day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly**

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Tuesday, the 25th March 1958*

The House met at Half Past Eight of the Clock.

[*Mr. Speaker in the Chair*]

## QUESTIONS AND ANSWERS

(*See Part I*)

## Petition re - Starting of Night Colleges

మిస్టర్ స్పీకర్ 210వ రూల్ క్రింద ఒక అర్జీ వచ్చింది దానిని ఇద్దరు గౌరవ సభ్యులు దాఖలు చేశారు. ఆ అర్జీ విద్యార్థుల దగ్గరనుంచి, విద్యార్థినుల దగ్గరనుంచీ వచ్చింది ఈ రోజున subject matter Education గనుక ఇది relevant, ఇది ఒక public opinion గా తీసుకోవడం, ఊరికే వినడం తప్ప. దానిపై చర్చ ఏమీలేదు చదివి వినిపిస్తాను. ముఖ్యంగా విద్యామంత్రిగారు గమనించ వలెను.

Rule 210 reads :(1) "Petitions to the Assembly must–

(a) relate to some matter actually under the consideration of the Assembly or to any Bill, Resolution or other Motion which has been introduced or moved in the Assembly or any Bill published in the Gazette;

(b) addressed to the members of the Assembly;

(c) be dated and signed by the petitioner or petitioners.

x x x x x x x x

(2) No petition addressed to the Assembly shall be presented except by a member of the Assembly. "

211. "*Duties of members offering to present a petition* :-

Every member offering to present a petition to the Assembly shall confine himself to a statement of the parties from whom it comes, of the number of signatures attached to it and of the material allegations contained in it and to the reading of the prayer of the petition.

212. *Procedure to be followed* :—

If a petition is in conformity with rule 210 the Secretary shall if so required by the Speaker, read it to the Assembly or make an abstract of it and read or circulate the abstract to the Assembly There shall be no debate or speech in the Assembly on any such petition. "

(విద్యాశాఖామంత్రి) శ్రీ యస్ బి పి పట్టాభిరామారావు · దీనిపై చర్చ వస్తే నేను చెప్పడానికి details లేవు ఇప్పుడు. కనుక నాకు కొంచెం time కావాలి

మిస్టర్ స్పీకర్ · అవసరమైతే చూదురు గాని. కానీ ఇది ఒక అర్జీ. దీనిని పెట్టడానికి సమయం గనుక ప్రవేశపెట్టాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణంరాజు (వదమలపేట) : పిటీషన్ వచ్చినట్లు నాకు తెలియదే ?

మిస్టర్ స్పీకర్ : నిన్న నాదగ్గరకు వచ్చింది. శాసనసభలో నాకు ఇచ్చారు. గౌరవనీయులైన ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ్యులు ఇచ్చారు. అది ఈ విధంగా ఉంది :—

" మహాశయులారా !

(1) ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తప్పితే మిగిలిన ఆంధ్ర విశ్వవిద్యాలయాలలో కూడా రాత్రి [illegible] కళాశాలలను, సెప్టెంబర్ కళాశాలలను ప్రారంభించడానికిగాను, విశ్వవిద్యాలయాల [illegible] అధికార్లతో సంప్రదించవలెను.

(2) విశ్వవిద్యాలయాల పరిపాలనలోను, పరిపాలకుల నియామకంలోను ప్రభుత్వ జోక్యం వీలైనంత తగ్గించడానికి అనువుగా విశ్వవిద్యాలయాల చట్టాన్ని సవరించడానికి అవసరమైన చర్యలన్నిటినీ తీసుకోవలసిందిగా ప్రజా ప్రతినిధులైన మీకందరికి విజ్ఞప్తి చేస్తున్నాము "

శ్రీ ఆర్ బి రామకృష్ణంరాజు ఇది పిటీషన్ ఎందుకు అవుతుంది ? cut motion మీద మాట్లాడవచ్చు.

మిస్టర్ స్పీకర్ నాలుగు వందల మంది సంతకాలు చేశారు. ఇద్దరు శాసన సభ్యులు ఇచ్చారు గనుక ఇది పిటీషన్ అవుతుంది

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) అర్జీ ఇచ్చిన మిత్రు లెవరో తెలియలేదు.

మిస్టర్ స్పీకర్ శ్రీ బి శ్రీరామమూర్తి, శ్రీ సత్యనారాయణరాజు. ఇది ఊరికే తమ దృష్టికి తీసుకువచ్చాను.

శ్రీ యస్ నారాయణప్ప (గూటి జనరల్) · ఈ లాంటి అర్జీలు స్పీకర్ గారి గదిలో ఇవ్వాలో లేక సభలో ఇస్తే సరిపోతుందో clarify చేయాలని అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్ స్పీకర్‌గారి room లో ఇస్తే దానిని శాసనసభలోకి తీసుకు వస్తారు.

## Calling attention to matters of urgent public importance closure of the Co-operative Collective Weavers' Centre, Kalahasti.

మిస్టర్ స్పీకర్:-రూలు 73 క్రింద శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు "The attention of the Minister for Social Welfare, Labour and Cottage Industries is drawn to the serious situation arisen out of the closure of the Co-operative Collective Weavers' Centre, Kalahasti, effecting 2000 Workers." ఆనోటీ ఇచ్చారు.

The Minister for Endowments and Industries will make a statement.

*The Minister for Endowments and Industries (Sri A. Bhagavantha Rao)*: Sir, during the period of second world war when there were controls over yarn, and when distress was prevalent among the weavers, composite Madras Government started collective weaving centres at select weaving centres including Kalahasti to provide employment to weavers. They were managed by the Provincial Textile Commissioner. They were subsequently transferred to the Madras State Handloom Weavers' Co-operative Society in 1945 with their assets and liabilities. The Madras State Handloom Weaver' Co-operative Society ook over these centres with a view to ultimately convert them into weavers' co-operative societies It had been trunning the collective weaving centres, as its production units. On the formation of the Andhra Handloom Weavers' Co-operative Society, the Collective Weaving Centre at Kalahasti came under its control. The members of the centre are 'B' class members of the Andhra Handloom Weavers' Co-operative Society. The centre was directly in charge of a special officer appointed by the Andhra Handloom Weavers' Co-operative Society

The Collective Weaving Centre was producing mostly sarees. It was complained by the selling units of the State Society that the sarees produced by this centre were not saleable in the market and that they were getting accumulated in the selling units and the central godowns. The State Society made efforts to improve the quality of production but in vain. The Special Officer was instructed to arrange for the production of the sarees of finer counts required by the Inter-State depots at Madras and Bangalore. etc. But the goods produced were found to be unsaleable in those units. The State Society was incurring every year heavy loss on account of this centre because the sarees produced had to be sold at reduced rates. The Board of Directors of the State Society considered the position of this

centre in their meeting held on 26-12-1957 and decided to close it down.

The members of the Kalahasti Collective Weaving Centre have, to their credit a sum of Rs. 8,154/- under thrift deposits besides share capital invested by them in the Andhra Handloom Weavers' Co-operative Society The Deputy Registrar of Co-operative Societies, Tirupathi has been requested by the Director of Handlooms to organise another society in Kalahasti for the benefit of the members of the collective weaving centre, diverting the thrift deposits as share capital of the respective members in the proposed society, without collecting any further share capital.

The weaver members of the collective weaving centre have been agitating against the closure of this centre. In view of the agitation carried on, the State Society agreed to continue the centre for 3 more months or till the proposed co-operative society is organised whichever is earlier.

The Commissioner of Labour who was asked to send a report on the closure of the Collective Weaving Centre has reported that the Labour Laws are not applicable to the Centre, in the absence of employer-employee relationship and that the Labour Department can only use their good offices by requesting the authorities to help the weavers

The Inspector General of Police has reported that the hunger strikes resorted to by Sri Katikala Ramaswamy (P S.P.) and Sri P Venkatappiah (Communist party) from 1-3-1958 and 5-3-1958 respectively, are reported to have been called off at 5.00 P M. on 7-3-1958 consequent on the orders issued by the Andhra State Handlom Weavers' Association at Vijayawada to the Co-operative Collective Weaving Centre at Kalahasti to commence the issue of yarn to the members at Kalahasti as usual.

# BUDGET-DEMANDS FOR GRANTS

*Demand No. XVII-Education-Rs 12,03,62,000*

*Demand No XVI-Mines & Archaeology-Rs 3,40,000*

*The Minister for Education (Sri S B P Pattabhiramrao)*: On the recommendation of the Governor, I beg to move that the Government be granted a sum not exceeding Rs 12,03,62,000 under Demand No. XVII-Education

The Government be granted a sum not exceeding Rs. 3,40,000 under Demand XVI Mines and Archaeology

*Mr. Speaker* Motion moved.

విద్యాశాఖకు సంబంధించిన ఈ డిమాండును ప్రతిపాదిస్తున్నాను ప్రతిపాదిస్తూ కొన్ని విషయాలు సభాముఖమున తమద్వారా మనవిచేస్తున్నాను ఇలా ప్రతిపాదించటానికిముందు, నేను నిర్వర్తించవలసిన విధి ఒకటి ఉన్నది కేంద్ర ప్రభుత్వ మాజీ విద్యామంత్రి, కీర్తిశేషులు మౌలానా అబుల్ కలాం ఆజాద్‌కు, నమోవాకములర్పించి, ప్రశంసించడం నా కర్తవ్యం ఒక గొప్ప విద్యావేత్తను కోల్పోయాం మనం. అంతేకాదు, ఆయన మహాపండితుడు. సంస్కృతీ సాహిత్య శిల్పములకు పోషకుడు భారతదేశంలో విద్యాభ్యుదయానికి తన జీవితాన్ని అంకితంచేసుకొన్న మహానుభావుడు ఆయన అనుచరులైన డా. శ్రీమాలి, ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్‌లు. వీరిద్దరూ కూడా విశిష్టతను సంపాదించుకొన్న విద్యావేత్తలు. మౌలానా సాహెబ్ శ్రద్ధచూపిన వివిధ విద్యావిషయములను గురించి, వీరు కూడా తగు శ్రద్ధను తీసుకొని, ఆయా విధానాలను కొనసాగించగలరని నమ్ముతున్నాను.

దేశాన్ని ఆర్థికంగా అభివృద్ధిచేసుకోవాలని మనమందరం పాటుబడుతున్నాం. ఆర్థికాభ్యుదయం కంటె, కేవలం ఆర్థిక విషయాలకు చెందినట్టిదే కాదు. ఇది మానవ సంస్కృతికి చెందినట్టిదికూడా. ఏ రంగంలో ఎంత విస్తారంగా కృషి జరుగవలసివచ్చినప్పటికి, ఆ యావత్తుకూ కేంద్రం మనుష్యుడే. అందులోనూ ప్రజాస్వామిక వ్యవస్థలో ఆర్థికాభివృద్ధి ఉత్తమమైన విలువలననుసరించి ఉండాలి. పూర్వంలో ధర్మాలు అనేవాళ్ళం. వాటినే ఈనాడు విలువలని అంటున్నాం. ఇట్టి ఉత్తమమైన విలువలను, దృక్పథాలను రూపొందించటంలో విద్యకు విశేషస్థానం ఉన్నది. మిగతా రంగాలన్నీ నిజానికి మనుష్యుని బాహ్యజీవనానికి చెందినట్టివి. కాని విద్యారంగం అతని అంతఃకరణకు చెందినట్టిది.

సోషలిస్టు విధాన సమాజంలో, ప్రతిస్థాయిలో ప్రజలు పాల్గొనటం చాలా అవసరం కాని అధికసంఖ్యాకులు నిరక్షరాస్యులైతే, ఇది హాస్యాస్పదంగా ఉంటుంది. ప్రజానీకపు శ్రేయస్సుకు ఆర్థికాభివృద్ధి తోడ్పడాలంటే, ఆర్థిక ప్రణాళికలకన్న ఒక అడుగు ముందే ఉండాలి విద్యా కార్యక్రమాలు మన ప్రణాళికల్లో విద్యకు చూపించవలసిన ప్రాముఖ్యం ఆంధ్రప్రభుత్వానికి తెలుసు రెండవ పంచవర్ష ప్రణాళికను తయారుచేసేప్పుడు, ప్రతిస్థాయిలోనూ ఉండే విద్యావసరాలను దృష్టిలో ఉంచుకొనే తయారుచేశాం నీటిసాగు, విద్యుచ్ఛక్తి, వ్యవసాయం, మరికొన్ని శాఖలు ప్రణాళికకయ్యే మొత్తం ధనంతో పెద్ద వాటానే సంపాదించుకున్నప్పటికీ, ప్రణాళికలో విద్యకని కేటాయించిన రూ 12.80 కోట్లు ఏమంత స్వల్పమొత్తం అనడానికి వీలులేదు లక్ష్మీదేవి సహాయం సరస్వతికి ఎక్కువగా లేకపోయినప్పటికీ, తాను పొందే సహాయానికి ఎన్నోరెట్లు ప్రతిఫలాన్ని ఇస్తుంది, భారతి. నిజానికి ప్రతిశాఖకూ కావలసినవి చాలా ఉన్నవి ముఖ్యమైనవి. కాని, కొన్ని రంగాల అభివృద్ధిని లక్ష్యంగా పెట్టుకొనే ప్రణాళికలో, కొన్ని ముందు, కొన్ని వెనుక అనేది తప్పదు. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయానికి అగ్రతాంబూలం ఇచ్చింది. అందువలన, విద్యతోసహా సాంఘిక సౌకర్యాలకు సంబంధించిన విషయాలు ఒక అడుగు వెనుకన ఉండి, ఓపిక పట్టాలి మూడవ ప్రణాళిలో తదనంతర ప్రణాళికల్లో ముందడుగు వేయవచ్చు. ఈ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, మనం మన విద్యాప్రణాళికను, బడ్జెట్ కేటాయింపులను పరిశీలించాలి.

తెలంగాణా ఆంధ్రప్రాంతాల ఏకీకరణ ఫలితంగా చట్టాలను నిబంధనాలను సమన్వయం చేసే విషయాల గురించి పని జరుగుతోంది. నిబంధనలు గ్రాంటు-ఇన్-ఎయిడ్ కోడ్ వగైరాల సమన్వయానికి సంఘాలు ఏర్పాటుచేయబడినవి. ఒకే సెకండరీ విద్యాసంఘం, పాఠ్య పుస్తకాల నిర్ణయానికి రెండు ప్రాంతాలకు ఒకే సంఘం వగైరాలు యీ ఏడాది ఏర్పాటుచేయబడినాయి.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల్లో ఉన్న పబ్లిక్ గ్రంధాలయాల చట్టాల సమన్వయానికి సంబంధించిన శాసన వ్యవహారాలను శాసనసభలో ప్రవేశపెట్టడానికి తగిన ప్రయత్నాలు జరుగుతున్నాయి చురుకుగా. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఛార్టర్ సవరింపుకు త్వరలో చర్యలు తీసుకొనబడుతున్నవి. అనగా బిల్లు తయారై ఉన్నది. దానిని ఈ నెలలో ప్రచురణచేస్తున్నాం. వీటిని శాసనసభలో ఈ sessionలోనే introduce చేస్తాం. అనగా ఈ సమావేశం ఈ నెలాఖరున adjourn అయ్యి-మళ్లీ త్వరలో కలుస్తాం. ఇవికూడ ఆసమావేశంలోనే వొస్తాయి. కనుక ఈ session లోనే వొచ్చే కొద్దివారాలలో ఏర్పడే సమా

వేశంలో బిల్లును ప్రవేశపెడుతున్నాం. అలాగే ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాల చట్టాలకు తగు సవరణలు చేయబడుతున్నాయి. విశ్వ విద్యాలయాలకు సంబంధించిన శాసనాల్లో ఇప్పటికన్న ఇంకెక్కువ సామ్యం సమత ఉండాలని ప్రభుత్వ ఆశయం.

విద్యాశాఖకు సంబంధించిన ఇతర చట్టాల సమన్వయానికి కూడా, యీపాటి శాసనరీత్యా కావలసిన వ్యవహారం జరుగుతోంది. వివిధ విద్యా శాఖల్లో పనిచేస్తున్న ఆంధ్ర, తెలంగాణా ఉద్యోగుల విషయంలో సీనియారిటి జాబితాలు తయారు చేయబడుతున్నాయి.

కర్నూలులోని ప్రభుత్వ పరీక్షల కమిషనర్ ఆఫీసును హైదరాబాదుకు మార్చడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. వివిధ స్థాయిల్లో విద్యాభివృద్ధికి గాను ఎప్పటికప్పుడు కేంద్రప్రభుత్వం చేసే సూచనలు పరిశీలింపబడుతున్నాయి. విద్యావిధానం అభివృద్ధిచేయబడుతోంది.

ఈ సంవత్సరం, అనగా 1958-59 బడ్జెట్ అంచనాలలో విద్యాశాఖకుగాను రు. 11,68,98,000 ల మొత్తం కేటాయించబడింది. గత సంవత్సరపు కేటాయింపు రు. 11,22,72,000 లు అనగా క్రితం సంవత్సరం కన్న రు. 46,26,000 లు ఎక్కువ యీపాటి కేటాయింపు దాదాపు అరకోటి రూపాయలు అధిక మన్నమాట

ఇక విద్యారంగానికి చెందినట్టి వివిధవిషయాలగురించి, ప్రాథమిక, సెకండరీ, యూనివర్సిటీ, సాంకేతిక విద్యా విషయాలగురించి వివరంగా మనవిచేస్తున్నాను.

ప్రాథమిక విద్య :

మన రాష్ట్రంలో ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వం, జిల్లాబోర్డులు, పురపాలక సంఘాలు, ప్రైవేటు సంస్థలు నిర్వహిస్తున్నాయి. ఈ ప్రైవేటు సంస్థలు సరిగా పనిచేయడంలేదనే విమర్శలమూలంగా, ప్రభుత్వం అంచెల వారీగా ఎయిడెడ్ పాఠశాలలను స్వాధీనం చేసుకొనటానికి నిశ్చయించింది. అందుకని 1956 ఆంధ్ర విద్యాసంస్థల స్వాధీనం చట్టం ఆమోదింపబడింది. 1956-57 లో నెల్లూరు జిల్లాలోని పాఠశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. ఈ యేడాది ఈ స్కీము విశాఖపట్టణం జిల్లాలో కూడా అమలు జరుపబడుతున్నది. 1958-59 సంవత్సరంలో ఇంకెక్కువ జిల్లాలకు యీస్కీమును వర్తింపచేయాలనే విషయం ఆలోచనలో ఉన్నది.

ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలను సాధ్యమైనంతవరకు పెంచాలనే ప్రభుత్వం ఆలోచిస్తున్నది ఇదికాక 1957-58 లో కరువుభత్యం పెంచాము. ఇదికాక,అదనంగా కొంత ఉపాధ్యాయులకు యివ్వదలచినాము. అయితే ఇందుకు మనం కోరినట్లు కేంద్ర ప్రభుత్వం యీ ఖర్చులో తనవాటాను భరించడానికి ఒప్పుకోవాలి అందుకుగాను exact figures ఇపుడు మీకు మనవి చేయలేకుండా వున్నాను. కేంద్ర ప్రభుత్వానికి వ్రాసినాము. జవాబు కొరకు ఎదురుచూస్తున్నాము.

ఆంధ్ర, తెలంగాణా రెండు ప్రాంతాల్లోని ప్రాథమిక పాఠ్య విషయాలను సమన్వయం చేశాం. ఆంధ్రప్రదేశ్ అంతకూ ఒకే పాఠ్యక్రమణికను తయారు చేయడం జరిగింది ఈలాగే సెకండరీ స్కూళ్ళకుకూడా ఒకే పాఠ్యక్రమణికను తయారుచేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

1957 – 58 లో 496 ప్రాథమిక పాఠశాలలను, 200 జూనియర్ బేసిక్ స్కూళ్ళను ప్రారంభించడం, 722 ప్రాథమిక పాఠశాలలను జూనియర్ బేసిక్ స్కూళ్ళుగా మార్చడం, 386 ఎయిడెడ్ స్కూళ్ళను ఏకోపాధ్యాయ ప్రాథమిక పాఠశాలలుగా మార్చడం, ఈ కార్యక్రమం ఇంచుమించు పూర్తిచేయబడినట్లే ప్రాథమిక పాఠశాలలకు, జూనియర్ బేసిక్ స్కూళ్ళకు కుర్చీలు, బల్లలు వగైరాలకు,పరికరాలకుగాను 31-3-1958 లోపల ఆంధ్రప్రాంతంలో రు 1 5 లక్షలు తెలంగాణా ప్రాంతంలో రు. 1.5 లక్షలు ఖర్చు అవుతాయి

సెకండరీ విద్య :

1-4-1957 కు ఆంధ్రప్రాంతంలో 727 సెకండరీ స్కూళ్ళు ఉన్నాయి 2,52,151 మంది బాలురు, 52,637 మంది బాలికలు చదువుకుంటున్నారు. 1957–58 సంవత్సరంలో కొత్తగా 36 మాధ్యమిక పాఠశాలలు, 16 హైస్కూళ్ళు ప్రారంభింప బడినవి. హైస్కూలుకి మార్చిన పాఠశాలల సంఖ్యకూడా కలుపుకొని 17 ఉన్నత ప్రాథమిక పాఠశాలలు మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడినాయి. 1957-58 లో అదనంగా 216 విభాగాలు ఏర్పాటుచేయబడినాయి 1956-57 లో ఆంధ్రప్రాంతంలో ఒకటవ ఫారంలో ఉచితవిద్య ఏర్పాటు చేయబడింది. 1957-58 లో రెండవ ఫారానికికూడా ఈ సౌకర్యం విస్తరించబడింది. 1958-59 లో మూడవ ఫారానికికూడ ఈ ఏర్పాటు వర్తిస్తుంది.

1-4-1957 కు తెలంగాణా ప్రాంతంలో 274 సెకండరీ స్కూళ్ళు ఉన్నాయి. 1,09,948 మంది బాలురు, 39,858 మంది బాలికలు చదువుకుంటు

న్నారు 1957-58 లో కొత్తగా ఒక సెకండరీ స్కూలు, 135 అదనపు విభాగాలు ప్రారంభించబడినాయి

తెలంగాణాలోని ప్రభుత్వ సెకండరీ పాఠశాలలకు గ్రంథాలయాల క్రింద పరికరాలు వగైరాలు అభివృద్ధుల క్రింద రు 5 75 లక్షలను ఖర్చుపెట్టాలనుకున్నాం. ఈ కార్యక్రమం 31-3-1958 కి ఇంచుమించు పూర్తిగా అమలు జరుపబడినట్లే

ఆరు ప్రభుత్వ ప్రత్యేక పాఠశాలల్లోనూ, ఎయిడెడ్ పాఠశాలలన్నిటిలోనూ తప్ప, తెలంగాణా ప్రభుత్వ స్కూళ్ళలో సామాన్యంగా విద్య మూడవ ఫారం వరకూ ఉచితమే. ఆంధ్రలోవున్న ఉచిత విద్యాసౌకర్యాన్ని 3rd form వరకు తెలంగాణాలోని అన్ని స్కూళ్లకు ఈ సంవత్సరం వర్తింపజేయాలి అని అనుకుంటున్నాం

## కొత్త సంవత్సరపు కొత్త స్కీములు కొన్ని - అయ్యేఖర్చు.

| కొత్త స్కీములు. | రూ. లక్షలు |
|---|---|
| 1. కొత్తగా 7 ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించటం... | 1 48 ,, |
| 2. బహుళార్థ సాధక పాఠశాలలకు భవనాలు, పరికరాలు వగైరా. . | 1.00 ,, |
| 3. ముఖ్యపాఠ్య విషయాల బోధనను అభివృద్ధి పరచటం.... . | 2.90 ,, |
| 4. హైస్కూళ్ళకు కొత్త భవనాలు... . | 1.70 ,, |
| 5. తెలంగాణాలో ఉన్నత సెకండరీ స్కూళ్లను బహుళార్థసాధక పాఠశాలలుగా మార్చడం.... ... | 4.04 ,, |

**యూనివర్సిటీ విద్య :**

ఉస్మానియా విశ్వవిద్యాలయప్రాంతంలో ప్రీ యూనివర్సిటీ తరగతి 1956-57 లో ప్రారంభించబడింది. ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాల ప్రాంతాల్లో ఈ తరగతిని 1957 - 58 లో ప్రారంభించారు. మూడేళ్ళ డిగ్రీకోర్సు ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రాంతపు కళాశాలల్లో ఈ యేడాది ప్రవేశపెట్టబడింది. ఆంధ్రప్రాంతపు కళాశాలల్లో 1958 - 59 ఆరంభంనుంచి ఈ కోర్సు ప్రారంభమవుతుంది.

ఆంధ్ర ప్రాంతంలో సాధారణ విద్యకు 32, వృత్తి విద్యకు 11 కళాశాలలున్నాయి. ఉపాధ్యాయుల ట్రైనింగ్, ఎంజినీరింగ్, వైద్యం, వ్యవసాయం, పశువైద్యం, ఈ కళాలలు వృత్తి విద్యాకళాశాలల క్రిందకు వస్తాయి. ఈ ఏడాది రాజమండ్రిలో ఒక వృత్తి సలహాయూనిట్, ఒక పారిభాషిక పరిశోధక యూనిట్ ఏర్పాటుచేయబడినాయి. 1958-59 విద్యా సంవత్సరం ఆరంభంనుంచి కర్నూలులో ఒక ప్రభుత్వ స్త్రీలకళాశాల ఏర్పాటు చేయబడుతుంది. తెలంగాణాలోని ఎయిడెడ్ కళాశాలలకు కుర్చీలు, బల్లలు, పరికరాలు వగైరాల క్రింద 92 వేల రూపాయలు- అలాగే ఆంధ్రలో వున్నటువంటి కోర్సుల మార్పుకు గాను ఒక లక్ష పదివేల రూపాయలు యివ్వబడినవి ఆంధ్ర విశ్వవిద్యాలయానికి గ్రాంటుగా యివ్వడానికి వచ్చేసంవత్సరం బడ్జటులో లక్ష రూపాయలు కేటాయింపుచేయబడినది. వాల్టేర్‌లో స్నాతకోత్సవమందిరాన్ని ప్రారంభించడానికిగాను దీని మొత్తము ఖర్చు అంచనా 5 లక్షలు ఇందులో ఒకలక్ష ఇపుడు యిస్తున్నాము.

తెలంగాణా ప్రాంతంలో 6 యూనివర్సిటీ కళాశాలలు, 10 కాన్స్టిట్యుయెంట్ కళాశాలలు, 15 అనుబంధ కళాశాలలు ఉన్నాయి. 1957-58 లో మరొక కళాశాలను గుర్తించి సహాయం చేయడం కూడా జరిగింది.

తెలంగాణాలోని చాలా కళాశాలలు 1956 లో దాతల విరాళాలతో ప్రారంభమైనవి వీటిలో యీ సంవత్సరం మూడేళ్ళ డిగ్రీకోర్సు ప్రవేశపెట్టబడింది

ఆంధ్రప్రాంతంలో గ్రాంటు-సహాయ నిబంధనలక్రింద కలిగే సౌకర్యాలను తెలంగాణా కళాశాలలకు కూడా వర్తింపచేసే విషయాన్ని పరిశీలించేందుకని 1957 లో ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘపు సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించింది. వీటిప్రకారం తెలంగాణా కళాశాలలకు ఇప్పటికన్న ఇంకెక్కువ గ్రాంటులు లభిస్తాయి. ఇంతవరకు కట్టడాల, పరికరాల గ్రాంట్లను పొందే అవకాశం ఈ కళాశాలలకు లేదు. 1-4-1958 నుంచి అమలులోకి వచ్చే కొత్తగ్రాంటు – సహాయ నిబంధన మూలంగా, ఆంధ్రప్రాంతంలోని కళాశాలలకు వలెనే తెలంగాణాలోని కళాశాలలకుకూడా కట్టడాలకు, పరికర సామగ్రికి గ్రాంట్లు ఇవ్వబడుతాయి

1958-59 బడ్జెట్ అంచనాల్లో శోధన గ్రాంట్ల చెల్లింపుకు చేసిన కేటాయింపుకు అదనంగా కేవలం తెలంగాణాలోని కళాశాలలకుగాను పరికరాల సామగ్రి గ్రాంటుక్రింద రు. 1.48 లక్షల మొత్తం కేటాయించబడింది.

ఈ సంవత్సరం ప్రణాళిక కార్యక్రమాల విషయంలో అనుకున్నంతగా ఖర్చు చేయలేకపోయాం. సాధ్యమైనంతవరకు ప్రణాళికను పూర్తిగా అమలు జరపటమే మన అందరి అభీష్టం. ఈవిధంగా చూస్తే, పైన చెప్పిన విషయం కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. కాని మనకెదురైన కొన్ని చిక్కులను బట్టి, ఇబ్బందులను బట్టి చూస్తే, ఇలా అనుకొన్నంతగా పూర్తి ఖర్చు చేయలేకపోవడం ఏమంత నిస్పృహచెందవలసిన విషయం కాదని తోస్తుంది. మన రాష్ట్రానికి మొదటి సంపూర్ణ ఆర్థిక- సంవత్సరం యీ యేడాది రెండు ప్రాంతాల ఏకీకరణకు సంబంధించిన సమస్యలవలన మొదట్లో అభివృద్ధివేగం కొంత మందగించడం సహజం కూడా డి. పి. ఐ. ఆఫీసు కొన్నిభాగాలు కర్నూలునుండి హైదరాబాదుకు జూన్‌లోనే తరలించబడినాయి. ప్రణాళికా కార్యక్రమాలన్నీ ఒకే నిర్వహణకిందకు జూన్‌లోనే తేబడినాయి. పరిస్థితులు ఎంతో అనుకూలంగా ఉన్నప్పటికీ, ప్రణాళికలోని కొన్ని లక్ష్యాలకు కేవలం ఒక్క సంవత్సరంలోనే పూర్తిచేయటమనేది సాధ్యం కాదు. అటువంటి స్కీములు విషయంలో ప్రణాళికను మార్పుచేయవలసి వచ్చింది. వీటిలో కొన్నిటి సందర్భంలో స్థానిక సంస్థలు, ఎయిడెడ్ సంస్థలు కొంత ఖర్చును భరించవలసి ఉంటుంది. కాని వీటిలో అన్నిటికీ యీ ఖర్చును భరించేశక్తి లేదు. సకాలంలో డబ్బుతో ముందుకువచ్చే సంసిద్ధతా లేదు. పైగా, 1957-58 ప్రణాళిక కార్యక్రమాలు రాష్ట్రం అంతటా ఉన్న సుమారు 1200 సంస్థలకు సంబంధించినట్టివి ఈ వివిధ కార్యక్రమాలపై ఒక కన్ను వేసి ఉంచటం చాలా కష్టం కూడా. ముఖ్యంగా తెలంగాణాలోని ప్రభుత్వ సంస్థలకు పరికరాలు వగైరా సామగ్రిని కొనే విధానాన్ని గురించి ఇటీవలనే ఒక నిర్ణయానికి రావడం జరిగింది. ఈ కారణాలన్నిటిమూలంగా, అనుకొన్నంతగా ఖర్చు కావడానికి వీలు లేకపోయింది. వీటన్నిటికంటె ముఖ్యవిషయం ఇంకొకటి ఉంది. సిమెంటు, ఉక్కుల కొరతమూలంగా కట్టడాల నిర్మాణ కార్యక్రమం కుంటుపడిపోవడం. ప్రభుత్వశాఖలేవీ కొత్తగా భవనములను నిర్మించవద్దని, కేంద్ర ప్రభుత్వ ఆర్థికశాఖ ఆమోదంలేకుండా పునాదివరకూ గల పనులను కొనసాగించవద్దని కేంద్ర ప్రభుత్వం సెప్టెంబరులో ఆదేశించింది ఈ నిర్బంధం డిసెంబరు నెలలోనే ఉపసంహరింపబడింది. కాని స్థానికవసతులతోనూ, సిమెంటు, ఉక్కులను కనీసంగా వినియోగిస్తూనూ నిర్మాణ కార్యక్రమాలను కొనసాగించటానికి రాష్ట్ర ప్రభుత్వాలకు అనుమతి ఇవ్వబడింది. సాంకేతిక దృక్-శ్రవణ విద్యా విషయాలకు సంబంధించిన తక్కువ ఖర్చుకు ఒక కారణం విదేశీద్రవ్యమారకస్థితి అనుకూలంగా లేకపోవడం కూడా.

[illegible] సాధకబాధకాలు ఉంటున్నప్పటికీ ప్రణాళికా కాలపు ఈ మూడేళ్ల వ్యవధిలో లక్ష్యాలను పూర్తిగా సాధించడానికి [illegible]

సాంకేతిక విద్య

దేశం అంతటా భారీ ప్రాజెక్టులను అమలుజరపడం మూలంగానూ, కొత్త పరిశ్రమలను స్థాపించడం మూలంగానూ సుశిక్షితులైన సాంకేతిక శాస్త్రజ్ఞుల ఆవశ్యత హెచ్చింది. సాంకేతిక విద్యకు చాలా ప్రాముఖ్యం వచ్చింది. ఈ ఏడాది యీ విషయంలో బాగా పురోభివృద్ధి జరిగినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది. నా క్రిందటి బడ్జెట్ ప్రసంగంలో ప్రకటించినట్లుగా, సాంకేతిక విద్యకు ట్రైనింగుకు ప్రత్యేకంగా ఒక డైరెక్టరేటును ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఈ శాఖ కార్యక్రమాల నిమిత్తమై ఒక రాష్ట్రసంఘం నియమింపబడింది కూడా. ఈ ఏడాది ప్రారంభింపబడిన సంస్థలు-కొత్తగూడెంలో గూడూరులో రెండు మైనింగ్ సంస్థలు, తిరుపతిలో, హైదరాబాదులో రెండుపోలిటెక్నిక్‌లు: నెల్లూరులో విశాఖ పట్నంలో రెండు పారిశ్రామిక శిక్షణ కేంద్రాలు. ఈ సంస్థల విద్యార్థుల సంఖ్య కూడా బాగా పెరిగింది. 1956-57 లో పోలిటెక్నిక్ కేంద్రాల్లో 750 మందికి ప్రవేశం ఉంటే, 1957-58 లో ప్రవేశం 1,480 మందికి ఉన్నది ఎంజినీరింగ్ కళాశాలల్లో కూడా, 1956-57 లో 395 సీట్లు ఉంటె 1957-58 లో 610 సీట్లు ఉన్నాయి రెండు మైనింగ్ సంస్థలు డిప్లొమాస్థాయికి చెందినట్టివి. ఒకటి బొగ్గు తవ్వడానికి, మరొకటి ఇతర ఖనిజాలకు సంబంధించినట్టిది. ఇవి ప్రత్యేక సంస్థలు. వీటికి కేంద్రప్రభుత్వం సహాయం చేస్తున్నది.

120 మంది విద్యార్థులకు ప్రవేశమిస్తూ, అనంతపురం, కాకినాడ ఇంజనీరింగ్ కళాశాలలలో వచ్చే సంవత్సరం ప్రి - ప్రొఫెషనల్ కోర్సులను ప్రారంభించాలని ఉన్నది.

ప్రైవేటు యాజమాన్యంకింద తణుకులోనూ, వనపర్తిలోనూ రెండు పోలిటెక్నిక్కులను ఏర్పాటు చేస్తామని ప్రభుత్వానికి తెలియచేశారు పెద్దలు. వీటి విషయం ఆలోచనలో ఉన్నది. మహబూబునగర్ పోలిటెక్నిక్ గురించి పరిశీలనలో ఉన్నది. వచ్చే ఏడాది వరంగల్లులో ఒక కొత్త పారిశ్రామిక శిక్షణ సంస్థకు స్థాపించాలని ఉన్నది. మొత్తంమీద అన్ని సాంకేతిక సంస్థలలోనూ 300 సీట్లు అధికం చేయాలని ఉన్నది.

వరంగల్లులో ఒక ఎంజినీరింగ్ కళాశాలను ఏర్పాటు చేయాలనే సూచన కూడా ఉన్నది,

ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు వరంగల్లులో ఒక ఇంజినీరింగ్ కళాశాలను ఏర్పాటు చేయవలసిందని కోరగా, పూర్వపు హైదరాబాదు

ప్రభుత్వం యీవిషయం గురించి కొంత శ్రద్ధ తీసుకొన్నది. పింగళి కుటుంబం వారు భవనాలను ఇస్తామన్నారు హైదరాబాదులోని యూనివర్సిటీ ఇంజినీరింగ్ కళాశాలలో 80 అదనపు విద్యార్థులకు శిక్షణ ఇవ్వటంవల్ల లాభించే ధనాన్ని పి. డబ్ల్యు. డి. కి ఇచ్చివేయవచ్చునని, ఆ ధనం ఇందునిమిత్తమై వినియోగించవచ్చునని సూచన చేయబడింది. ఈ విషయమై 8-9-1956 న ఒక నిర్ణయంకూడా తీసుకొనటం జరిగింది దీని తర్వాత అప్పటి విద్యామంత్రి మద్రాసులోని దక్షిణ ప్రాంతీయ సంఘపు అధ్యక్షునికి 23-10-1956 న ఒక డి. ఒ ఉత్తరాన్ని, ముఖ్యమంత్రి కేంద్రప్రభుత్వ విద్యామంత్రికి 24-10-1956 న ఒక డి ఒ. ఉత్తరాన్ని వ్రాశారు. పూర్వపు హైదరాబాదు రాష్ట్రపు రెండవ పంచవర్ష ప్రణాళికలో మాత్రం యీస్కీము చేర్చబడలేదు. నిజం చెప్పాలంటే ఈస్కీముకని డబ్బు కేటాయింపు చేయబడలేదు. ఈ స్కీము విషయమై కలుగుతున్న ఇబ్బందికి ఇదే ముఖ్య కారణం.

ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాత, ప్రభుత్వం యీవిషయాన్నిగురించి కొంత శ్రద్ధవహించింది. పింగళి కుటుంబంవారు వరంగల్లు కలెక్టరుకు 1-11-1956 న భవనాన్ని అప్పగించారు. 21-11-1956 న జరిగిన దక్షిణ ప్రాంతీయ సంఘ సమావేశంలో యీస్కీముగురించి చర్చ అయితే జరిగింది. కాని ఇదమిద్ధమని ఒక నిర్ణయం వారు ఏమీచేయలేదు. ఖచ్చితమైన ప్రతిపాదనలను చేయవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆసంఘపు అధ్యక్షుడు కోరాడు రెండవ ప్రణాళికకింద దక్షిణ ప్రాంతంలో ఒక ఇంజినీరింగ్ కళాశాలను ఏర్పాటు చేయడానికి కేంద్రప్రభుత్వం సుముఖంగానే ఉన్నది కాని వాల్తేరులో ఇదివరలోనే ప్రారంభించబడిన కళాశాలను గుర్తించటానికే అనుకూలంగా ఉన్నట్లు కేంద్ర ప్రభుత్వం ఈవిషయం గూర్చి తెలియచేసింది. ఈవిషయంగురించి కేంద్ర ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు సుదీర్ఘంగానే జరిపాం. అయితేనేం, వారు ఒప్పుకోలేదు. ఈవిషయం 6-4-1957 న సమావేశమైన దక్షిణ ప్రాంతీయ సంఘ సమావేశంలో మళ్లీ చర్చకు వచ్చింది అఖిల భారత సాంకేతిక విద్యా సంఘంవారు ఆమోదించినట్టి, ఇంజనీరింగ్ పర్సనల్ కమిటీవారు సిఫార్సు చేసినట్టి అదనపు ఇంజనీరింగ్ కళాశాల విషయం వాల్తేరులో ప్రారంభించబడిన ఇంజినీరింగ్ కళాశాలను ధ్రువపరచడానికేనని, అయినప్పటికి తగిన ధనవసతితో రెండవ ప్రణాళికక్రింద అభివృద్ధి కార్యక్రమాన్ని తలపెట్టితే, దాన్నిగురించి కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేయవచ్చుననీ దక్షిణ ప్రాంతీయ సంఘాధ్యక్షుడు చెప్పాడు.

11-3-1957 న మన ముఖ్యమంత్రికి వ్రాసిన డి. ఒ ఉత్తరంలో, కేంద్ర విద్యామంత్రి 1958-59 సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి కేంద్రప్రభుత్వంతో, ప్లానింగ్ కమిషన్‌తో చర్చించినప్పుడు యీ కళాశాల కేటాయింపు గురించికూడా ప్రస్తావించవచ్చునని సూచించాడు.

పి డబ్ల్యు శాఖ బడ్జెటు కేటాయింపునుంచి యీకొత్త సంస్థ స్థాపనకొరకై తగిన ధనాన్ని సమకూర్చటం సాధ్యంకాదని తేలింది కాబట్టి ఇందుకై డబ్బును సమకూర్చటం విద్యాశాఖకు అవసరమైంది. రాష్ట్రంలో సాంకేతిక శిక్షితుల అవసరాన్ని, ప్రస్తుత పరిస్థితుల్లో వరంగల్లులో మరొక ఎంజినీరింగ్ కళాశాలను ఏర్పాటు చేయవలసిన అవసరాన్ని గుర్తించి, రాష్ట్రప్రభుత్వం యూనివర్సిటీతో యీవిషయం చర్చించింది. అంతేకాదు పింగళి కుటుంబంవారు ఇచ్చే భవన సదుపాయాలతో కళాశాలను ఆరంభించవలసిందిగా నచ్చజెప్పటంకూడా జరిగింది. ఈ ప్రభుత్వం పదేపదే చెప్పటం మూలంగా, దక్షిణ ప్రాంతీయ సంఘం ఇటీవలి సమావేశంలో యీప్రతిపాదనను అనుకూలంగా పరిశీలించింది.

ఇందుకయ్యే అదనపు ఖర్చును భరించే స్థితిలో తాను లేనని యూనివర్సిటీ తెలియచేసింది. కేంద్రప్రభుత్వ సహాయానికి అదనంగా, రాష్ట్రప్రభుత్వం సాలీనా ఖర్చునూ, ఒకేసారి అయ్యే అఖర్చునూ యావత్తునూ భరించాలని కూడా కోరింది. దీనికి సంబంధిన ఆర్థిక విషయాలను గురించి పరిశీలన తీవ్రంగా జరుగుతున్నది.

ఇంతలో ప్రొఫెసర్ ఎం. ఎస్. థాకర్‌తోసహా కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులు కొందరు యీ రాష్ట్రంలో మరొక ఇంజనీరింగ్ కళాశాలను, రెండు పోలిటెక్నిక్కులను కేంద్రప్రభుత్వం మంజూరు చేయవచ్చునన్నట్లుగా చెప్పారు. కళాశాలను రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వం కలసి నిర్వహిస్తాయి అన్నారు. వివరాలకోసం ఎదురుచూస్తున్నాం ఈ కళాశాలను వరంగల్లులో ఏర్పాటు చేయమని రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి సిఫారసు చేసింది. దీనికి కారణం, అధ్యక్షా, సభ్యులకు తెలుసు. ముఖ్యమంత్రిగారు దీనినిగురించి ఒక స్టేటుమెంటు కూడా చేశారు. ఆయనకు 120 మంది సభ్యులు సంతకంచేసి ఒక పిటిషన్ కూడా ఇచ్చారు. దానివల్లనే ఇది జరిగింది.

**పాఠ్య పుస్తకాలను జాతీయం చేయటం:**

పాఠ్య పుస్తకాలను నిర్ణయిస్తున్న ప్రస్తుత పద్ధతిలో ఉన్నలోపాలను సరిదిద్దడానికి, చౌకధరలకు మంచి పుస్తకాలు లభ్యమయ్యేటట్లు చూడడానికి పాఠ్య పుస్తకాలను జాతీయం చేయడం అవసరమనే నిర్ణయానికి ప్రభుత్వం వచ్చింది.

ఈ స్కీము యీ సంవత్సరం స్కూళ్ళు జూన్‌లో తెరచినప్పటినుంచి అమలులోకి వస్తుంది రాష్ట్రంలోని మూడు,-ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయాల దృష్ట్యా, మొత్తం రాష్ట్రం మూడు ప్రాంతాలుగా ఇందుకై పరిగణించబడింది

ముందు ప్రాథమిక పాఠశాలల్లో అయిదవ తరగతి తెలుగు వాచకం 1958-59 నుంచి జాతీయం చేయబడుతోంది. ఈ వాచకం ఒక్కొక్క విశ్వ విద్యాలయ ప్రాంతానికి విడివిడిగా వ్రాయబడింది. ఇందుకోసం ఏర్పాటు చేయబడిన మూడు రచయితల సంఘాలు యీ వాచకాలను తయారు చేశారు ఈ వాచకపు ప్రతులు 2 లక్షల పదివేలు కర్నూలు ప్రభుత్వ ముద్రణాలయంలో అచ్చు అవుతున్నాయి. వాటిని ప్రభుత్వమే ప్రచురించి, విద్యార్థులకు స్కూళ్ళకు సహకార స్టోర్సుద్వారానూ, అవిలేని చోట డిప్యూటీ స్కూళ్ల ఇన్‌స్పెక్టరుద్వారానూ సప్లయి చేస్తుంది.

ఆంధ్ర ప్రదేశ్ పాఠ్య పుస్తక ముద్రణాలయం మింట్ కాంపౌండులోని ప్రచురణల బ్యూరో ప్రభుత్వభవనంలో ఏర్పాటు చేయబడింది ఇది ఒక వ్యాపార సంస్థగా పనిచేస్తుంది.

అచ్చు యంత్రాలకు ఆర్డర్లు ఇచ్చాము అప్పుడే కొన్ని రావడం, వాటిని బిగించటం జరుగుతోంది. రచయితల సంఘాలు చేసే పనిని సమన్వయం చేయడానికి, పుస్తక ప్రచురణ విషయంలో బాధ్యత వహించేందుకు, పాఠ్య పుస్తక జాతీయకరణకై ఒక ప్రత్యేక అధికారి నియమింపబడ్డాడు.

ఈ జాతీయంచేసే విధానాన్ని పూర్తిగా అమలు జరుపటానికి, పూర్వ విధానంలోని లోపాలను అరికట్టేందుకు, ప్రాతిపదికగా ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలన్నిటికీ పాఠ్య పుస్తకాలను నిర్ణయించే అధికారాన్ని ప్రభుత్వం తీసుకున్నది. ఆంధ్రలో స్థానికసంస్థల ప్రాథమిక పాఠశాలలలో 1 నుంచి 5 వ తరగతి వరకు పుస్తకాలను నిర్ణయించడానికిగాను, విద్యారంగములోని ప్రముఖులతో ప్రభుత్వం 1956 లో ఒక అడ్-హాక్ సంఘాన్ని నియమించింది. 1957—58 సంవత్సరానికి ఈ తరగతులకు ప్రభుత్వం ఈ పుస్తకాలను నిశ్చయించింది. జాతీయం చేయబడిన అయిదవ తరగతి వాచకం తప్ప, ఇవే పుస్తకాలు 1958—59 సంవత్సరానికికూడా ఆంధ్ర ప్రాంతంలోని ప్రాథమిక పాఠశాలలన్నిటికీ-ప్రభుత్వపువి, స్థానిక సంస్థలవి, ఎయిడెడ్ పాఠశాలలకు—వర్తించుతాయి. అయిదవ తరగతి వాచకం తప్ప మిగతా పుస్తకాలు ఏవైతే తెలంగాణాలో 1957-58 లో ప్రాథమిక పాఠశాలల్లో వినియోగించబడినవో, అవే పుస్తకాలు 1958-59 సంవత్సరంలోకూడా ఉపయోగింపబడతాయి.

ఆంధ్రప్రాంతంలో 6వ తరగతినుంచి 8వ తరగతి వరకు, 1వ ఫారం నుంచి 3వ ఫారం వరకూ, అలాగే తెలంగాణాలో 5వ క్లాసు నుంచి 7వ క్లాసువరకు 1958-59 సంవత్సరానికి పుస్తకాలను నిర్ణయించేందుకు గాను ఒక అడ్ హాక్ సంఘాన్ని నియమించటానికి ప్రభుత్వం ఉత్తర్వులను జారీచేసింది

పాఠ్య పుస్తకాలను జాతీయం చేయటం, అంటే, పుస్తకాల నిర్ణయం, రచన, ముద్రణ, ప్రచురణ, సప్లయి అవన్నీ ప్రభుత్వమే చేస్తుంది. ఈ సమస్త కార్యక్రమం అంచెలవారీగా అమలు జరుపబడుతుంది ప్రాథమిక సెకండరీ పుస్తకాలను జాతీయం చేయడం రానున్న మూడు సంవత్సరాలలో పూర్తి చేయగలమని అనుకుంటున్నాం.

## విద్యేతర కార్యక్రమాలు

రెండవ ప్రణాళిక రెండవ సంవత్సరంలో విద్యేతర కార్యక్రమాలక్రింద సీనియర్ డివిజన్ ఎన్. సి సి (1 ఆర్మరీ, 1 ఇ. యం. ఇ., 1 మెడికల్, 1 టెక్నికల్ యూనిట్లు కలుపుకొని) 10 యూనిట్లు, జూనియర్ డివిజన్ ఆర్మీవింగ్ ఎన్. సి. సి. 12 ట్రూపులు, జూనియర్ డివిజన్ నేవల్‌వింగ్ 6 ట్రూపులు, జూనియర్ డివిజన్ వైమానికశాఖ 6 ట్రూపులు, జూనియర్ వింగ్ బాలికల దళపు 15 ట్రూపులు ఏర్పాటు చేయబడినాయి 537 మంది ఉపాధ్యాయులకు ఎ. సి సి. శిక్షణ ఇవ్వబడినట్లు ఇంతకుముందే మనవిచేశారు. ఈ పదాది ఏ. సి. సి. కేడెట్లు 26,850 మంది అధికంగా ఉన్నారు. ఈ విషయంలో తెలంగాణా ప్రాంతానికి ప్రాముఖ్యం చూపబడుతోంది మన కేడెట్ల శిక్షణ, సామర్థ్యప్రమాణాలకు క్రిందివిషయాలు నిదర్శనాలు.

ఢిల్లీలో జరుపబడిన రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో దేశంమొత్తంపై మన రాష్ట్రమే ఉత్తమసర్కిల్ పతాకాన్ని గెల్చుకున్నదని తెల్పడానికి సంతోషంగా ఉన్నది ఢిల్లీకి వెళ్ళిన మన రాష్ట్రదళం గార్డ్ మౌంటింగ్ రెండవ శ్రేణిలో వచ్చింది మరి డ్రిల్లు పోటీ, శిబిరనిర్వహణం పోటీ, సాంఘిక సేవ ఛాంపియన్‌షిప్పు పోటీలలో గెల్చింది. ప్రభుత్వం స్కౌటుద్యమాన్ని ప్రోత్సాహ పరుస్తోంది. భారత్ స్కౌట్లు, గైడ్లు సంఘానికి ప్రతిసంవత్సరం ఒక్క మారుగా ఇచ్చే రూ. 37,000 లకు (ఆంధ్రకు రూ. 19,000., తెలంగాణాకు రూ. 18,000). అదనంగా, శిబిర కేంద్రాల్లో కట్టడాల నిర్మాణానికి, పరికరాలు సామగ్రి వగైరాల సప్లయికు 1957-58 లో ప్రభుత్వం రూ. 1,20,000 ల మొత్తాన్ని మంజూరు చేసింది. ఆంధ్ర ప్రదేశ్ [illegible] 1958 జనవరి 8

నుంచి 14 వ తేదీవరకు జరిగింది ఇందుకై ప్రభుత్వం రు 6,000 లను గ్రాంటును ప్రత్యేకంగా మంజూరు చేసింది

సహాయంకోసం అడిగే వివిధ క్రీడా సంస్థలకు ఆర్థికంగా సహాయం చేస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఆటపోటీలకు ప్రోత్సాహమిస్తోంది. ఈ ఏడాది హైదరాబాద్‌లో ప్రభుత్వ వ్యాయామ పాఠశాల ఒకటి ప్రారంభించబడింది

కేంద్రప్రభుత్వం సూచించిన స్కీముక్రింద, రకరకాల పోటీలకు, ఆటలకు, శిక్షణ కేంద్రాలకు రాష్ట్ర ప్రతినిధులు ప్రతిఏటా వెడుతున్నారు మన రాష్ట్రంనుంచి

అఖిల భారత క్రీడాసంఘాన్ని కేంద్ర ప్రభుత్వం ఏర్పరచింది ఆలాగే రాష్ట్రస్థాయిలో కూడా యీ సంఘాలనేర్పాటు చేయవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాలను కేంద్రం కోరింది కేంద్ర ప్రభుత్వం నుండి వచ్చిన నమూనా నిబంధనావళి ప్రకారం ఆంధ్ర ప్రదేశ్ క్రీడాసంఘానికి నిబంధనావళిని తయారు చేయటానికై ఒక తాత్కాలిక సంఘాన్ని ప్రభుత్వం ఏర్పాటు చేసింది. నిబంధనావళి ముసాయిదా గురించి హైదరాబాదు కేంద్ర క్రీడాసంస్థ కొంత చర్చ చేసింది

కొన్ని స్వల్ప సవరణలతో ప్రభుత్వం ముసాయిదాను ఆమోదించింది. దీని ప్రకారం సంఘాన్ని ఏర్పాటు చేయడానికి తగిన ప్రయత్నం జరుగుతోంది.

హిందీ ప్రచారం :

ఈ రాష్ట్రంలో హిందీని బాగా వ్యాప్తిచేయడంకోసం, ఒక ప్రత్యేక అధికారి నియమింపబడ్డాడు ఆంధ్రప్రాంతంలోని విశారద విద్యాలయాలకు గ్రాంట్లు మంజూరు చేయబడుతున్నాయి. తెలంగాణా పాఠశాలలకు 211 హిందీ ఉపాధ్యాయుల ఉద్యోగాలు మంజూరైనవి. 114 మంది ఉపాధ్యాయులు ఇప్పటికి చేరారు. హిందీ పుస్తకాలు, అలమరలు తెలంగాణాలో 211 పాఠశాలలకు సప్లయి చెయబడుతున్నాయి. ఇందుకు రు. 83,000 ల ఖర్చు అవుతోంది. హిందీ ప్రచారానికి తోడ్పడుతున్న అనధికార సంస్థలకు ప్రభుత్వం సహాయం చేస్తోంది ఉచితంగా.

1956-57 నుంచి, 1 నుంచి 4 ఫారం వరకూ మూడవ భాషగా హిందీని నిర్బంధంగా చదవాలని, తర్వాత సంవత్సరాలలో 5, 6, ఫారాలలోకూడా చదవాలని ఉత్తర్వులు జారీచేయబడినాయి. ఆంధ్రప్రభుత్వంలో యూనివర్సిటీ

విద్యకు అర్హత విషయంలో హిందీలో కనీసపు మార్కులను నిర్దేశించాలనే ప్రశ్నను ప్రభుత్వం పరిశీలించింది. ఈక్రింది విధంగా ఆదేశించింది

అ 1959 మార్చి, ఆపైన జరుపబడే ఎస్. ఎస్ ఎల్. సి పబ్లిక్ పరీక్షకు హిందీని నిర్బంధంగా చదవాలి

ఆ. హిందీలో వచ్చేమార్కులబట్టి కూడా యూనివర్సిటీ విద్యార్హత నిర్ధారణ చేయబడుతుంది.

ఇ ప్రస్తుత అర్హత నిబంధనావళిలో చేర్చడానికిగాను హిందీలో కనీసపు మార్కులను నిర్ణయించవలసిందిగా ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలకు తెలియజేయటం జరిగింది.

ఇతర కార్యక్రమాలు :

బేసిక్ విద్యాగోష్ఠులు ఒకటి రాయచోటివద్ద, మరొకటి వరంగల్లులోనూ జరుపబడినాయి భీమునిపట్నం భిక్నూరుల్లో బేసిక్ విద్యా సమావేశాలు జరుపబడినాయి. ప్రధానోపాధ్యాయుల గోష్ఠులు నాలుగు, హైదరాబాదు, మహబూబ్‌నగర్, కరీంనగర్, వరంగల్లుల్లో జరుపబడినాయి మద్రాసులో జరుపబడిన ఆంగ్ల సారస్వత గోష్ఠికి యీరాష్ట్రంనుంచి 13 మంది లెక్చరర్లు వెళ్ళారు

కడప, బందరు నగరాల్లో సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయినులకు గృహవిజ్ఞానంలో, ఇంటి పనుల్లో శిక్షణ కోర్సులు జరుపబడినాయి. ఆంధ్రప్రాంతంలో సెకండరీ గ్రేడు ఉపాధ్యాయులకు, ఉపాధ్యాయినులకు 13 పౌరసత్వ శిక్షణ కోర్సులు జరుపబడినాయి పెంటపాడులోని పోస్టు గ్రాడ్యుయేట్ ట్రైనింగ్ కళాశాలలో పట్టభద్ర ఉపాధ్యాయులకు మూడు నెలలపాటు మళ్లీ ట్రైనింగ్ ఇవ్వబడుతున్నది

కళలు, సంస్కృతి :

కేంద్ర ప్రభుత్వ తీర్మానాలకు 'అనుగుణంగా, రాష్ట్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని స్థాపించింది. సాహిత్య అకాడమీ అధ్యక్షులుగా, ఆర్థికమంత్రి డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, సంగీత నాటక అకాడమీకి అధ్యక్షులుగా శాసనసభ్యులు శ్రీ ఆర్. వి. రామకృష్ణరాజుగారు' లభించటం మన అదృష్టం.

మన గవర్నర్ శ్రీ భీమసేన సచార్ అధ్యక్షతను, మన రాష్ట్రపతి పూజనీయులు రాజేంద్ర ప్రసాద్‌గారు ఆంధ్రయువతీ మండలిలో 1957

ఆగస్టు 7 వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీకి ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి 1957 డిసెంబరు 23 వ తేదీన గౌరవనీయులైన మన ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. అప్పుడు మద్రాసు రాష్ట్రానికి గవర్నరుగా ఉంటున్న మదరాసు Chief Justice శ్రీ పి. వి రాజమన్నారుగారు అధ్యక్షత వహించారు.

1957-58 లో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పాటుకు, నిర్వహణకు రు 10,300 ల మొత్తం మంజూరుచేయబడింది. అలాగే ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి రు. 10,600 లు మంజూరుచేయబడినవి.

1958-59 నుంచి మూడేళ్ళవరకు కార్యక్రమాల నిర్వహణకుగాను రాష్ట్ర అకాడమీలకు-ఈ పై రెండు రాష్ట్రఅకాడమీలకూ వార్షిక మొత్తాలను కేటాయించాలని ఉన్నది.

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ | ఒక్కొక్క సంవత్సరానికి | రు. 50,000 |
| ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ | ,, | రు. 35,000 |
| ఆంధ్రప్రదేశ్ లలితకళ అకాడమీ | ,, | రు. 15,000 |

(ఇంకా ఏర్పాటుకావాలి)

లలితకళల అకాడమీని స్థాపించాలనే సూచన ఆలోచనలో ఉన్నది.

పురావస్తుశాఖ, మ్యూజియములు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము.

పురావస్తుశాఖకు సంబంధించినంతవరకు, మన విధానం ఇది- పురాతనపు, చారిత్రక స్థూపాలను వగైరాలను, పురావస్తు ప్రదేశాలను,—జాతీయస్థాయిలో ముఖ్యమని కేంద్ర ప్రభుత్వం ప్రకటించినట్టివి కాక- భద్రపరచటం. పురావస్తుల వ్యాపారంపై అదుపు ఉండాలి. కొన్ని ప్రదేశాలలో తవ్వకాలను గురించిన అధికారం కూడా ఉండాలి. పురాతనస్థూపాలు వగైరాలను, పురావస్తుశాస్త్రానికి, చరిత్రకు, శిల్పానికి ముఖ్యంగాతోచే వస్తువులను సంపాదించాలి భద్రపరచాలి కూడా

రాజ్యాంగానికి పూర్వంలో పురావస్తుశాస్త్రం కేంద్రప్రభుత్వానికి చెంది ఉండేది. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలోవలె, ఆంధ్ర రాష్ట్రంలో పురావస్తుశాఖ ఉండేది కాదు. ఈ కొత్త రాష్ట్రంలో ఒకే సమగ్రవిధానాన్ని అవలంబించేందుకుగాను, 1956 నవంబరు 1వ తేదీనుంచి, రాష్ట్ర పురావస్తుశాఖ డైరెక్టరు, ఆంధ్రప్రదేశ్ యావత్తు రాష్ట్రానికి ఆయా విషయాలలో బాధ్యత వహించాలని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. తెలంగాణా కొన్ని జిల్లాల్లో 1337 ఫసలీ 1937 హైదరాబాదు పురాతన వస్తు రక్షణచట్టం [illegible]

ఆంధ్రలో అటువంటి చట్టం లేదు. హైదరాబాదు చట్టం పద్ధతి మీద యావత్తు రాష్ట్రానికి కొత్తగా ఒక చట్టాన్ని తయారుచేయాలనే విషయం ఆలోచనలో ఉన్నది.

నాగార్జునసాగర్ కంట్రోలు బోర్డు సహాయంతో ప్రభుత్వం ఆ ప్రాజెక్టు క్రింద మునిగిపోయే ప్రాంతంలోని ఏలేశ్వరంవద్ద పురావస్తు పరిశోధనలను జరుపుతోంది పురావస్తుశాఖ డైరెక్టరు తవ్వకాలను జరిపేందుకుగాను కంట్రోలు బోర్డు రు 30,000 లను కేటాయించింది. కేంద్ర ప్రభుత్వ పురావస్తుశాఖ డైరెక్టర్ జనరల్ సూచనలననుసరించి, రాష్ట్రశాఖ డైరెక్టర్ తవ్వకాలకు యీ క్రింది ప్రదేశాలను నిర్ణయించాడు.

1. ఏలేశ్వరం ఆలయప్రాంతం

2. చంద్రయ్య క్షేత్ర ప్రాంతం

3. కిష్టాపురం రాతిప్రాంతం

ఈ ప్రాంతాల్లో తవ్వకాలను సాగించటానికి ముఖ్య ఉద్దేశ్యం- రాతి యుగంనుంచి, మధ్యయుగంవరకు పురావస్తు శేషాల చారిత్రక సాంస్కృతిక పారంపర్యాన్ని తెలియచేసే సమాచారం యావత్తునూ సేకరించాలని అభిప్రాయం.

తవ్వకానికి డైరెక్టరు ముందుగా ఆలయ ప్రాంతాన్ని ఎంచుకున్నాడు. తవ్వకంలో చిన్నచిన్న గుడులు, పెద్దపెద్ద రాతి వరండాలు వగైరాలు అడ్డువచ్చినాయి. బౌద్ధయుగంవరకు డైరెక్టరు పనికి పూనుకున్నాడు. నాగార్జునకొండ వద్దనున్న పురాతన వస్తువుల నాటివే చాలా ఇటుక కట్టడాలు బైటపడినాయి. ఎంతో లోతునుంచి బైటపడిన మట్టిపాత్రలు తెలంగాణాలోని ఇతర బౌద్ధ ప్రాంతాల్లో దొరికిన వాటికి సన్నిహితంగా ఉన్నాయి. ఇక నాణాలు. పూసలు, లోహపు వస్తువులు వగైరా 600 కు పైగా తవ్వకాలలో బైటపడినాయి. ఇంకా పని జరుగుతున్నది

పురావస్తుశాఖకు 1958 - 59 బడ్జెట్ అంచనాలో రు. 97,000 ల మొత్తం కేటాయించబడింది. పరిశోధన, రక్షణ, తవ్వకం, భూమి సంపాదనలకు గ్రాంటు రు. 20,500 కేటాయించబడినది భద్రపరచవలసిన పురావస్తువులు 200 కు పైగా ఉన్నవి. దీనినిబట్టి చూస్తే ఇది చాలా తక్కువ మొత్తం. కింది స్కీములకు గ్రాంటు 1958 — 59 లో రెండవ ప్రణాళికకింద రు. 30,000 ల మొత్తం కేటాయించబడింది ఇది కొంత పరిశోధనకు ముఖ్యంగా కొంతకాలం

నుంచి ప్రచురణ కాకుండావున్న కొన్ని ముఖ్య వ్యాసాల ప్రచురణకు వినియోగించబడుతుంది. కేంద్ర ప్రభుత్వంకూడా కొంత ఖర్చును భరిస్తుంది.

మ్యూజియములు

రాష్ట్రాల పునర్నిర్మాణానికి పూర్వం హైదరాబాదు మ్యూజియం హైదరాబాదు ప్రభుత్వ ప్రధాన మ్యూజియంగా పరిగణింపబడేది. పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలో సెంట్రల్ మ్యూజియం అనేది లేదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత పబ్లిక్‌గార్డెన్సులోని హైదరాబాదు మ్యూజియమే యావత్తు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వస్తువుల పరిశీలనకు, రక్షణకు ప్రధాన ప్రభుత్వ మ్యూజియంగా పరిగణింపబడాలని ప్రభుత్వం ప్రకటించింది. కేంద్ర ప్రభుత్వం నియమించిన మ్యూజియం నిపుణులు సంఘంకూడా రాష్ట్ర మ్యూజియం బహుళార్థసాధక మ్యూజియంగా ఉండాలని సిఫారసు చేసింది. దేశ సంస్కృతికి ఎలా అభివృద్ధిచెందినది, అందులో రాష్ట్రానికి ఉన్న ప్రత్యేకత ఎట్టిది అనే విషయాలను తెలుసుకొనటానికి కావలసిన ఫోటోలు ఉండాలి. ఇంకా ఉపయుక్తకుపయోగపడే ఇతర విషయాలను వస్తువులనుకూడా సేకరించాలి. మ్యూజియముల శాఖకుగాను 1958-59 బడ్జెట్ అంచనాలో రు. 70,000 ల మొత్తం కేటాయించబడింది. జీర్ణావశేషాలను, శిల్పఖండాలను, కొనడానికి, ప్రదర్శన వస్తువులను భద్రపరచడానికి రు 11,300 ల మొత్తం కేటాయించడం జరిగింది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం :

హైదరాబాదులోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం సరిగా పనిచేయడం లేదన్న ఫిర్యాదులు ఎక్కువగా వినవస్తున్నాయి ఈ మధ్య. ఈ గ్రంథాలయం ఎలా పనిచేస్తోందీ విచారించవలసిందిగా పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టరును ఆదేశించటమైనది. గ్రంథాలయాల ప్రత్యేక అధికారి ఈ అధికారికి విచారణలో తోడ్పడుతాడు. విచారణ నివేదిక అందగానే తగిన పనిని చేయడానికి వీలవుతుంది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాధికారి ఇంతవరకు ప్రభుత్వపు అజ్మాయిషీ క్రింద ఉండేవారు. మద్రాసులోని కన్నెమరా పబ్లిక్ లైబ్రరీ గ్రంథాలయాధికారినివలెనే, ఇతనినీ పబ్లిక్ గ్రంథాలయాల డైరెక్టరు అజ్మాయిషీలో ఉంచుతూ ఇటీవలనే ఉత్తర్వులు జారీ చేయబడినాయి.

ఈ వివరాలను గౌరవనీయ సభ్యులు పరిశీలన చేసి వారి విలువైన అమూల్య సలహాలను అందజేయవలెనని, వారు చేసే సూచనలకు ఈ డిమాండు పాస్ అయ్యేలోపల మళ్ళీ జవాబు చెబుతానని మనవిచేస్తూ ఈ డిమాండును ప్రతిపాదిస్తున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) - అధ్యక్షా, ఇప్పుడు మంత్రి గారు చదివిన స్టేటు మెంటు కాపీ గౌ. సభ్యులందరికీ అందజేస్తే ఆ విషయాలన్నీ వివరంగా తెలుసుకొని సలహాలివ్వడానికి వీలుంటుందని మనవిచేస్తున్నాను.

శ్రీ యస్. బి పి. పట్టాభిరామారావు గౌ. సభ్యులందరికీ కాపీలు అందజేయాలంటే మూడు, నాలుగు వందల కాపీలు తీయించవలసి ఉంటుంది. దానికి టైము కావాలి ఇది (యిప్పుడు చదివిన స్టేట్ మెంట్) నిన్న సాయంత్రమునకు పూర్తి చేయగలిగినాను గౌరవ సభ్యులందరికీ యివ్వడానికి, దానికి కాపీలు తయారుచేయించవలెనంటే, కొంత ఖర్చుకూడా అవుతుంది. ఈ విషయాలన్నీ పత్రికలలో వస్తాయి. రేపు ఉదయమునకు సభ్యులచేతులలో ఉంటాయి అని నా అభిప్రాయము.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు - అధ్యక్షా, పత్రికలలో పూర్తిగా వేయాలంటే ఆ నాలుగు పేజీలు వారికే సరిపోతుంది.

మిస్టర్ స్పీకర్ :- పత్రికలలో అంతా రాదు.

శ్రీ యస్. కే వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం-జనరల్).- అధ్యక్షా, మంత్రులు యిచ్చిన స్టేటుమెంట్ కాపీలు గౌరవ సభ్యులకు అందజేసే సాంప్రదాయం కర్నూలులో పాటించారు అలాచేస్తే అందరికి లాభదాయకంగా ఉంటుంది. ఆయా మంత్రులకు సంబంధించిన శాఖల యొక్క విషయాలన్నీ తెలుస్తాయి. విద్యాశాఖమంత్రిగారికి సంబంధించినదయితే the history of education ప్రస్తుత విద్యావిధానం ఏవిధంగా నడుస్తున్నదో-దాని progress-ఆ విషయాలన్నీ ఉంటాయి. కాబట్టి మంత్రిగారి యొక్క speach కి కాపీలు; కొంత ఖర్చు అయినప్పటికీ గౌరవ సభ్యులందరికీ అందజేయవలెనని మనవిచేస్తున్నారు. వారు Education Minister అని గుర్తుంచుకొని, business కు సంబంధించిన వ్యక్తిగా ఆలోచించకూడదని, ఖర్చుగురించి పదే పదే చెప్పవద్దని విజ్ఞప్తి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ :- ఇకముందు, మంత్రులు తాము యొక్క prelimi-nary గా చదివే statement కాపీలను గౌరవ సభ్యులందరికీ అందజేయాలని చెబుతున్నాను. ఇప్పుడు మంత్రిగారు వారి speech కాపీలు రేపటికి సభ్యులకు అందేట్లు చేయమని చెబుతున్నాను. ఖర్చుమాట ముఖ్యం కాదు.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు :- రేపటికి చేయించి పంపిస్తాను- ఇది ఒక రూలుగా చేస్తే కష్టమవుతుంది. సాధ్యమైనంతవరకు కాపీలు అందేచ

జేయాలని చెబితే బాగుంటుంది. ఎందుకంటే—దానికి టైము కూడా కావాలి. నేను యిది రాత్రి 12 గంటలకు పూర్తిచేయగలిగాను. దానికి కాపీలు తీయించడానికి, డబ్బు ఖర్చుమాట ఎట్లా ఉన్నప్పటికీ, టైము కావాలి. వచ్చిన cut-motions అన్నీ పరిశీలించి, తర్జుమా చేయించి, information అంతా సేకరించి speech తయారుచేసి కాపీలు తీయించడానికి రెండుమూడు రోజులు పడుతుంది. కాబట్టి అది ఒక రూలుగా చేస్తే కష్టమని మనవిచేస్తున్నాను. అది మా విచక్షణకు వదిలిపెట్టితే, సాధ్యమైనంతవరకు మేము ప్రయత్నము చేస్తాము.

శ్రీ యమ్ నాగిరెడ్డి (మాచెర్ల) మంత్రిగారు వారి speech తయారు చేయడానికి రాత్రి నడిజాము అవుతోందని అన్నారు. ఈ డిమాండ్సు ఏ ఏ తేదీలలో అసెంబ్లీలో తీసుకొనబడతాయో Advisory Committee లో ముందుగానే programme వేస్తుకొంటున్నారు. కాబట్టి నడిజామువరకు కూర్చొని ఆలస్యంచేయకుండా, తెల్లవారిజాముకు తయారుచేసి యివ్వమని కోరుతున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: ఆవిషయం మంత్రిగారి విచక్షణకు వదిలిపెట్టమని చెబుతున్నారు. వారి విచక్షణకు రెండే అర్థాలు- త్వరగా చేస్తామంటే-చేయము-అని; ఆలోచిస్తున్నాము అంటే- చేయము-అని. అందువల్ల అది అధ్యక్షులవారి విచక్షణలోనే ఉంచుకొనమని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :- నా విచక్షణలోనే ఉంచుకొంటాను. I must exercise my discretion properly

(హర్షము)

*Sri Vavilala Gopalakrishnayya*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Govt. to grant two lakhs of rupees to the Andhra University as a special grant for preparing a authoritative Telugu social and cultural history within two years.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

ప్రీయూనివర్సిటీ కోర్సును యెత్తివేయవలెనని కోరుటకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

[illegible]

To impress upon the Govt to introduce Telugu as the medium of language in elementary, secondary and University education.

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs 100/-

To impress upon the Govt to introduce Pre-Primary class and the four classes in the elementary section, four year course in secondary education and finally three year Degree course with vocational either of agricultural or industrial courses.

*Sri Gopidi Ganga Reddy (Mudhole):* Sir, I beg to move:

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100

జిల్లాలనుండి వచ్చే పిల్లలకు జిల్లాలలోనే కాలేజీలు ఏర్పాటుచేయనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

ఉద్యోగులను జిల్లాలలోనే ఉంచి, పట్టణమునకు తబాదిలా చేయనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

విద్యార్థులకు స్కాలర్‌షిప్పు దొరకనందులకు, మరియు పాలపౌడర్ సక్రమముంగా పంచనందులకు.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

నిర్బంధప్రాథమిక విద్య ఆంధ్రప్రాంతములలో అమలులో పెట్టలేనందులకు.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

పల్లెటూర్లలోఉండే అధ్యాపకులకు ఇంటి సౌకర్యము కలుగజేయనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

వయోజన పాఠశాలలు నడుపనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

డిప్యూటీ ఇన్‌స్పెక్టరులకు వాహన సౌకర్యములు కలుగజేయనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

వైస్‌ఛాన్సలరును అప్పాయింట్ చేసినపుడు ప్రభుత్వము ఈ బడ్జెటు సెషనులో బిల్లు ప్రవేశపెట్టనందుకు, చర్చజేయుటకు

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs 100/-

వరంగల్లులో ఇంజనీరింగు కాలేజి పెట్టనందులకు

*Sri Pillalamarri Venkateswarlu*: Sir, I beg to move

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Govt to take steps to establish an Engineering College in Warangal.

*Sri M Satyanarayana Raju (Cheepurupalli-General)*: Sir, I beg to move

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

For the failure of Government to up-grade elementary education.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

For the failure of Government to repair elementary school buildings.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

For the failure of Government to increase the salaries of low paid teachers.

*Sri Gopidi Ganga Reddy*. Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

పరీక్ష పద్ధతులను సరిగా నడుపలేక అక్రమచర్యలు ఆచరించుచు పరీక్ష ఫలితములను చెడగొట్టుచున్నందులకు

*Sri Baswa Manaith (Andole)* Sir, I beg to move:

To reduce to allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

జోగిపేట హైస్కూల్‌కు సైన్సు సామాను సప్లయిచేయనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

ప్రభుత్వము తెలంగాణాలో విద్యావిధానమును విమర్శించుటకు, జోగిపేటలో ప్రైమరీ సైపు బిల్డింగులో మిడిల్ క్లాసు హైస్కూలు నడుపుచున్నందులకు

*Sri Gopidi Ganga Reddy* Sir, I beg to move.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

ముధోల్ తాలూకాలో ఉంచబడిన మరాఠీ అధ్యాపకులను యింతమటుకు మరాట్వాడాకు పంపక విద్యార్థుల విద్యను నష్టపెట్టినందులకు

*Sri Pillalamarri Venkateswarlu*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to take steps to see Telugu is being adopted as medium of instruction including in University stage.

To reduce to allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the attitude of the Government towards teachers in curtailing their liberty to form associations.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to develop the three Universities and also to co-ordinate their activities.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to utilise fully the allotments made for Telangana area for education.

*Sri S. Vemayya (Buchireddipalem-Reserved).* Sir I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

సాంఘిక సంక్షేమ పాఠశాలలలో పనిచేయు సెకండరీ గ్రేడు టీచర్లను గవర్నమెంటు లెటర్సు. నెం. 30925 - క్యూ - 56 - 9 తే. 23-3-56 మేరకు యిప్పటివరకు డిప్యూటీ ఇనస్పెక్టర్లుగా ప్రమోషన్ యివ్వనందుకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

జీవన ప్రమాణసూచక దృష్ట్యాన్నూ, జీవిత అవసర వస్తువుల ధరల పెరుగుదల దృష్ట్యాన్నూ, ప్రాథమిక సెకండరీ కళాశాల ఉపాధ్యాయ, అధ్యాపకుల జీత భత్యములను పెంచనందుకున్నూ, వారికి కరువుభత్యము కేంద్రఉద్యోగులతో సమానముగా జీతములలో కలుపనందుకు—

*Shri M Nagi Reddy:* Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

ప్రభుత్వానికి ఒక నిర్దుష్ట విద్యావిధానములేనందులకు, కళాశాలలో తెలుగులో విద్యాబోధన చేయడానికి ఎలాంటి కృషి చేయనందులకు, ప్రాథమిక విద్యనైనా బాలబాలికలందరికీ ఉచితముగా నేర్పడానికి విఫలమైనందులకు, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకు తగురీతిగా జీతాలు పెంచనందులకు, వారిలో వేలకొలది మందిని పనిలోనుండి తొలగించి నిరుద్యోగులుగా చేస్తున్నందులకు, కుప్పుస్వామి కమిటీ రిపోర్టులోని సూచనలను పూర్తిగా అమలుపరచనందులకు, ప్రాథమిక పాఠశాలలో ఒక్కొక్క ఉపాధ్యాయునికి విద్యార్థుల సగటు హాజరును తగ్గించనందులకు—

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs 100/-

కోవూరు తాలూకా రామవరం గ్రామంలో షుమారు 120 మంది విద్యార్థులతోనూ, 5 గురు వుపాధ్యాయులతోనూ, నిర్వహించబడుచున్న ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల రికగ్నిషన్ రద్దుపరచి విద్యార్థులకు అసౌకర్యం కలుగజేసినందులకు

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

దామవరం గ్రామస్తులు పాఠశాల భవనాలను రిపేరుచేయించి 5 గురు వుపాధ్యాయులతో పిల్లలకు చదువు చెప్పించుకొనే సదుపాయం కలుగజేయమని కోరినప్పటికి ఇంతవరకు ప్రభుత్వం జాప్యం చేస్తున్నందులకు

*Sri Ranganatha Rao (Jukkal)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs 100/-

To impress upon the Government to sanction grants for private colleges specially to those which are run in backward area.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Government to sanction atleast Rs one lakh as grant-in-aid to Adilabad Science College.

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Government to sanction the housing scheme specially for low paid teachers.

*Sri K. Rajamallu (Sirpur-General)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the policy of Government rural education and draw backs in the department

*Sri Krishnamachari (Sangareddy-General)* Sir, I beg to move:

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

విద్యా విధానములో అత్యవసరమయిన మార్పులు చేయనందుకు

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

ఉపాధ్యాయుల వేతనములు పెంచనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

కొన్ని సంవత్సరములనుండి ఉపాధ్యాయులుగా పని చేయుచు పాఠశాలలను అభివృద్ధిచేసిన వాలంటయరీపాఠశాలల ఉపాధ్యాయులను తొలగించినందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

వయోజనుల విద్యా విషయమై తగు శ్రద్ధ వహించనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

నిర్బంధ ప్రాథమిక విద్యా విధానము అమలు జరుపుటలో విఫలమయినందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

పాఠశాలలో విద్యార్థులసంఖ్యననుసరించి ఉపాధ్యాయుల సంఖ్యను అధికము చేయలేకపోయినందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

పాఠశాలలయందు విద్యార్థుల సంఖ్య అధికమగుచున్నందున వారికి సరిపోవు స్కూలు భవనములు కట్టించుటలో ప్రభుత్వము శ్రద్ధ వహించనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

అధికారేతరులతో కూడిన టీచర్సు సెలెక్ట్ కమిటీలను తెలంగాణములోని జిల్లాలయందు రద్దు పరచనందులకు

*Sri G. Ramulu*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

ఉపాధ్యాయుల జీతాలను టి. టి. ఒ. కార్యాలయమునుండి వారు ఆలస్యంగా పంపించుచున్నందులకు.

*Sri B. Dharma Bhiksham (Nakrekal)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

మల్టిపర్పస్ హైస్కూళ్ళ విద్యార్థుల ఫీజు పెంచుట గురించి చర్చించుటకు గాను, మల్టిపర్పస్ స్కూళ్ళలోకోర్సు ననుసరించి పరికరాలు సప్లయిచేయుటలో ట్రైన్డు టీచర్సును నియమించుటలో విఫలత జెందుట గురించి చర్చించుటకై.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

బేసిక్ స్కూళ్ళు నామకః తెరువబడి వాటికి అవసరమైన శిక్షిత టీచర్లు నియమించకపోవటం, విజయవంతంగా నడుపకపోవటం గురించి చర్చించుటకై

తెలంగాణాప్రాంతంలో ప్రైమరి మరియు మిడిల్ స్కూళ్ళకై ప్రభుత్వ భవనాలు నిర్మించుటలో విఫలత జెందుట గురించి చర్చించుటకుగాను.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

తెలంగాణాలోని మిడిల్ కమ్ హైస్కూళ్ళన్నిటినీ హైస్కూళ్ళుగ పరిగణించి పూర్తి శాంక్షన్ యివ్వకపోవటం గురించి చర్చించుటకుగాను.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

నల్లగొండ హైస్కూలులోని ఉర్దు సెక్షన్సుకు టీచర్సుకొరతను చర్చించుటకుగాను.

*Sri B. Srirammurthy (Vizianagaram)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to take over aided elementary schools in general and those in Vizagapatnam District as stated earlier by the Government

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to verify the scales of pay of teachers working in aided, Board, Government schools.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

To criticise the failure of the Government to implement the recommendations of the Kuppuswamy Committee.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to reduce the average attendance from 25 to 20 in the Primary Schools in the State.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs 100/-

To criticise the undemocratic and unconstitutional attitude of the Government towards the teachers who are restrained to join the associations only after obtaining the permission of the Special Officer.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to increase the scales of pay of the teaching staff in Colleges in consonnance with the recommendations made by the University Grants Commission.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to extend cheap education facilities.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to start Night Colleges in Andhra and Venkateswara Universities.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to provide adequate material to the Schools for imparting instructions in crafts and manual training.

*Sri K. Jaganmohan Reddy (Pargi)*: Sir, I beg to move.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

తెలంగాణా ప్రాంతములో ట్రైనింగుకెళ్ళిన ఉపాధ్యాయుల స్థానములో బడులలో ఖాళీలు వుంచి, పిల్లలయొక్క విద్య సరియైన విధంగ నడిపించనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

వాలంటరీ బడులలోనుండు ఉపాధ్యాయులను వందలకొలది తొలగించి నిరుద్యోగ సమస్య కలిగించినందులకు

*Sri P. Narsinga Rao (Huzurabad-General)* Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

For the failure of the Government to bring a Bill to amend the Osmania University Charter and not meeting the genuine demands of the University employees.

*Sri K. L Narsimha Rao (Yellandu-General)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

ఉపాధ్యాయులకు నెలసరి వేతనాలు అందించడంలో మాసాంతరబడి జరుగుచున్న ఆలస్యమును గురించి, సకాలములో వేతనాలు చెల్లించు పద్ధతిని ప్రవేశపెట్టకపోవడం గురించి.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

ప్రాథమికోపాధ్యాయ సంఘాలు నిర్మించుకొనుట పైనను తమ వృత్తి సంఘాలలో చేరుటపైనను అనేక నిషేధాలను ప్రయోగించటం విషయంలో నిషేధాలను తొలగించకపోవడం విషయంలోను

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

ప్రాథమికస్కూళ్ళలో వివిధ రూపాలలో విద్యార్థులనుండి వసూలుచేయబడుచున్న నాన్-గవర్నమెంటల్ ఫీజులు లెక్కలు పరిశీలించు అధికారమును పేరెంట్సు కమిటీలకు అప్పగించకపోవడం గురించి, పేరెంట్సు కమిటీల సమావేశములు సక్రమంగా జరిపించకపోవడం గురించి.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs 100/-

స్కూళ్ళకు అవసరమైనంత మంది ఉపాధ్యాయులను సకాలంలో పంపకపోవడం గురించి, ఉపాధ్యాయులు లేక ఉపాధ్యాయినులు ఆలస్యంగా పంపబడి కోర్సు పూర్తికాక పరీక్షలో విద్యార్థులు అధిక సంఖ్యలో ఫేల్‌కావడం జరుగుచున్నప్పటికిని శ్రద్ధ చూపక విద్యార్థుల కాలమును, తలిదండ్రుల ధనమును వృధాపరుస్తున్న విధానమును గురించి

*Sri B. Dharma Bhiksham :* Sir, I beg to move :

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వ పాఠశాలలకు స్వంత భవనాలు 70 శాతము లేకపోవడంవల్ల స్కూళ్లు నడుపుటకై యిబ్బంది కలుగుతున్న విషయాన్ని చర్చించుటకు గాను.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

ఉపాధ్యాయుల వేతనాలు మొదలగు కోర్కెలను ప్రభుత్వం అంగీకరించక పోవటం గురించి చర్చించుటకు గాను.

*Demand No. XVI—Mines and Archaeology. Rs 3,40,000/-*

*Sri Vavilalala Gopalakrishnayya* Sir, I beg to move ·

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology by Rs 100/-

ఏలేశ్వరం వద్ద త్రవ్వకాలు ఎంత చురుకుగా జరుగుచున్నవో తెలుసుకోవడానికి, వాటిని త్వరలో పూర్తి చేయించవలసినదిగా కోరడానికి.

To reduce the allotment of Rs. 3,40,000/- Mines and Archaeology by Rs 100/-

తెలంగాణాలో వలెనే ఆంధ్రప్రాంతంలో కూడ పురాతన శాఖను ఏర్పాటు చేయవలెనని కోరుటకు.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఏర్పాటు చేయబడిన పురాతన శాఖకు కనీసం లక్షరూపాయలైనా విరాళం ప్రత్యేకంగా యివ్వవలెనని కోరుటకు.

*Sri G Suryanarayana* · Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology etc. by Rs. 100/-

శిల్పకారకులకు వారి వృత్తికి ఆర్థిక సహాయం ప్రభుత్వం చేయడంలో అశ్రద్ధ చూపినందులకు

*Sri M. Satyanarayana Raju* : Sir, I beg to move:

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

For not providing Manganese Welfare Committee in our State.

For not providing adequate funds for the expansion of the Archaeological Department.

*Sri M Nagi Reddi* - Sir, I beg to move

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

ఇనుపరాయి, మైకా మొదలగు ముడిపదార్థములపైన, సిమెంటురాయి పైన వసూలు చేస్తున్న సీనియరేజిఫీజు వలె టన్నుకు యింత అని సీనియరేజిఫీజు వసూలు చేసి ప్రభుత్వ ఆదాయాన్ని పెంచుటకు పూనుకోనందులకు.

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology by Rs 100/-

ఆంధ్రప్రదేశ్‌లో విరివిగా లభ్యమగుచున్న ఇనుపరాయి ప్రదేశాలలో ఐరన్ ఫౌండ్రీని స్థాపించుటకు ప్రభుత్వం పూనుకోనందులకు.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

నాగార్జునకొండ, అమరావతి, సాలిహుండం, జగ్గయ్యపేట తదితర ప్రదేశాలలో లభించిన స్తూపములనన్నిటిని కలిపి విజయపురివద్ద ఒక కేంద్ర మ్యూజియమును స్థాపించుటకు ప్రభుత్వం పూనుకోనందుకు.

*Sri K. Rajamallu* : Sir I, beg to move .

To reduce the allotment of Rs 3,40,000 for Mines and Archaeology etc- by Re. 1/-

To discuss about the delay in Mines Department to grant land for the purpose of opening new mines.

*Sri Krishnamachari* : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology etc by Rs 100/-

కొండాపురము తాలూకా సంగారెడ్డిలోగల పురాతన వస్తుఖండాలను త్రవ్వుటకై [illegible]నందులకు.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology etc. by Rs. 100/-

ఈ పురాతన వస్తుఖండాలుగల ముఖ్య ప్రదేశములకు వెళ్ళుటకు రోడ్డు సౌకర్యములు కలిగించలేనందులకు.

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology etc, by Rs 100/-

దేశములో ఖనిజ సంపత్తిని కనిపెట్టి వాటిని తీయుటకై యత్నించనందులకు

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology etc. by Rs. 100/-

ప్రభుత్వ విధానమును విమర్శించుటకు

*Mr. Speaker*: All these cut motions are now before the House

* శ్రీ బద్దం ఎల్లారెడ్డి (బుగ్గారం): అధ్యక్షా, ఇప్పుడు మంత్రిగారు ఒక దీర్ఘమైన స్టేట్‌మెంట్ చదివారు. దాంట్లో అనేక విషయాలు తీసుకువచ్చారు. వాటిలో చాలా ముఖ్యమైన విషయాలు కొన్ని ఉన్నవి. ఆ స్టేట్‌మెంట్ పాలసీ స్టేట్‌మెంటా, లేక ఆ డిపార్టుమెంట్ యొక్క వర్క్ రిపోర్టా అన్నది నాకు అర్థం కావటంలేదు.

మిస్టర్ స్పీకర్ అది మినిస్టర్ స్టేట్‌మెంట్

శ్రీ బద్దం ఎల్లారెడ్డి : డిపార్టుమెంట్ యాక్టివిటీస్ అన్నీ ఒక కేటలాగ్‌గా చేశారు. అది ఒక రిపోర్టు రూపంలో అందజేస్తే బాగుండేది. కాని పాలసీ స్టేటుమెంట్‌గా, ఒక కేటలాగ్‌గా అందజేయటంవల్ల, దానిమీద మా అభిప్రాయాలు చెప్పటం చాలా కష్టం

*Sri S. B P. Pattabhi Rama Rao*: It is a privilege of the Minister.

మిస్టర్ స్పీకర్ : వారు డిపార్టుమెంట్‌వారి సహాయం పొందుతారు. మీకందరికోసం ఆ ఇన్‌ఫర్‌మేషన్ అంతా ఇచ్చారు.

శ్రీ బద్దం ఎల్లారెడ్డి: నేను నా అభిప్రాయం చెప్పాను. ఆ రిపోర్టు ఇప్పుడే అందజేయటంవల్ల మేము దానిమీద అభిప్రాయం చెప్పటం కష్టమని మనవి చేస్తున్నాను.

నేను రెండు మూడు విషయాలు మనవిచేయదలచుకొన్నాను. మన దేశంలో నిరక్షరాస్యులు చాలా ఎక్కువమంది అధికసంఖ్యలో ఉన్నారు. అది చాలా సిగ్గుచేటైన విషయము. అది మన జాతికే సిగ్గుచేటైన విషయమువే దానిని మంత్రిగారు కూడ అంగీకరించారు. [illegible] సందేహం లేదు.

నిరక్షరాస్యత నిర్మూలించుటకు మన ప్రభుత్వం అమలుజరుపుతున్న పథకాలు ఏవి అన్నది చూస్తే, ఏవీ కనుపించటంలేదు నిరక్షరాస్యత నిర్మూలించే పద్ధతిలో ఎడ్యుకేషన్ డిపార్ట్‌మెంట్ యాక్టివిటీస్ జరగటంలేదు. మన దేశం యొక్క అవసరాలు చాలా ఉన్నాయని మంత్రిగారు చెప్పారు. మనం పంచవర్ష ప్రణాళిక రూపొందించుకొన్నాము. దానిని పూర్తిచేసుకోవాలంటే మనకు చాలా అవసరాలు ఉన్నవి. టెక్నికల్ ఎడ్యుకేషన్‌మీద హెచ్చు దృష్టి కేంద్రీకరించవలసిఉన్నది. ఆ విషయంలో మనం చాలా ప్రోగ్రెస్ సాధించవలసి ఉంటుంది. ఇప్పటి అవసరాలను పూర్తిచేసుకోవటానికి తగినట్లుగా మనం ఒక అడుగు ముందుకు వేస్తున్నామా అంటే ఒక్క అడుగుకూడ ముందుకు వేయటం లేదనేది గోచరిస్తుంది మనం జిల్లాలలోను, పట్టణాలలోను ఉన్నటువంటి పరిస్థితులు చూస్తే, నిరక్షరాస్యత నిర్మూలించుటకు ఇప్పుడు జరుగుతున్న ప్రయత్నాలు ఏమాత్రం సరిపోవని స్పష్టంగా తెలుస్తుంది. రాజ్యాంగ చట్టం (కాన్‌స్టిట్యూషన్) మనకు ఒక డైరెక్టివ్ ఇచ్చింది "రాజ్యాంగ చట్టం అమలులోకి వచ్చిన తేదీనుండి పది సంవత్సరాలలోపల దేశం అంతటా ఫ్రీ ఎడ్యుకేషన్, కంపల్సరీ ఎడ్యుకేషన్ అమలు జరగాలి" అనే ఆదేశం మన కాన్‌స్టిట్యూషన్‌లో ఇవ్వటం జరిగింది. కాన్‌స్టిట్యూషన్ ఇచ్చిన ఆదేశాన్ని మనం పరిపూర్తి చేయాలంటే, దానికి ఎంతకాలం పడుతుంది? ఇప్పుడు ప్రభుత్వం నడుస్తున్న పద్ధతి చూస్తే, అది త్వరలో సాధించటానికి అవకాశం లేనట్లు స్పష్టంగా కనుపిస్తున్నది. ఇప్పటికి ఆరు సంవత్సరాలు అయిపోయాయి. ఇంకో 4 సంవత్సరాలు అయితే, 10 సంవత్సరాలు అయిపోతుంది. ఈ పది సంవత్సరాల కాలంలో దానిని పూర్తిచేయటానికి తగినటువంటి ప్రయత్నం ఏమీ జరగటంలేదని నేను ఖచ్చితంగా చెప్పగలను. ఈ పది సంవత్సరాల కాలంలో నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించుటకు ఇంకా సాహసోపేతమైన పద్ధతులలో, మనం ముందుకు సాగవలసి ఉంటుంది. అటువంటి పథకాలను మనం రూపొందించవలసి ఉంటుందని నేను మనవిచేయదలచుకొన్నాను. వారు చెప్పినదాంట్లో ఈ సంవత్సరం ఏమేమి చేయబోతున్నారు అన్నది చూస్తే, ప్రాథమిక విద్యలో, మాధ్యమిక విద్యలో, కాలేజి విద్యలో ఎక్కువ ప్రోగ్రెస్ సాధించటానికి కొన్ని పథకాలు, ప్రతిపాదనలు అమలుజరుగుతున్నట్లు నాకు ఏమాత్రం గోచరంకాలేదు. మనం నిరక్షరాస్యతను నిర్మూలించాలంటే, కాన్‌స్టిట్యూషన్ ఆదేశించిన లక్ష్యాన్ని చేరుకోవాలంటే, మనం ప్రాథమిక, మాధ్యమిక విద్యపైన ఎక్కువశ్రద్ధ తీసుకోవలసి ఉన్నది. అందుకు తగిన చర్యలు ఇప్పటినుండే తీసుకోవలసిఉన్నది. ఈ బడ్జెట్ ప్రతిపాదనలు చూస్తే, ప్రభుత్వం నిరక్షరాస్యతను నిర్మూలించటానికి ప్రయత్నిస్తున్నదని అనుమానం

పెట్టటానికైనా అవకాశం కలగటంలేదు ఎన్ని ప్రాథమిక పాఠశాలలు ఎక్కువగా పెట్టటానికి పూనుకొన్నారో, మంత్రిగారు చెప్పినదాంట్లో స్పష్టంగా లేదు మంత్రిగారు ఒక విషయం చెప్పారు కొన్ని పాఠశాలలను ఒక ఉపాధ్యాయుడు ఉండే పాఠశాలలుగా మార్చామని చెప్పారు వాలంటరీ స్కూల్సుగా ఉన్నవాటిని ఒక ఉపాధ్యాయుడు ఉన్న పాఠశాలలుగా మార్చామని చెప్పారు నాకు తెలిసిన ఇన్‌ఫర్మేషన్ ప్రకారం, ఇలాంటి మార్పువల్ల ఏమి జరిగిందంటే, దాదాపు 400 స్కూల్సు అసలు మూసివేయటం జరిగింది 400 స్కూల్సు మూసి, 50 స్కూల్సు మాత్రమే, ఒక ఉపాధ్యాయుడు ఉండే స్కూల్సుగా కన్వర్ట్ చేయటం జరిగింది వాలంటరీ స్కూల్సును ఒక ఉపాధ్యాయుడు ఉండే స్కూల్సుగా మార్చటంతో ఇన్ని స్కూల్సు మూసివేయటం జరిగింది అందువల్ల రెండు ఫలితాలు ఏర్పడ్డాయి. 1) ఆ వాలంటరీ స్కూల్సులో పనిచేస్తున్న ఉపాధ్యాయులు నిరుద్యోగులైపోయారు. 2) అక్కడి పిల్లలకు విద్యలేకుండా పోయే పరిస్థితి ఏర్పడింది ఇదే మనం ప్రోగ్రెస్ సాధించటానకి వేసిన పథకమా, అని అడుగుతున్నాను. అక్కడ పరిస్థితులు చాలా అధ్వాన్నంగా తయారైనవి. దీనివిషయం మంత్రిగారు తీవ్రంగా ఆలోచించాలని కోరుతున్నాను. ఇది తప్పక ఆలోచించవలసిన విషయము. ఇంతమంది నిరుద్యోగులయ్యే చర్యకు మనం పూనుకోవటం సమంజసం కాదు. ఇదేవిధంగా చాలామంది విద్యార్థులకు, విద్య ఏర్పాట్లు లేకుండా చేయటంకూడ సమంజసం కాదు. కాబట్టి యీ రెండు విషయాలు మంత్రిగారు దృష్టిలో పెట్టుకొని, వీటి విషయం తిరిగి పునరాలోచించి, దానికి తగిన ఏర్పాట్లు చేయటానికి ఆలోచిస్తారని ఆశిస్తున్నాను

తెలంగాణాలో Secondary Education విషయములో మంత్రిగారు ఎక్కువగ శ్రద్ధవహించవలసియున్నది. Elementary Education విషయములో ఆంధ్రప్రాంతము కంటె తెలంగాణా చాలా వెనుకబడియున్నది. ఇది నిర్వివాదాంశము అని అందరు ఒప్పుకోకతప్పదు. తెలంగాణాలో Secondary Schools అన్నీ పట్టణములలోనే ఉన్నవి. జిల్లాలలోపల, ఏ ప్రాంతములోను ఈ స్కూల్సు లేనేలేవు. High Schools కూడ పట్టణములలోనే ఉన్నవి. గ్రామసీమలలో కనీసము ముఖ్యమైనచోట్లలో కూడ లేవు. ఆంధ్రప్రాంతములో ఎక్కడచూచినను హైస్కూల్సు ఉన్నవి. ఆవిధముగ తెలంగాణాలో లేకపోవడము శోచనీయముగనున్నది. అందువల్లనే తెలంగాణా విద్యావిషయములో చాలా వెనుకబడిఉన్నదని చెబుతున్నాను. ఆంధ్రలోవలె తెలంగాణాలోకూడ వీలు అయినన్నిచోట్లలో High Schools స్థాపించటానికి ప్రభుత్వము ఆలోచించి

వదా ? ఏలాంటి చర్యతీసుకోబోతున్నారు అనేది చెప్పవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను Schools తెలంగాణాలోని వివిధప్రాంతాలలో పెట్టటానికి ప్రభుత్వానికి ఆలోచన లేకపోతే, ఎందువల్ల లేదో చెప్పమని అంటున్నాను. గ్రామసీమ అలోకూడ, విద్య అందరికి అందుబాటులో ఉండాలని అంటే, వీలు అయినన్ని స్కూల్సు పెట్టించవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. ముఖ్యంగా High Schools అయిదారు మైళ్ల రేడియస్‌లో ఉండేటట్లు ఏర్పాటు చేయాలి. లేకపోతే విద్యా వ్యాప్తికి అవకాశముండదు. అదిచేయకపోతే, ప్రభుత్వముయొక్క లక్ష్యము విఫలమైనట్లే తెలంగాణాలోని గ్రామసీమలలోని ఆర్థిక పరిస్థితి ఆంధ్రప్రాంతములో కంటే చాలా క్లిష్టముగనున్నది. ఈరోజులలో ఎవ్వరికైనా యాభై, అరవై ఎకరాలు ఉన్నప్పటికినీ, ఆయన తనపిల్లలకు విద్య నేర్పించుకునే స్థితిలో లేకుండా ఉన్నాడు దీనికి కారణము ఆదాయము చాలకపోవడమేనని గుర్తించాలి. ఆయన పిల్లలను పట్టణప్రాంతాలకు పంపించి, చదువు చెప్పించుకోలేనటువంటి స్థితిలో ఉన్నాడు. అందుకనే High Schools, Secondary Schools వీలు అయినన్ని అందుబాటులో ఉండేటట్లు ఏర్పాటు చేయాలని అంటున్నాను. విశాలాంధ్ర ఏర్పడిన సందర్భములో ఆంధ్రప్రాంతము మాదిరిగా తెలంగాణాలో కూడ విద్యకు అవసరమైనన్ని అవకాశములు కలుగజేస్తామని వాగ్దానము చేశారు. అవాగ్దానాన్ని దృష్టిలో పెట్టుకుని అయినా, High Schools ను Lower Secondary Schools ను విరివిగా ఏర్పాటు చేయాలి అని అంటున్నాను. తరువాత ఉపాధ్యాయుల వేతనాలు పెంచటానికి ప్రభుత్వము ఏమి ఆలోచిస్తున్నదో మంత్రిగారు చెప్పలేదు. ఈ రోజులలో యిది చాలా ముఖ్యసమస్యగా పరిగణించినది. తెలంగాణా, ఆంధ్రప్రాంతములలో ఉన్న ఉపాధ్యాయుల జీతాలు సమన్వయపరచటానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నట్లు చెబుతున్నారు దీనిని ఏవిధముగ చేయబోతారో వివరించాలని అంటున్నాను. ఈరెండు ప్రాంతాలలో పనిచేసేటటువంటి టీచర్ల వేతనాలలో చాలా తేడాలు ఉంటున్నవి. ప్రస్తుతము తెలంగాణాలోని ఉపాధ్యాయుల జీతాలే ఆంధ్రలోనివారికంటె ఎక్కువగ ఉన్నవి. అయితే integrate చేసినప్పుడు తెలంగాణావారి జీతాలు ఆంధ్రప్రాంతములోని జీతాల స్థాయికి తీసుకునిపోతారని తెలంగాణా ఉపాధ్యాయులు భయపడుతున్నారు. ఆంధ్ర ప్రాంతములో ముఖ్యంగా elementary school teachers కు నెల జీతము [illegible], 40 రూపాయలకంటె ఎక్కువ యివ్వడము లేదని తెలుస్తున్నది. [illegible] జీతాలు యిస్తే, వారి కట్టుబడిపోయేటు ఏవిధముగా జరుగగలదు ? [illegible] ప్రభుత్వ [illegible] విద్యావేత్తు

తారా ? అందువల్లనే వారు విద్యనేర్పించే విషయములో శ్రద్ధ తీసుకోవడము లేదని తెలుస్తున్నది. ఇది సహజమైన కారణమే. దీనికి ఉపాధ్యాయులను నిందించి ప్రయోజనములేదు. ప్రభుత్వము ఈ విషయమును గురించి తీవ్రంగా ఆలోచించాలి ఆంధ్రలోని ఉపాధ్యాయుల జీతాలలోను, తెలంగాణా ఉపాధ్యాయుల జీతాలలోను తేడాలు ఎక్కువగ ఉంటున్నను, వీరి అందరి seniority list, service rules and regulations, conditions of service, ఇవి అన్నీకూడా integrate చేస్తూ ఒక లిస్టు తయారు చేయటానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నదని కూడ మంత్రిగారు చెప్పారు. ఇరుప్రాంతాలలోని ఉపాధ్యాయుల జీతాల వివరాలు నేను సేకరించగలిగినాను. Scales of pay లో గూడ ప్రతి category లోనూ ఎక్కువ తేడాలు ఉన్నవి అవి నేను వివరించి చెబుతున్నాను మంత్రిగారు కూడ గుర్తించగలందులకు కోరుతున్నాను.

| Qualifications | Andhra Scales of pay Rs. | Telangana Scales of pay Rs. |
|---|---|---|
| Unqualified Teachers | Nil | 30–42 |
| Middle School-passed వారికి | Nil (Higher grade) | 42–54 |
| Passed Matriculates | 30–45 | 54–98 |
| Matriculation వారికి | 40 | 54–98 |
| Trained Matriculates | 45–90 | 81–130 |
| Passed Intermediates | No scale | మెట్రిక్ grade అయినవారి జీతమే యిస్తారు. |
| Trained Intermediates | No Scale | 130–190 |
| Graduates (B A) | 85 | 130–190 |
| ,, (B.Sc.) | 80 | 150–275 |
| Trained Graduates | 85–175 | 154–275 |
| Selection grade (special) | 165–245 | 280–345 (Side grade) |

కాబట్టి ఈ విధమైన తేడాలు scales of pay లో ఉన్నవి. ఈ తేడాలను సవరించేటప్పుడు ప్రభుత్వము జాగ్రత్తగా పరిశీలించి, తెలంగాణా వారికి ఏలాంటి అన్యాయములు జరగకుండా చూడాల్సి ఉంటుంది. Integration ప్రభుత్వము take up చేస్తున్నదని వినగానే, ఉపాధ్యాయులు చాలా మంది భయాందోళన పడుతున్నారు. Revision of scales of pay గురించి డిపార్టుమెంటువారు ఆలోచిస్తున్నారని తెలియగానే కొన్నికొన్ని కోర్టులనుంచి సూచనలు

గూడ వస్తున్నవి ఆంధ్రప్రాంతంలో 1942 నుంచి 1954 వరకు పని చేసిన ఉపాధ్యాయులకు promotions యివ్వకుండా ప్రభుత్వము ఆపుచేసిందని తెలుస్తున్నది. అదేవిధముగ 54 నుంచి 98½ స్కేలులో ఉన్నవారికి పై గ్రేడులోనికి పోయే అవకాశమున్నవారికి కూడ promotions లేకుండా, పైకిపోకుండా ఆపుచేశారని తెలుస్తున్నది. Promotions విషయము చాలా తీవ్రమైన సమస్య. ఎంతకాలము పనిచేసినను promotions లేకపోవడము నిజముగ అన్యాయమే

తెలంగాణాలో స్కేల్సు ప్రకారమే promotions కావాలని తెలంగాణా ఉద్యోగులు కోరుతున్నారు అది న్యాయమైన కోరిక విశాలాంధ్ర పర్పడేసమయంలో ఇచ్చిన హామీలలో యిది ఒకటి. Service conditions ఏకంకావు అని అన్ని పార్టీలవారు కూడా హామీ ఇచ్చారు ప్రభుత్వస్థాయిలో అప్పుడు మంత్రులు యిచ్చిన statements లో కూడా ఈ విషయం ఉన్నది. కాని, విశాలాంధ్ర పర్పడిన తరువాత యీవిషయంలో ప్రభుత్వం ఏమి ఆలోచించింది ? వారినిగూర్చి ఏమి ఆలోచించింది అని పరిశీలిస్తే ఉద్యోగుల విషయాలను వారి పై అధికారులకే వదలిపెట్టి మంత్రివర్గం చూస్తూ ఊరుకున్నది అనిపిస్తున్నది. ఈవిషయమై ఇండియా, గవర్నమెంటుయొక్క హోంశాఖవారు ఒక circular పంపించారు. ఇతరరాష్ట్రాలకు కూడా ఇటువంటి సమస్యలుంటాయనుకొని వారు బాగా ఆలోచించించి ఒక పద్ధతి చెప్పినారు. కనీసం ఒక promotion అయినా యివ్వాలని చెప్పారు. వారిచ్చిన principles ను మన ప్రభుత్వం అంగీకరించింది, అంగీకరించికూడా అమలు జరపడంలేదు ఒక్క ఉపాధ్యాయుల విషయంలోనే కాదు, ఇతర ఉద్యోగుల విషయంలో కూడా ఆసూత్రాలను పాటించడానికి నిరాకరిస్తున్నది. ఈ మధ్యన ఉద్యోగుల విషయంలో వాటిని పాటించడానికి అంగీకరించినట్లు తెలుస్తున్నది. కాని ఉపాధ్యాయుల విషయంలో ఇంకా నిరాకరిస్తూనే ఉన్నట్లు తెలుస్తున్నది. తెలంగాణా ఆంధ్ర స్కేళ్లను కలుపడంలో పెద్ద అన్యాయం జరిగిపోతోందనిపిస్తున్నది. నిజంగా ఆంధ్రలోని తక్కువ స్కేళ్లను, తెలంగాణాలోని ఎక్కువ స్కేళ్లను కలిపితే చాలా అన్యాయమే జరుగుతుంది. తెలంగాణావారికి తెలంగాణా స్కేల్సు ప్రకారమే promotions ఇవ్వడానికి పూనుకోవాలి. అదేవిధంగా ఉపాధ్యాయులకు ఇక్కడ వుండే scales ప్రకారమే వేతనాలను ఇవ్వడానికి పూనుకోవలసి ఉంటుంది. అట్లా జరిగినప్పుడే ఉపాధ్యాయవృత్తిని గౌరవప్రదమైన వృత్తిగా మనం గుర్తించామనుకోడానికి అవకాశం పర్పడుతుంది. పైగా, ఉపాధ్యాయులుకూడా చాలా శ్రద్ధతో, ఉత్సాహంతో, పిల్లలకు చదువు చెప్పి, విద్యార్థి వృద్ధికి, దేశాభివృద్ధికి పూనుకోగలరని వారు గట్టి విశ్వాసం ఉన్నది. మనం

అందరం కూడా విశ్వసించవచ్చును. మంత్రిగారు యీ విషయాలన్నింటినీ దృష్టిలో పెట్టుకోవాలి తెలంగాణా విద్యాభివృద్ధివిషయంలో తగుచర్యలు తీసుకొని హెచ్చు జీతాలిచ్చి ఉపాధ్యాయులనందరినీ సంతృప్తిపరచవలిసినదిగా మనవి చేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

* శ్రీ ఎం. ఆర్ అప్పారావు (నూజివీడు) : అధ్యక్షా, నేను మంత్రిగారు ప్రవేశ పెట్టిన డిమాండును బలపరుస్తున్నాను ఈ సందర్భములోనే ఆంధ్ర విశ్వవిద్యాలయం గురించి రెండు, మూడు విషయాలు చెబుతాను ఆంధ్ర విశ్వవిద్యాలయం 1926 వ సం. లో ప్రారంభించబడినది ఇప్పటికి సుమారు 30 సంవత్సరాల నుంచి ఉన్నత విద్య విషయంలో చాలా ప్రాముఖ్యత వహించింది 1926 వ సం. నుంచీ సి. ఆర్ రెడ్డిగారు, తరువాత కొంతకాలం రాధాకృష్ణగారు, మళ్లీ సి. ఆర్. రెడ్డిగారు, మొదలైన ప్రముఖులు Vice Chancellors గా ఉంటూ వచ్చారు ఇప్పుడు వి. యస్ కృష్ణగారు Vice Chancellorగా ఉన్నారు ఇప్పుడు అనేక కారణాలవల్ల ఆంధ్రయూనివర్సిటిలోటు పరిస్థితిలో పడినది. ఈ సంవత్సరం యూనివర్సిటి బడ్జట్ లో 14 లక్షల deficit వచ్చినది General account లో 11 లక్షలు capital account లో 6 లక్షలు కేవగా వచ్చిన డిఫిసిట్ ఇది Technological and pharmacy development department కు ఒక లక్ష deficit వచ్చింది. University Grants Commission వారిచ్చిన grants లో సగం యూనివర్సిటివారు కూడా ఇవ్వవలసిఉంటుంది. ఇందులో 2 లక్షల deficit వచ్చింది ఆంధ్ర విశ్వవిద్యాలయానికి పరీక్షల అకౌంటులో 6 లక్షలు మిగులుతుంది Books అమ్మకం వల్ల ఒక లక్ష రూపాయిలు మిగులుతాయి. Law college వలన 30 వేల రూపాయిలు మిగులుతాయి. ఇంతకి net deficit 14 లక్షలు వచ్చింది. అయితే University ఈ deficit ను ఎట్లా meet అవ్వాలి అనే విషయం ఆలోచించవలసి ఉన్నది. దానికి రాష్ట్ర ప్రభుత్వం డబ్బు ఇవ్వాలే తప్ప వేరేమార్గం లేదు State Government కు deficit వస్తే అనేక రకాల taxes వేసి భర్తీ చేస్తారు. University కి రాష్ట్ర ప్రభుత్వం సహాయంచేయాలే తప్ప ఇంకొక మార్గం లేదు. ఇప్పుడు ఈ deficit ను తగ్గించడానికి ఏమాత్రమూ వీలులేదు. కనీస అభివృద్ధి కార్యక్రమాలకు డబ్బు ఖర్చుచేయవలసిఉంటుంది. అందువల్ల విశ్వవిద్యాలయానికి యిప్పుడు యిచ్చే గ్రాంటుగాక యింకా ఎక్కువ గ్రాంటు ఇవ్వవలసి ఉంటుంది. ప్రస్తుతం కొంత reserve fund ఉన్నది ఆ రిజర్వు ఫండ్ లో నుంచి 14 లక్షలు ఖర్చు చేయవలసిన పరిస్థితి ఉన్నది. University

కి ఎటువంటి గ్రాంటులు యిచ్చినా - - Central Government వారి, University Grants Commission వారే ఇస్తూంటారు. వారు గ్రాంటులు యిచ్చేటప్పుడు — చాలా గ్రాంటులకు — వారు సగం యిస్తే మిగతా సగం యూనివర్సిటివారు యివ్వాలి అనే షరుతుపై ఇస్తారు. ఈ సగం యివ్వకపోతే వారు గ్రాంటు ఇవ్వరు. ఈ సగం యూనివర్సిటి అయినా ఇవ్వాలి, లేదా రాష్ట్ర ప్రభుత్వమయినా ఇవ్వాలి. ఈ విధంగా మనం సగం యివ్వలేకపోవడం వల్ల ప్రతి సంవత్సరమూ కొన్ని లక్షల రూపాయలు నష్టం వస్తోందని చెప్పక తప్పదు.

రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర యూనివర్సిటీకి మన ప్రభుత్వం రూ. 10 లక్షలు ఇచ్చారు. అంటే సంవత్సరానికి 2 లక్షలు అవుతుంది ఇది చాలా తక్కువ మొత్తమని వేరే చెప్పనక్కరలేదు, ఇంజనీరింగ్ కాలేజీ పెడితే దానికి దాదాపు ఒక కోటి రూపాయలు ఖర్చు అవుతుంది. Medical college కి 50,60 లక్షలు ఖర్చు అవుతుంది. యూనివర్సిటీ మొత్తానికి 5 సంవత్సరాలకూ 10 లక్షలు అంటే సంవత్సరానికి 2 లక్షలు చాలా తక్కువని చెప్పక తప్పదు.

యూనివర్శిటీ 30 ఏండ్లనుంచీ ఉన్నప్పటికీ convocation theatre ఏర్పాటు చేయబడలేదు. విద్యాశాఖామంత్రిగారు '5 లక్షలు గ్రాంటు ఇచ్చినాము, అందులో ఈసంవత్సరం ఈపనికి ఒకలక్ష యిచ్చినాము" అని చెప్పారు. చాలా సంతోషం. Convocation theatre అనే దాని ఉపయోగం convocation జరిగే రెండురోజులకే కాదు, ప్రతిదినం యూనివర్శిటీ కార్యక్రమాలకు ఆ theatre చాలా అవసరం. ఒకసంవత్సరం convocation జరిగినప్పుడు రెండుగంటలకాలం పెద్దవర్షం కురవడంవలన అందరూ తడవడం సంభవించింది. ఈవిషయాలను బట్టి యూనివర్శిటీకి థియేటర్ చాలా అవసరంఉన్నది.

యూనివర్శిటీకి వచ్చే ఆదాయంలో ఎక్కువభాగం పరీక్షలవల్లవస్తుంది. ఈ సంవత్సరం University Re-organisation Scheme ను అనుసరించి Intermediate ను తీసేశారు. ఇప్పుడు పరీక్షలవలన 6 లక్షల రూపాయల ఆదాయంవస్తుంది. అయితే Intermediate examination తీసివేయడంవల్ల మూడు లక్షల రూపాయలు నష్టంవచ్చింది. ఇప్పుడు Pre-university course పెట్టారు. High Schools లో VII Form పెడితే, యింకొక 3 లక్షలు నష్టంవస్తుంది. ఈనష్టాన్ని ప్రభుత్వమే భర్తీ చేయాలి. అంతకంటే వేరే మార్గంలేదు యూనివర్శిటీకి. S.S.L.C. పరీక్షలను ప్రభుత్వంవారే conduct

చేసి దానివల్లవచ్చే లాభం నుంచి ఆంధ్ర యూనివర్శిటీకి 15 వేలు ఇస్తున్నారు. ఇది 10 సంవత్సరాలక్రితం నిర్ణయించబడినది. దీనిని యిప్పుడు 60 వేలవరకూ పెంచవలసిన అవసరం ఉన్నది Students 4, 5 రెట్లు ఎక్కువ అయినారు కాబట్టి 60, 70 వేలకు పెంచవలసిన అవసరం ఉన్నది. ఈసంవత్సరం యూనివర్శిటీ గ్రాంట్సు కమిషన్‌వారు ఇంజనీరింగ్ కాలేజీ స్థాపన విషయములో ఆంధ్ర యూనివర్శిటీకి కొంత డబ్బు శాంక్షను చేశారని మంత్రిగారు చెప్పిన దానినిబట్టి తెలుస్తున్నది Chemical Engineering, Geo-physics లవంటి Science subjects లో Post-graduate and Research courses ను బోధించడానికి Economics, Sociology, Telugu, History, Commerce మొదలైన Humanity subjects బోధించడానికి grants యిస్తామంటున్నారు, కాని మనలను సగం గ్రాంటు ఇవ్వమంటున్నారు. రెండవ సగాన్ని మనం ఇవ్వలేక పోవడంవల్ల చాలా నష్టపోతున్నాము. ఇదివరకు జయపూర్ మహారాజా వంటివారు సంవత్సరానికి లక్షరూపాయలు ఇచ్చేవారు. ఈనాడు మనదేశంలో ఉన్న taxation system ను బట్టి Socialistic Pattern of Society ని అమలుచేయబోతున్నాము. కాబట్టి ప్రయివేటు సంస్థలనుంచి గాని, యితర వ్యక్తులనుంచిగాని మనకు ఎక్కువ డబ్బువచ్చే సావుకాశాలు లేవు. కాబట్టి యూనివర్సిటీకి ఒక్క ప్రభుత్వంనుంచే డబ్బు లభించవలసి ఉంటుంది.

అన్నింటికంటే ముఖ్యమైనది యూనివర్సిటీ హాస్టల్సు విషయం. హాస్టలు సౌకర్యాలు చాలా తక్కువగా ఉన్నాయి ఇంజనీరింగ్ కాలేజీ యిచ్చినారు. 5 సంవత్సరాలు దాదాపు 500 మంది students కు hostel accommodation కలుగచేయవలసి వుంటుంది. హాస్టల్సు తక్కువగా ఉండడంవలన university లో discipline దెబ్బతింటోంది అనే విషయాన్ని గొప్పగొప్ప విద్యావంతులందరూ చెబుతున్నారు. Hostels లేకపోతే students ఎక్కడో ఊళ్ళో ఉంటారు. వారికి సరైన atmosphere ఉండదు. సరిగా చదివేందుకు సావకాశాలుండవు. నైతికంగా విజ్ఞానాభివృద్ధి చెందే అవకాశం ఉండదు. University లలో residential hostels లేకపోతే—ఇక అంతకంటే వేరే నష్టం ఉండదు. వాల్తేరు ఊరికి 4,5 మైళ్ల దూరమున ఉన్నది. అందువల్ల hostel లో seat దొరికితేతప్ప college లో seat దొరికినా ఏమీ లాభంలేదు. ఒక్కొక్క room లో నలుగురైదుగురు విద్యార్థులను ఇరికించుచున్నారు.

ఈ సంవత్సరం ఐదు లక్షల రూపాయలు ఖర్చు చేసి ఒక హాస్టలును నిర్మించుచున్నారు. ఆ డబ్బును యూనివర్శిటీ గ్రాంట్సు కమిషన్‌వారు అప్పుగా

ఇచ్చినారు వడ్డీలేకుండా 25 సంవత్సరాలలో తీర్చుకోవలసిఉంటుంది. ఇప్పుడు కట్టించే హాస్టలులో రెండువందల మంది విద్యార్థులకు మాత్రమే వసతి సౌకర్యముండును. ఇంకా ఐదు వందల విద్యార్థులకైనా హాస్టల్ కట్టవలసిన అవసరమున్నది. అందుకు 15 లక్షల రూపాయలు ఖర్చు ఔతుంది ఈ 15 లక్షలను రిజర్వుఫండు నుండి తీసికొనుటకు ఏర్పాటు చేసినారు. ఈమాదిరిగానే ఖర్చుచేసిన 4,5 సంవత్సరాలలో రిజర్వుఫండు పూర్తిగా ఖర్చగును. కనుక రిజర్వునుండి ఖర్చు చేసినా, ప్రభుత్వం ఖర్చు పెట్టినా అది అంతా ప్రభుత్వానిదే ఔతుంది. ప్రభుత్వం ఇవ్వవలసిందే

లా కాలేజీకి బిల్డింగులేదు. ఏకాలేజీకైనా బిల్డింగులేనప్పుడు యూనివర్సిటి అఫిలియేషన్ ఇవ్వడంలేదు. War time లో వేసిన షెడ్డులలో పెడుతున్నారు. అవి పడిపోతున్నవి బిల్డింగుకు మూడు లక్షలు ఔతుంది. వెంటనే బిల్డింగును కట్టించవలసిన అవసరం ఉన్నది.

ఆంధ్రుల చరిత్ర అంటూ ఇంతవరకు ఏ పుస్తకమూ లేదు. అక్కడ యూనివర్సిటి ఒక కమిటీని నియమించి ఒక చరిత్రను తయారు చేయుటకు ప్రయత్నించుచున్నది. ఇది చాలా ముఖ్యమైన విషయం ఆంధ్రరాష్ట్రము వచ్చినది. ఆంధ్రులను గురించిన ఒక చరిత్రఉండడం చాలా అవసరం. ఇందుకు దాదాపు నాలుగు లక్షల రూపాయలు ఖర్చు ఔతుందని అంచనావేశారు. ఆ విధంగా అన్నింటిని చేసిన యూనివర్సిటి అభివృద్ధి చెందుటకు, ఉన్నత విద్యలు అభివృద్ధి చెందుటకు వీలుఉంటుంది.

S. R. R. C. V. R College ఏర్పడి దాదాపు 20 సంవత్సరములైనది. అది జమీందారీ ధనముతో నడుపబడుతుండేది. ఎక్కడైతే జమీందారీ రద్దుచేయబడినదో అక్కడ ఉండే ఇన్‌స్టిట్యూషన్సును వెంటనే ప్రభుత్వం తీసుకోవాలని జమీందారీ అబాలిషన్ చట్టంలోనే ఒక ప్రొవిజన్ ఉన్నది. కాని దానికి ఎక్కువ డెఫిసిట్ లేనందున ఇంతవరకూ మేము నడుపుతూ వచ్చాము. ఈ సంవత్సరం intermediate నుండి తీసివేయుటవల్ల 40 వేల నుండి 50 వేల వరకు deficit వస్తుంది. ప్రభుత్వానికి గూడా సానుభూతి ఉన్నది. ఆ కాలేజీని ఈ ఎకడమిక్ సంవత్సరం నుండి ప్రభుత్వం తీసుకోవాలని కోరుతున్నాను.

***Sri B. V. Subba Reddi (Koilkuntla)*:** Mr. Speaker, Sir, the hon. Minister for Education while moving the Demand has read a very lengthy report showing the progress in the field of education in the previous years and particularly

during the last year. It is not possible for me within the time allotted, to refer to all the items which have been referred to in the report But I will concentrate myself only on elementary education and bring to the notice of the Government the woeful condition of elementary schools particularly in the villages, and of the teachers working therein

It will be unfair and unjust to the Government if I do not make a mention of the fact that the Government have certainly done something appreciable in the recent years in the field of secondary and university education, by opening a good number of educational institutions, high schools and colleges, and particularly the Sree Venkateswara University at Tirupathi. But, I must say that, so far as elementary education is concerned, we stand where we were, when the foreigners left the country for good, the Government have done next to nothing. Sir, in almost all the children's gatherings, students' rallies, etc many of our elderly leaders have been telling them that they are the future citizens and leaders of tomorrow and that from now on they should prepare themselves to undertake not only the life's burdens, but if necessary the reins of administration. Sir, very often we also hear a complaint from the elderly people of the older generation, of the increasing indiscipline in elementary schools, secondary schools and university colleges. I ask, whether there is indiscipline only in these educational institutions and not in any other walk of life! Sir, in this connection let me quote a very interesting and instructive passage from the Convocation Address of the Late Rt. Hon. Srinivasa Sastri to the students and graduates of the Annamalai University in the year 1949 or 1950. He said:

"From very ancient days we have been bidden to speak the truth and to perform dharma. Truth has been declared to be the basis and support of all things in life. In

an immortal lengend, it is said that Harischandra sold his wife and son to slavery and himself watched burning corpses on the banks of River Ganges. To keep the plighted word of his father, Rama gave up his kingdom and dwelt in the forests for years. To keep their promises, having lost every-thing in the game of dice, Pandavas with their spouse went into exile fer twelve long years and lived in obscurity for twelve long months, subjecting themselves to all kinds of humiliations and degradations. The Empire of truth has no limits and knows no relaxations. But unfortunately modern life has however made numerous and extensive inroads upon it In the delings of nations either in war or in peace and in diplomatic intercourse, in the large sphere allotted to propaganda and advertisement, in business and commerce, in the region of sex, in after-dinner speeches, in testimonials, in welcome addresses, in farewell functions, in epitahs and funeral orations, in the writings of the partisan press, in the promises of lovers and candidates at election time, in the one-sided pleadings of lawyers before judges, in the defence of superstition and error as necessary basis for ethical conduct and in the large domain of politics, in these and in a host of other things we recognise and allow for a large measure of concealment and distortion of truth."

Sir, I say that this indiscipline and disorder and moral degradation is not only peculiar to educational institutions, but it is common in all walks of life-in social life, in political circles and practically in every other walk of life. Sir, an average man in countries like Japan and England and in all advanced countries, is much more disciplined and systematic in his habits and outlook. I am sorry to observe that in our own country there is absolutely no discipline in any walk of life, and all this is due to defective training during the formative period in our early years. For that, what I submit is that in the earlier years if we take care to develop the body and mind of children, they will prove to be useful citizens in the future.

Sir, what is the condition of the elementary schools as they are at present? Most of these schools are under the management of the District Boards while a few are under the management of Christian Missionaries and other private managements. From my experience I know that 25 per cent of the district board elementary schools are not working at all and most of them are kept closed during greater part of the year. 90 per cent of these schools are located in dilapidated, rented private buildings in very unhealthy surroundings, buildings which do not admit of light or air, buildings in which floor is never swept, buildings in which, when we go we find a broken pot in one corner and a brooding hen in another corner and a bundle of fuel in another place, and the teacher with a burnt beedi in his mouth with his legs stretched on the table and with a never working time-piece by his side. This is the condition of schools. What is the kind of teachers we have got? They are the refuge of all other callings in life and their general knowledge is very poor, teachers who do not know whether Banares is in C. P. or U. P. This is because the scales of pay we are giving them are so poor that we are not able to attract the best talent in the country. Sir, I know and sympathise with the miserable lot of these poor elementary school teachers. But I must at the same time also condemn the activities of some of these people who indulge in litigation, in politics and take part in elections also. Some of them ultimately take to politics as a profession, a profession which does not require any qualification either moral or educational, except a sound mind in a sound body. Sir, many of these people do not evince interest in their present profession and unfortunately the so-called noblest profession in the world has become the sorriest of all trades.

Lastly, Sir, let me suggest a few points to the hon. Minister so that he may ponder over them deeply. I would suggest to the Government to draw up them a five-year or seven-year programme to see the pucca buildings are cons-

tructed for these elementary schools, if necessary, on the basis of 50 per cent contribution from the public, within these 5 or 7 years, the Government should also see that at least one acre is alloted outside the village in a very good locality for the school, for buildings as well as for play-ground Secondly, the Government should also see that the scales of pay of these teachers is raised at least to the level of a Lower Division Clerk, and should entrust the management of these schools to the local panchayat boards and create conditions where the children can play and breathe free air and learn, if not from the teachers, at least from nature Let me hope that the hon Minister for Education with his long experience in this field of education from the beginning of his career, will seriously think of this problem and do something worthy in the near future. Thank you, Sir.

శ్రీ కె. సుబ్బారావు (హిందుపూరు-జనరల్). అధ్యక్షా, రాత్రి 12 గంటలవరకు శ్రమతో వ్రాసి ఈనాడు ఇక్కడ ఉపన్యసించిన విద్యామంత్రిగారి ఉపన్యాసమును అందరికి అచ్చొత్తించి అందజేస్తే చాలా ఉపయోగముగా వుంటుందని మనవి చేస్తున్నాను. ఆంధ్రప్రభుత్వపు 62 కోట్లలో 12 కోట్లు అంటే దాదాపు అయిదవ భాగమును విద్యాపద్దుకు కేటాయించారు. ఈడబ్బు నంతా ఏవిధంగా ఖర్చు పెట్టదలచినారో మంత్రిగారు మరికొంత వివరాలతో చెప్పివుంటే బాగుండేది.

వారు విశ్వవిద్యాలయముల గురించి చెప్పినారు విశ్వవిద్యాలయములు అవసరమే. మన రాష్ట్రములోనున్న మూడు విశ్వవిద్యాలయములను అభివృద్ధి పరచవలసిన బాధ్యత మనపై వున్నది. హిమాలయ పర్వతములు గంగా సింధు మైదానముల అభివృద్ధికి ఎంత అవసరమో, దేశములోని సర్వవిద్యల సర్వ శాఖల పరిశోధనకు ఇవి అంత అవసరము. వాటికి డబ్బు ఖర్చుపెట్టవలసినదే.

సెకండరీ విద్యలో సాహసించి కొంత ముందుకు పోతున్నాము. కాని పరిపూర్ణతను యింకా పొందలేదు నేర్పేవారికి విజ్ఞానము తక్కువో, లేక చదువుకొనేవారికి శ్రద్ధలేదో నేను చెప్పలేను. కాని యువకులలో విజ్ఞానాన్ని పెంపొందింపచేసే విధానములో లోపంవుందని నేను చెబుతున్నాను. దీనిని ప్రభుత్వం పరిశీలించవలెనని మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

ప్రాథమిక విద్యకు 6 కోట్లు ఖర్చుపెడుతున్నారు. అది ఇప్పటివారికి కాదు. భావి పౌరులను, నీతివంతంగా, నియమవంతులుగా, నిష్టాపరులుగా చేయుటకే, చిన్నపిల్లల అభివృద్ధికే 6 కోట్లు ఖర్చుపెట్టవలసివుంది. నేను ఒక ఎలిమెంటరీ స్కూలును నడపుతున్నాను మహాత్మాగాంధిగారు చెప్పిన బేసిక్ విద్యను అనుసరించి 7 సంవత్సరములనుండి 14 సంవత్సరముల పిల్లలందరికి చదువు చెప్పించవలసిన బాధ్యత, ధర్మము ప్రభుత్వమునకు వున్నది విద్యపై పన్ను వేశారు. అవసరమైతే ఆ పన్నును యింకా హెచ్చించి అయినా విద్యార్థులను భావిపౌరులుగా చేయాలని నేను చెబుతున్నాను ఈ ప్రాథమిక విద్యకు సంబంధించి single teacher schools వున్నాయి. వాటిని చూచే వారు ఎవరూ లేరు డిప్యూటిఇన్‌స్పెక్టరు కూడా చూడరు అక్కడ పరిపాలనా సౌకర్యాలను చక్కగా చూడవలసిన అవసరం ప్రభుత్వమునకు వుంది నేను ఒక సూచన చేయదలచుకొన్నాను. అన్ని మతములవారిని, అన్ని గ్రామముల పిల్లలను 10 వేల మందిని 5,6,7,8 తరగతులలో ఒకచోట చేర్పించి, వారిలో సఖ్యతను, ఐక్యతను పెంపొందింపచేయవలెను. దీనికి అదనంగా 10 వేల రూపాయలు ప్రత్యేకంగా ఖర్చు పెట్టవలెనని మనవిచేస్తున్నాను. నా స్కూలులో 250 మంది చదువుచున్నారు. ఆ 250 మందికి, హరిజనులకు, గిరిజనులకు కావలసిన డబ్బు ప్రభుత్వమే ఇస్తున్నది. కాని ఎంతో దూరంనుండి వచ్చే విద్యార్థులకు మధ్యాహ్న భోజనం ఏర్పాటుచేస్తే యింకా, ఎక్కువ మంది పిల్లలు చదువుకోటానికి అవకాశం వుంటుంది.

ఉపాధ్యాయుల గురించి అనేకమంది అనేక విధాలుగా చెప్పినారు. ఎక్కువగా జీతాలందరికి ఇవ్వాలని కొందరు చెప్పారు. ప్రభుత్వమునకు గల ఆర్థిక స్తోమతనుబట్టి ఇస్తుందికాని కోరినంత మొత్తమును ఇచ్చే పరిస్థితిలో ప్రభుత్వము లేదని నేను చెబుతున్నాను. ఉపాధ్యాయులు తమకు ఎక్కువ కావాలని అడగవచ్చును. కాని ప్రభుత్వ ఆర్థిక పరిస్థితిని కూడా గమనించవలెను. ఉన్న జీతాలను పెంచమని కోరటంకంటె ఇస్తున్న జీతాలను క్రమంగా, సకాలములో ఇవ్వాలని కోరటం మంచిది.

ఆ జీతాలు సరిగా యివ్వడంలేదు. దానికి తగినటువంటి వసతి ఏర్పాటు చేయాలని నేను ప్రార్థిస్తున్నాను. కేంద్రపాఠశాలలు పెట్టి చుట్టుప్రక్కల ఉన్న పిల్లలనందరినీ చేర్చి, సరియైన పద్ధతిలో విద్య చెప్పించినట్లయితే క్రమశిక్షణా యుతులైన విద్యార్థులను తయారు చేయవచ్చును. ఉదాహరణకు నా క్షేత్రక్రింద వడపైన పాఠశాలలో, పదు సంవత్సరాలనుంచి 14 సంవత్సరాలవరకు వయస్సు

ఉన్నవారిని చేర్చుకొని, వారికి యిచ్చిన శిక్షణవల్ల ఆ పాఠశాల వదలిపెట్టి వెళ్ళి పది సంవత్సరాలు అయినప్పటికి ఒక బీడిముక్క తాగిన వాళ్ళు యెవరూ లేరు అల్లాగే 7 సంవత్సరాలు మొదలు 14 సంవత్సరాల వరకు ఉన్న విద్యార్థులయొక్క బాధ్యతలను ప్రభుత్వం తీసుకొని, ఒక కోటిరూపాయలు ఖర్చు అయినా సరే — ఆ అదనపు బరువును ప్రభుత్వం తీసుకొంటే, పది సంవత్సరముల తరువాత భారతదేశము, యెంతో గౌరవంగా, యెంతో మర్యాదగా బ్రతకడానికి అవకాశం ఉంటుంది. కనుక భవిష్యత్తును మనసులో పెట్టుకొని, పది సంవత్సరాల తరువాత భారతదేశ కీర్తి ప్రతిష్టలను మనసులో పెట్టుకొని, మంత్రులు కేంద్ర పాఠశాలలుగా ఉన్న పాఠశాలలు యెన్ని ఉన్నాయో, అందులో ఉండే బీదపిల్లలకు కావలసిన భోజన సౌకర్యాలు ఏర్పాటుచేసి, పల్లెలనుంచి వచ్చేవారికి మధ్యాహ్న భోజనములు ఏర్పాటుచేసి, తగినటువంటి విద్య, విద్యార్థులకు నేర్పవలెను. ఈ ప్రాథమిక విద్య విషయమై జాగ్రతతీసుకోవలెను. దీనిని బేసిక్ విద్యగా గాంధిగారు చెప్పినప్పుడు, యిది ఆధార విద్య విజ్ఞానానానికి తోడ్పడే జీవనాధారమైన విద్యను నేర్పాలి ప్రస్తుత విద్యావిధానం వల్ల, చదువుకొన్న పిల్లలు యెంతోమంది కష్టపడడానికి యిష్టంలేక, చదువుకొనికూడ, సంపాదించుకునే శక్తిలేనివాళ్లగా ఉండడము జరుగుతోంది ఈ విషయమై ఆలోచనచేసి ఏవిద్య చెబితే బాగుంటుందో అది చెప్పవలెను ఆఖరుకు 50 పరంగిచెట్లు నాటి, పెంచి, పండ్లు అమ్ముకొని జీవనం చేయగలమన్న ధైర్యం వాళ్ళలో కలిగేటట్లు చేయవలెను. ఈనాడు ఆ ధైర్యం లోపించింది. కాబట్టి ఉపాధ్యాయ వర్గాలకు కావలసిన ఉత్సాహం కలిగించి, వారిలో ఒక ఉన్నత భావపూరితమైన ఉత్సాహంరేకెత్తించి, భావిపౌరులను చక్కగా తీర్చిదిద్దటానికి తగిన కృషిచేసి, యింకో రెండు కోట్ల రూపాయలు యెక్కువ అయినాసరే, ఖర్చుపెట్టి, ప్రాథమిక విద్యను సరియైన పద్ధతులలో నడపాలని మనవిచేస్తున్నాను విద్యామంత్రిగారు 60 కోట్లలో 12 కోట్లు విద్యకు ఖర్చు పెడుతున్నప్పుడు ప్రాథమిక విద్యకు ప్రత్యేకమైన మంత్రిని వేసి పరిపాలన చేయించవలసినదని ప్రార్థన.

*శ్రీ పి. నరసింగరావు: అధ్యక్షా! మనకు స్వరాజ్యంవచ్చి పదకొండు సంవత్సరాలు అయినా, మనదేశంలో విద్యావిధానము అనేది యేమిటో యిదమిద్ధంగా తేల్చలేని పరిస్థితి ఉండిపోయింది. ప్రతివారు కూడ మన విద్యావిధానము బాగులేదని చెప్పడమేగాని, దానిని సరియైనపద్ధతులలో రూపొందించడానికి తగిన చర్యలు తీసుకోవడంలేదు. ఏమైన చర్యలు తీసుకొంటే మధ్యలో ఆగిపోవడం తటస్థిస్తున్నది. బేసిక్ విద్య అనేది యిప్పటిది కాదు.

మహాత్మాగాంధిగారు ఎంతో పరిశోధన జరిపి, కొన్ని పద్ధతులలో దానిని అభివృద్ధి కూడ చేశారు. కాని మన రాష్ట్రంలో ఈ విద్యావిధానమును ప్రవేశపెట్టుటకు, తగిన పరికరాలుగాని, శిక్షణయిచ్చే ఉపాధ్యాయ వర్గాన్నికాని రూపొందించుటకు తగిన ప్రయత్నం జరుగనేలేదు. కాని స్కూళ్లను బేసిక్ పాఠశాలలుగా మార్చడం జరుగుతున్నది. ఉపాధ్యాయులు యేమి నేర్పుతున్నారో వారికే తెలియకుండాయున్నది. కొంతమంది ఉపాధ్యాయుల్ని అడుగుతే 'మేము చెప్పేది యేమిటో మాకే తెలియదు" అంటున్నారు. ప్రతి సంవత్సరం రెండు మూడు చొప్పున హైస్కూళ్లను మల్టిపర్పస్ హైస్కూళ్ళుగా మారుస్తున్నారు. ఇక్కడకూడ యిదేవిధముగా యున్నది. మామూలుగా చదివే text books అనుభవం కూడ పోతున్నది బేసిక్ విద్యకు సంబంధించిన విషయాలు అసలే లేవు. మనకు విద్యారంగంలో ఒక ఖచ్చితమైన విధానం లేదు. అన్ని పద్ధతులు experience stages లోనే ఉన్నవి. "ఈ పద్ధతి కాదు, ఆ పద్ధతని" ఊరకే సిలబసులు మార్చుకొంటూ పోవడం తప్ప సరియైన పద్ధతేలేదు. విద్యకు సంబంధించి అడ్మినిస్ట్రేషన్ చాలా గందరగోళంగా ఉన్నది అసలు ప్రభుత్వానికి సరియైన ఖచ్చితమైన పోలసీయే లేదని చెప్పక తప్పదు. ఎక్కడైతే పంతుళ్ళు ఉండరో అక్కడ విద్యార్థులు ఉంటారు. ఎక్కడైతే విద్యార్థులు ఉండరో అక్కడ పంతుళ్ళు ఉంటారు. బేసిక్ ట్రయినింగుకని పంతుళ్లను ట్రయినింగుకు పంపడం జరుగుతున్నది. ఆ ఖాళీలను పూడ్చకుండా అట్లే ఉంచుతున్నారు పంతుళ్ళు లేక విద్యార్థులయొక్క చదువు సాగడం లేదు. విద్యార్థులు చదవడంలేదని నిందించి లాభం యేమీలేదు. ఎందుకు ఆ ఖాళీలను భర్తీచేయడం లేదని అడుగుతే ట్రయినింగులో ఉన్నవాళ్లకు కూడ జీతాలు T. A. లు D. A. లు యిచ్చుకోవాలి. క్రొత్తవాళ్ళను వేస్తే వాళ్లకు కూడ యివ్వాలి అందుకోసం ఆ జాగాలను భర్తీచేయడం లేదు' అంటున్నారు. దీనినిబట్టి చూస్తే విద్యార్థుల యొక్క స్థాయిని నాశనంచేసినవారు అవుతున్నారు. ఈ ప్రభుత్వం వాళ్లయొక్క భావిజీవితాన్ని నాశనంచేస్తున్నదని చెప్పక తప్పదు.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని ఉపాధ్యాయులు గురించి కొన్ని విషయాలు చెప్పవలసియున్నది. ఆంధ్రలో యే వెయ్యో పదిహేనువందలో ఉపాధ్యాయులు డైరెక్టుగా Education Department ఆధ్వర్యంలో ఉన్నారు. మిగతా వారు అందరూ, జిల్లాబోర్డులు ఇతర సంస్థలు నడపబడుతున్న పాఠశాలలో పనిచేస్తూన్నారు. కాని తెలంగాణాలో మాత్రం అదృష్టవశాత్తు మొత్తం అన్ని పాఠశాలలో, దాదాపు 20 వేల మంది ఉపాధ్యాయులు గలవి ప్రభుత్వం చేతనే నడుపబడుతున్నవి. ఆంధ్ర ఉపాధ్యాయుల స్కేళ్ళకంటే యిక్కడ

ఉపాధ్యాయుల స్కేల్స్ కొంచం యెక్కువగా ఉన్నవి అయితే ఈ ప్రభుత్వం యొక్క విధానం యెట్లా ఉన్నదో గమనించాలి ఎక్కడ తక్కువ జీతం ఉన్నదో ఆ స్కేల్స్‌తో ఇంటిగ్రేటు చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు ఆ విధంగా equate చేయడం జరుగుతోంది కాని ఉపాధ్యాయులను గురించి ఉపన్యాసాలు యిచ్చేటప్పుడు మాత్రం "గురుతుల్యులు, భావిపౌరులను నిర్మాణంచేసేవారు' అని యేవేవో అంటారు. వాళ్లకడుపునిండా అన్నంలేకపోతే ఎట్లా పౌరులను నిర్మాణంచేస్తారు అన్న విషయం ఆలోచించవలసియున్నది. కొత్త అప్పాయింట్‌మెంటున్నూ, ప్రమోషన్లు వచ్చినట్లయితే క్రొత్త స్కేళ్లు అన్వయింపచేస్తున్నారు. ఈవిధంగా తెలంగాణా ఉపాధ్యాయులకు అన్యాయం చేస్తున్నారని చెప్పవలసివస్తున్నది. మొదట ఆంధ్ర ఉపాధ్యాయుల స్కేళ్లను, తెలంగాణా ఉపాధ్యాయుల స్కేళ్లతో సమానంగా వచ్చేటట్లుచేయండి. ఆ తరువాత ఉపాధ్యాయుల జీతాలను పెంచుటకు ప్రయత్నంచేయండి కేంద్రప్రభుత్వం ఉపాధ్యాయుల స్కేళ్లను యెక్కువ చేయాలని, అందుకుగాను గ్రాంటులు, లోన్సు యిస్తే, వాటిని ఉపయోగించుకోలేని పరిస్థితిలో మన ప్రభుత్వం ఉంది. ఉపాధ్యాయుల సానుభూతి లేకుండా, మనం విద్యాస్థాయిని పెంపొందించలేము. ఎన్ని భవనాలు కట్టినా, ఎన్ని బేసిక్ పాఠశాలలు తెరచినా నిష్ప్రయోజనం వాటివల్ల ఫలితం శూన్యమనే చెప్పాలి. పది సంవత్సరాలలో నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం ప్రవేశపెడతారని చెప్పారు. కాని రెండు, మూడు ప్రణాళికలు పూర్తి అయినప్పటికికూడ అవి ప్రవేశపెట్టలేరని నానమ్మకం కనీసం ఖర్చు పెట్టే డబ్బులోనైనా ఉపాధ్యాయుల్ని తృప్తిపరచి, విద్యాస్థాయిని పెంపొందించాలని మనవిచేస్తున్నాను

ఈమధ్య తెలంగాణాలో కొన్ని vacancies create అయితే, ఆ జాగాలలో, ఆంధ్ర నుంచి ఉపాధ్యాయులను తీసుకొనివచ్చి భర్తీచేశారు. అవి హిందీ పండితుల పోస్టులు. 60 మంది ఉపాధ్యాయుల్ని తీసుకొనివచ్చి నింపారు. తెలంగాణాలో హిందీ పండితులు లేరా ? లేక హిందీచదువుకొనేవారు తెలంగాణాలో లేరా ? తెలంగాణావాళ్లకు హిందీ రాదన్నట్లుగా యిది జరిగింది.

పాఠశాలల యొక్క సామర్థ్యం పెంచడానికి యేమీ ప్రయత్నం జరగడం లేదు. అడ్మినిస్ట్రేషన్ చాలా లూజుగా ఉంది. Inspecting staff చాలా తక్కువ. ఒక డిప్యూటి ఇన్‌స్పెక్టరు క్రింద దాదాపు 100, 120 పాఠశాలలు ఉంటాయి. అన్ని పాఠశాలలను పరీక్షచేయాలంటే సంవత్సరానికి ఒక round కూడ రాదు. దీనివల్ల చాలా యిబ్బందులు ఉన్నాయి. ఉన్నవాళ్లకు సరియైన

సౌకర్యాలు లేవు వాళ్ల T. A. లు, D A లు, వేతనాలు సరిగా సకాలంలో యివ్వడంలేదు. ఈ పరిస్థితులను చక్కబరచకుండా, నిర్బంధ విద్యావిధానం ప్రవేశపెట్టినందువల్ల ప్రయోజనం యేమీలేదు. అట్లావేస్తే ఫలితం ఒక్కటే అవుతుంది విద్య ఏమాత్రంరాదు ఖర్చుమాత్రం అవుతుంది. అంతటా అసంతృప్తి ఉంటుంది కాబట్టి ముఖ్యంగా ఆంధ్ర ఉపాధ్యాయుల వేతనాలను తెలంగాణా స్కేళ్లతో equate చేస్తే బాగుంటుంది కాని అక్కడ తక్కువ ఉంది కాబట్టి, యిక్కడవాళ్లనుకూడ వాళ్ల అంతస్తుకు దించుతాము అనే విధానము యెంతమాత్రము సమంజసమైనది కాదని నేను మనవిచేస్తున్నాను

Basic Training Schools లో ఉన్న ఉపాధ్యాయులకు D A ఇవ్వడం లేదు మొదట ఈ training రెండు సంవత్సరాలని ప్రారంభించబడింది తరువాత దానిని ఒక సంవత్సరానికి reduce చేశారు. ఒక సంవత్సరం training లో ఉన్నవారికి D A దొరుకుతోంది కానీ రెండు సంవత్సరాలు training లోని వారికి దొరకడంలేదు. వారికి అసలే జీతాలు తక్కువ. అందులో హైదరాబాద్ వంటి పట్టణాలలో ఉండి training కావాలంటే చాలా ఖర్చవుతుంది. ఇట్టి పరిస్థితిలో వారికి D. A తగ్గిస్తే అసలే లాభంలేదు

ఉస్మానియా యూనివర్సిటీని గురించి ఈసభావేదిక ద్వారా ప్రశ్నల రూపంలోను ఇంకా వేరేరూపంగా కూడా చాలాసార్లు చెప్పడం జరిగింది. అక్కడపనిచేసే కార్మికుల, ఇతర ఉద్యోగుల వేతనాలను గురించి చర్చించాము. ఈ మధ్యనే ఒక రు. 6-0-0 లు D. A. పెంచామని యూనివర్సిటీవారు ప్రకటించారు. ప్రభుత్వంకూడా కొంత grant ఇచ్చినందుకు, ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు ఇప్పుడు ఇచ్చిన grant సరిపోదు, ఇంకా ఎక్కువ ఇస్తేనే కాని అక్కడపనిచేస్తున్నవారి జీతాలు పెంచడానికి వీలుకలుగదు. ఈయూనివర్సిటీ వ్యవహారాలు ఎప్పుడైనా ఏమైనా వస్తే అది "ఎటానిమస్ బాడీ" అని, దానిని గురించి చర్చించవద్దని చెప్పడం జరుగుతోంది, అది సరికాదు. మనం దానికి grants ఇస్తున్నప్పుడు, కొన్ని, కొన్ని ముఖ్యవిషయాలు మనం చెప్పకతప్పదు. ఈ యూనివర్సిటీ అంతరంగిక వ్యవహారాలు బాగాలేవు. వాటిని సరిచేస్తే అక్కడ పనిచేసేవారి వేతనాలు పెంచటానికి వీలుకలుగుతుంది. ప్రభుత్వం దానికి ఇంకా ఎక్కువ grants ఇచ్చి, హైదరాబాద్ పట్టణంలో ఉన్న ప్రభుత్వోద్యోగులకు ఇచ్చినట్లు రు 12/- ల D. A. యూనివర్సిటీలో పనిచేసేవారందరికి ఇవ్వాలి. ఎంతోకాలం పోరాడిన తరువాత మంజూరుచేసిన రు 6/- లు

కూడా అందరికీ లేదనియు, రు 50/- లోపు జీతంవారికేనని, రు 100/- లోపు వారికే నని చెప్పబడుతోంది కాబట్టి మంత్రిగారు ఈవిషయమై అది ఎవరికి వర్తిస్తుందో స్పష్టంగా సెలవివ్వాలని మనవిచేస్తున్నాను

కనీసం విద్యలోనైనా మనం ఈనాడు సమానత్వం తీసుకొని రాలేక పోయాము. ఇక్కడ పాఠశాలలు చాలా విచిత్రంగా ఉన్నాయి. Public Schools అని, Central Primary Schools అని, ఇంకా ఏదో school అని restriction ఉంది కొన్ని పాఠశాలలపైన మనం లక్షలు, వేలకొద్దీ రూపాయిలు ఖర్చుపెడుతున్నాము. కొన్ని schools లో కేవలం "privileged class" వారికే ప్రవేశమని చెప్పబడుతోంది మనం ఒక వైపున "privileged classes" ను abolish చేయాలని చెబుతున్నాము. కనీసం మనం ఈవిద్యాస్థాయిలోనైనా ఈభేదభావాన్ని రద్దుచేయనట్లయితే మన రాజ్యాంగంలో నిర్వచింబడిన సమానత్వం ఎన్నటికీరాదు. డబ్బు ఉన్నవారు తమ పిల్లలకు మంచిచదువు చెప్పించుకొనుటకు ఎంతడబ్బు ఖర్చుపెట్టుకొన్నా ఎవరికీ అభ్యంతరంలేదు. కాని ప్రభుత్వం 'privileged classes' వారిపిల్లలు చదివే schools లో సగటున రు. 10 నుంచి 30 ల వరకు ఖర్చుపెడుతూ, మిగిలిన Elementary Schools లో చదివేపిల్లలకు సగటున రు 0-3-0 నుంచి రు.1/- ఖర్చుపెట్టడం సరైనపద్ధతి మాత్రం కాదు. ఈ privilege classes వారిపిల్లలు చదువుకొనే పాఠశాలలకు ఎక్కువ grants ఇవ్వడం ఆపాలి. ఆడబ్బునంతా ఉపాధ్యాయుల జీతాలు పెంచడానికో, లేకపోతే ఎక్కువ schools పెట్టడానికో లేక బీదవిద్యార్థుల జీతాలు కట్టడానికో వినియోగించాలి.

Arts Colleges ను ఎక్కువగా ప్రారంభించడంవల్ల లాభమేమీలేక పోగా నిరుద్యోగ సమస్య ఎక్కువ అవుతుంది మనం వేసికొన్న ప్రణాళికా లక్ష్యాలను సాధించాలంటే, సైన్సు మరియు ఇంజనీరింగ్ కాలేజీలకు ప్రాధాన్యం ఇచ్చి కొత్త Arts Colleges ప్రారభించకుండాను, ఉన్నవాటిలో విద్యార్థుల సంఖ్య పెరగకుండాను చేయాలని కోరుతున్నాను.

ఆంధ్ర, తెలంగాణాలలోని services ను గురించి ఒక్క విషయం చెప్పవలసిఉంది. States Reorganisation సమయంలో ఇక్కడవారికి కొన్నిహామీలు ఇవ్వడం జరిగింది. తెలంగాణాలో సర్వదేశాఖలకు ఇక్కడివారినే promote చేసి, వారికి ఇక్కడి scales ఇవ్వాలి. ఆంధ్రలో సర్వదే శాఖలకు అక్కడివారినే promote చేసి, అక్కడి scals ఇస్తే, ఆంధ్ర తెలంగాణా feelings అసలు ఉద్భవించవే ఉద్భవించవు. ఇక్కడ సర్వదే శాఖలకు అక్కడివారిని, అక్కడ

ఏర్పడే ఖాళీలకు ఇక్కడవారిని భర్తీచేసే విధానాన్ని అరికట్టవలసినదిగా మంత్రి గారిని కోరుతున్నాను.

ఉస్మానియా యూనివర్సిటీ కార్మికుల సమస్యలను, వారికోర్కెలను పరిష్కారం చేయడానికి ప్రభుత్వం ఆయూనివర్సిటీకి తగిన grants ఇవ్వాలి ఆవిధంగా grants ఇచ్చి అక్కడి ఉద్యోగుల, కార్మికులకోర్కెలను యూనివర్సిటీ వారు మన్నించేటట్లుకూడ ప్రభుత్వం తగినచర్యలు తీసుకోవాలని తమ ద్వారా మనవిచేస్తున్నాను.

* శ్రీ పి రామచార్యులు (ధర్మవరం—జనరల్) : అధ్యక్షా, ఈ దినం ఇన్ని వివరములతో ఇన్ని కోట్ల రూపాయల డిమాండును ప్రతిపాదించిన గౌ. విద్యామంత్రిగారిని అభినందించుచున్నాను

కళాశాలల సంఖ్య పెరుగుచున్నది. హైస్కూళ్ల సంఖ్య గూడ వృద్ధి అగుచున్నది ప్రాథమిక పాఠశాలల అభివృద్ధిని గూర్చి చెప్ప పనిలేదు. ఇంతయు సంతృప్తికరముగానే కనబడుచున్నది ముందు సంవత్సరమునకు బడ్జెట్‌లో 12 కోట్ల రూపాయలు అనగా మొత్తము ఆదాయములో ఐదింట ఒక పాలు విద్య నిమిత్తము ఖర్చు పెట్టుటకు అంచెనా వేయబడినది. ఇది యేటా యేటా ఇట్లే పెరుగుననుటకు సందేహము లేదు. ఇంతైనను మనదేశమునందలి ప్రజలనందరను అక్షరాస్యులుగానైన చేయలేకపోతున్నాము. కావున ఈ ఖర్చునకు తగిన ఉపయోగమున్నదా అని ఆలోచించుట ఎంతైనా అవసరము.

'భారతమొక జాతి' అను తన గ్రంథములో అనిబిసెంటు ఈస్టిండియా కంపెనీవారు ఈ దేశములో నడుగు బెట్టక ముందు ప్రజలలో నూటికి 60 మంది వ్రాయ చదువ నేర్వగలిగియుండిరని వ్రాసినది. కాని ఈ రెండు వందల సంవత్సరములలో అక్షరాస్యత మనదేశములో చాల దిగజారిపోయినది. ఇప్పుడు నూటికి ఇరువది మందియైనను చదువుగలవారున్నారో లేదో అనుమానమే. స్వరాజ్య ప్రభుత్వము పది సంవత్సరములలో ఈ దేశములోని నిరక్షరాస్యతను పోగొట్టవలెనని సంకల్పించినది. అందునిమిత్తము వయోజన పాఠశాలలను గూడ స్థాపించినది కాని ఈ ప్రయత్నమేమైనది ? ఈ పదేండ్లలో నూటికి నలుగురు వంతుననైనా అక్షరాస్యుల సంఖ్య పెరిగినదా ? లేదనియే చెప్పక తప్పదు. ఒకవేళ పెరిగినదని ఒప్పుకొన్నను ప్రజాసంఖ్య ఈ పదేండ్లలో నూటికి 12 వంతున పెరిగినదికదా ? కావున ఈ విద్యా వ్యాప్తి యొక్క మందగతి ప్రజాభివృద్ధియొక్క వేగమును దాటుకొని అందరను విద్యావంతులుగాచేయుట ఈ యుగములో జరుగదని చెప్పక

తప్పదు. మన దేశములోని విద్యావ్యాప్తి మామూలు గణితశాస్త్రమును అనుసరించుచుండగా జనసంఖ్య పెరుగుదల క్షేత్రగణితమును (geometry) అనుసరించుచున్నది కావుననే దీనిని అది లోగొనుట ఎన్నటికిని సంభవింపదని యంటిని. 12 కోట్లు కాదుగదా ఏడాదికి 100 కోట్లు ఖర్చు పెట్టినను ఈ పద్ధతిలో మనము కృతార్థులము కాజాలము. జపాన్ 30 సంవత్సరములలోపల తన ప్రజలందఱను అక్షరాస్యులుగా చేసికొన్నది. మనము క్రొత్తత్రోవలు త్రొక్కుటకు జంకుచున్నాను. బ్రిటిష్‌వారు ఏర్పరచిన గాడి లోనే మన విద్యావిధానము నడచుచున్నది గంగలో మనము స్నానము చేయవలెనుకాదెదము గాని థేమ్సు నదిలో మునకలు వేయుచు దాని దుర్గంధమును సహించుచున్నాము. మన ప్రాచీన పద్ధతులు పనికిరావని త్రోసివేసినాము జాతీయ భావాభివృద్ధి కావలెనని పెద్ద ఉపన్యాసములు చేయుచున్నాము కాని విద్యా విషయమున నీ విదేశీయ పద్ధతిని వదలజాలకున్నాము. ఇందువలన, 'నూనెకు నష్టియే గాని విద్యకు పుష్టి లేదన్'ట్లున్నది. కాలేజీకి భవనములు, హైస్కూళ్లకు భవనములు, ప్రాథమిక పాఠశాలలకు భవనములు—ఈ విద్యావ్యయములో సగము ఖర్చు ఈ భవన నిర్మాణములకగుచున్నది. చలి దేశములలో ఇట్టి భవనములావశ్యకములేమో గాని మనదేశములో అవి అనవసరములు. మన పెద్దలు గుడిలో చావడిలో చెట్లనీడను విద్య నభ్యసించిరి. రవీంద్రనాథ టాగూరు వంటి మహానుభావుడు తన శాంతినికేతన విశ్వకళా పరిషత్తును ఉద్యానవనములో చెట్ల నీడను కొనసాగించినప్పుడు మనము భవనములున్నగాని బడులు నడువవని తలంచుటలో నర్థమున్నదా !

ఈ విద్యకు గురియేది ? విద్యార్థులు విజ్ఞానవంతులగుటకిది ఉపకరించుచున్నదా? పూర్వము వీధి బడులలో చదివిన బాలురు చక్కగా నీతి పద్యములు చదువుచుండిరి. ఎన్నో పద్యములు వారికి కంఠతా వచ్చుచుండెను. మరి ఇప్పుడు స్కూలు ఫైనల్ ప్యాసయినవాడుగూడ ఒక్క పద్యమును అర్థవంతముగా చదువలేడే ! చదువు—చావ అని దంత తాలవ్యములు విభేదము లేకుండచేయువారి ఉచ్చారణము అనర్థకారణమును అసహ్యమును అగుచున్నది.

ఈ బేసిక్ విద్య (ఆధార విద్య) యన్నది నిరుపయోగమని వృథావ్యయము కాతువని ప్రభుత్వము ఎఱుగజాలకున్నది. ప్రజలకు దాని మీద విశ్వాసము లేదని ప్రభుత్వము గమనింపకుండుట శోచనీయము. ఫిలిప్పైయన్స్ రాజ్యములో ఒక్కొక్క విద్యార్థికి గవర్నమెంటు హైస్కూళ్లలో ఐదు ఎకరముల భూమి

ఇయ్యబడునట! దానికి నీటి పారుదల సౌకర్యముగూడ నుండును. ఆ విద్యార్థి తన పాలికి వచ్చిన భూమిలో వ్యవసాయము చేసి తన బడి ఖర్చులు తిండి ఖర్చులు సంపాదించుకొనును. అట్టి విద్యార్థులు ఒళ్లు వంచి పని చేసెదరు వారు వ్యవసాయవిద్యలో ప్రవీణులగుదురు. ఫిలిప్పియన్స్ వెళ్లిన ఒక ఉన్నతోద్యోగి ఈ వివరములను తెలియజెప్పినాడు.

కాని మన విద్యార్థులు హాస్టళ్లలో తమ ఇంట లేని సౌఖ్యములను కోరెదరు. ఇంజనీరింగు హాస్టలులో తిండి ఖర్చు ఒక్కొక్క విద్యార్థికి నెలకు 70,75 రూపాయలగును. మరి ఈ విధముగా తిన నేర్చిన విద్యార్థి ఎట్లు కష్టపడి చదువుగలడు? కాక వారు తరువాత కష్టములనెట్లోర్వగలరు?

ఈ ఎలిమెంటరీ స్కూళ్ల ఉపాధ్యాయులలో చాలమందికి బోధనాశక్తి చాలకపోగా తాము నేర్చినది గూడ అతిస్వల్పమే. ఒక ట్రెయినింగు స్కూలు విద్యార్థి ఆ తరగతి ఉపాధ్యాయుడెంత చెప్పినను కర్త కర్మ క్రియలు తెలిసికోలేక పోయెనట! ఉపాధ్యాయుడు విసిగికొనగా ఆ విద్యార్థి సరే తెలిసినది లెమ్మనెనట! ఏదో చెప్పమనగా ఆ విద్యార్థి ఇట్లనెనట! "తాము విద్య నేర్పుటకు కర్తలు? చదువు రానిది మాకర్మ, తాము చెప్పుటను ఇంతటితో చాలించుకొంటే అదీ క్రియ" అని ఇట్టి ఉపాధ్యాయులెందరో కలరన్నను అతిశయోక్తి కాదు. రాన్రాను ఇట్టి అల్పజీతములకు యోగ్యత కలవారెట్లు రాగలరు?

నేను మొదట చెప్పినట్లు ఈ విద్యా పద్ధతి ఇట్లే కొనసాగినయెడల ఈ యుగములో మనదేశమున నిరక్షరాస్యత క్షీణింపదు. వేయి కోట్లు ఖర్చయినను మన కోరిక నేరవేరదు. ఈ పని యంతయు నెత్తిన వేసుకొని గవర్నమెంటు ఎందుకీబాధ్యత వహింపవలెను? ప్రభుత్వము ప్రాథమిక స్కూళ్లను హైస్కూళ్లను కాలేజీలను కంట్రోలులో పెట్టుకొన్నది. వానిలో చదివి కడతేరిన గానీ విద్యార్థులు కృతార్థులుగారు. నిత్యమును పెరిగి వచ్చు విద్యార్థుల సంఖ్యకు తగిన స్కూళ్లను కాలేజీలను గవర్నమెంటు నిర్మింపజాలకపోగా పైగా ఆ స్కూళ్లలో చదివినగానీ వారికి గతులు లేవని నిర్బంధించినది. ఇదేమి న్యాయము? ఇతర దేశములలోని పద్ధతి వేరు విధముగానున్నది. ఎందరో విద్యార్థులు పిన్నలు పెద్దలు ఆ దేశములలో ప్రయివేటుగా చదివి ఉన్నత పరీక్షలలో ప్యాసగుచున్నారు. వారు ఏవో చిన్న ఉద్యోగములు చేసి విశ్రామకాలములలో చదివి ఉన్నత పరీక్షలు ప్యాసగుచున్నారు. మన దేశ వాసులు గూడా అమెరికాకు వెళ్లి సంపన్నగృహస్థుల ఇండ్లలో పనియము

చిక్కినప్పుడు చాకిరీ చేసి అట్లువచ్చిన ధనముతో విద్యావ్యయమును భరించుకొనుచున్నారు. మన దేశమున గూడ అట్టి విధానమెందుకు పెట్టరాదు ? పాఠ్యపుస్తకములను ప్రచురింపుడు, కావలసియున్న పరీక్షలను కఠినముగా చేయుడు, వలదనను కాని విద్యార్థులు ఫలానాచోటనే ఫలానా సమయములో చదువవలెనను నిర్బంధమును తొలగింపుడు.

ప్రతి యేటను ఎందరో ఉపాధ్యాయులు రిటైర్ అగుచున్నారు. అట్టివారు పనిలేక, జీవనము జరుగక నిర్వ్యాపారులై ఆయుస్సును క్షీణము చేసుకొనుచున్నారు ఇంకను నిరుద్యోగులైన ప్రతిభావంతులెందరో యున్నారు. ప్రయివేటుగా చదివి, పరీక్షలకు కూర్చొనునవకాశము కల్గించినయెడల వేనవేలు మంది కృతార్థులు కాగలరు. పనిలేని పండితులకు పెన్షనర్లకు పని అబ్బగలదు. 'స్కూళ్లు లేవు క్రొత్తవి స్థాపించుడు" అని ప్రజలు పదేపదే పీడింపరు. పూర్వమున కాశీలో అనేకశాస్త్రములు చదివి దిగ్దంతుల వంటి పండితులు కవులు ఉదయింపలేదా ?

ఇంతకూ ఈ పరీక్ష పద్ధతి మనదేశమున ప్రవేశించి ఎన్నియో అనర్థములకు దారి తీసినది. మనవారి ప్రాచీన పద్ధతి ఇది కాదు. ఏ ఉపాయము చేతనైనను మార్కులు సంపాదించుకొని కడతేరు పద్ధతి ఇది. తాత్కాలికముగా పరీక్షా సమయములలో విద్యార్థులు నోట్సు చదివి మార్కులు గడింప ప్రయత్నింతురు గాని వారు చదివిన విద్య వారిలో జీర్ణమై చిరకాలము నిలువదు. లోపభూయిష్ఠమైన ఈ పద్ధతులను సవరించి మనదేశమునకనువగు రీతిని విద్యాబోధన పద్ధతిని సంస్కరించకపోయిన యెడల ఆ ట్రెయినింగు విద్యార్థి నుడివిట్లు కోటానుకోట్ల రూపాయలను వెచ్చించుటకు ప్రభుత్వము కర్త, వాని ఉపయోగము ప్రజలు పొందజాలనిది వారి కర్మ, ఇంతటితో ఈ విద్యాపద్ధతిని విరమించుకొనుట క్రియ అగును.

శ్రీ పి. వి. నరసింహారావు (మంథాని): అధ్యక్షా, గౌరవనీయులైన విద్యామంత్రిగారు ఇచ్చినటువంటి సుదీర్ఘమైన, కావ్యమయమైన, ఉపన్యాసాన్ని చాలా శ్రద్ధగా విన్నాను. చాలా విషయాలు వారు చెప్పారు. ఆ విషయాలు అన్నీ, మా చేతికి అందించిన ఈ లావుపాటి బడ్జట్ పుస్తకంలో, మూర్తీభవించి [illegible] మేము చాలా సంతోషించేవాళ్ళము.

ఇప్పుడు ఈ విద్యాశాఖకు కేటాయించిన ధనాన్ని బట్టి చూస్తే, కొన్ని విషయాలు [illegible]. 1957-58 లో ఆంధ్రప్రాంతానికి 818 [illegible].

తెలంగాణా ప్రాంతానికి 504 లక్షలు, తరువాత, revised estimates లో 1957-58 లో ఆంధ్ర ప్రాంతానికి 640 లక్షలు ఖర్చు అయినట్లు, తెలంగాణాలో 640 లక్షలు ఖర్చుఅయినట్లు, మరి ఈ సంవత్సరం 1958-59 ఆంధ్రప్రాంతానికి 671 లక్షలు, కేటాయించబడినట్లు, తెలంగాణాకు 497 లక్షలు కేటాయించినట్లు, స్పష్టంగా కనబడుతున్నది. దీనివల్ల గత సంవత్సరం తెలంగాణాకు కేటాయించిన 504 లక్షలలో 64 లక్షల రూపాయలు ఖర్చుకాకుండా మిగిలిపోయింది అని తేలుతున్నది. గత సంవత్సరం తెలంగాణాకు కేటాయించిన 504 లక్షల కన్నా ఈ సంవత్సరం 7 లక్షలు తక్కువ కేటాయించబడినది అని తెలుస్తున్నది. ఈ రెండు విషయాలు గమనిస్తే, గత సంవత్సరం 64 లక్షల రూపాయలు మిగల డానికి కారణం ఏమిటి? మరి ఈ సంవత్సరం గత సంవత్సరంకన్నా తక్కువగా కేటాయించడానికి కారణం ఏమిటి? ఈ రెండు ప్రశ్నలు ఉద్భవిస్తున్నాయి. ఆలోచిస్తే, బహుశః తెలంగాణా ప్రాంతానికి విద్యాసౌకర్యాలు, అంతగా అవసరం లేవేమోనని ఒక జవాబు కావొచ్చు. లేక అవసరం ఉన్నది అని అను కుంటే, ఏదో ప్రత్యేక పరిస్థితులవల్ల ఈ సంవత్సరం ఖర్చు పెట్టలేకపోయ్యారు అనేది, ఇంకొక జవాబు కావొచ్చు పోనీ, మొదటి జవాబు నిజం అయినదని అనుకుందామా అంటే, ఈ తెలంగాణాలో ఉన్న అక్షరాస్యుల సంఖ్యను బట్టి చూస్తే చాల అన్యాయంగా ఉన్నది అక్షరాస్యత చాలా తక్కువగా ఉన్నది. మొత్తం తెలంగాణాలో 8 లక్షల అక్షరాస్యులకన్నా ఎక్కువ లేరు. ఒక కోటికి పైబడిన జనాభాలో 8 లక్షల మంది మాత్రమే ఉన్నారంటే, ఇక్కడ అక్షరాస్యులు ఎంత తక్కువగా ఉన్నారో, ఊహించుకోవచ్చు. కాబట్టి, తెలం గాణా ప్రాంతానికి వెంటనే విద్యా సౌకర్యములు ఎక్కువగా ఇవ్వడం, అవసర మనే విషయం, స్పష్టంగా కనబడుతున్నది. కాని ఇవ్వడం మాత్రము జరగలేదు. అంతేగాక గత సంవత్సరం, ఏవో కారణాలవల్ల ఇవ్వలేదని మంత్రిగారు, తమ ఉపన్యాసములో చెప్పారు వారు చెప్పిన విషయం నిజమే అనుకుందాము నేను వారి చిత్తశుద్ధిని గాని, వారి sincerity ని గాని శంకించడం లేదు. నేను వారి విషయంలో చాల మంచి అభిప్రాయం కలిగి ఉన్నాను. కాని ఎంతవరకైతే, వారి చిత్త శుద్ధి, వారి సానుభూతి కొన్ని అంకెల రూపంలో, ఈ బడ్జెటు పుస్తకంలో మూర్తీభవించవో, అంతవరకు నేను శంకించకపోవడంగాని, లేక వారు సానుభూతిని ప్రదర్శించడంగాని, అంత ఉపయోగకరం కాదేమోనని, నేను అనుకుంటున్నాను. కాబట్టి గత సంవత్సరం కన్నా ఈ సంవత్సరం 7 లక్షల రూపాయలు తక్కువగా కేటాయించే అవసరం ఎందుకు వచ్చిందో, వారు తెలివిస్తే, దాని నాకు వేళ్లైనా కొంత సంతృప్తి పడాలని అనుకుంటున్నాను.

కొన్ని ప్రత్యేక కారణాలవల్ల లేక integration వల్ల లేక కొన్ని ప్రత్యేక సమస్యల దృష్ట్యా, మేము 64 లక్షల రూపాయలు ఖర్చు పెట్టలేకపోయాము అన్నప్పుడు, ఈ సంవత్సరం తప్పకుండా, అంతకన్నా ఎక్కువగా ఖర్చుపెట్ట డానికి కృతనిశ్చయులమై ఉండవలసింది. కాని 7 లక్షలు నిరుటికే తక్కువయి నదే అంటే, ఈ సంవత్సరంకూడ, ఇదివరకు ఉన్న పరిస్థితిలోనే, తెలంగాణా ప్రాంతం ఉండిపోతుందని, అనుమానించడానికి, సంపూర్ణంగా ఆస్కారం కలుగు తున్నది.

కాబట్టి ఈ విషయాలన్ని పరిశీలించి, ఇప్పటికైనా, Supplementary Demands ద్వారా, తెలంగాణా ప్రాంతానికి, అవసరమైన విద్యా సౌకర్యాలు ఇతోధికంగా కల్పించడానికి, శాసనసభముందు మంత్రిగారు demand ను తీసుకువస్తారని, ఆశిస్తున్నాను. ఆ విధంగా తెలంగాణా ప్రాంతానికి, కావలసిన సౌకర్యాలు చేస్తామని వారు అంటే, శాసనసభవారు సహర్షంగా ఆమోదిస్తారని కూడ నేను విశ్వసిస్తున్నాను

బడ్జెట్‌లో చాల వివరాలున్నవి. ఆ వివరాలన్నింటిని నేను మరింత శ్రద్ధతో పరిశీలించినాను. తెలంగాణాలో ఇదివరకు Domestic Science కు ఒక institute వుండేది. దానికొరకు గత సంవత్సరము 50 వేల రూపాయలు ఖర్చుపెట్టడము జరిగింది. ఈ సంవత్సరము దానికి ఒక్క కాని అయినా ఇవ్వ డము జరుగలేదు ఈ విద్యాసంస్థను ఎత్తివేసినారో లేక దాని పర్యవసాన మేమిటో నాకు తెలియదు. కాని బడ్జెట్టులో వున్న వివరాలను బట్టి చూస్తే ఇదివర కున్న సంస్థలను ఎత్తివేయడము జరుగుచున్నది. అంతేగాక, తెలంగాణా ప్రాంత ములో యీ సంవత్సరములో ఒకే ఒక సెకండరీ స్కూలును తెరిచినామని మంత్రిగారి ఉపన్యాసమువల్ల బోధపడుతుంది. ఒకే ఒక స్కూలు తెరచినామనే దానికిని తెరువనేలేదనే దానికిని అంతతేడా వుండదేమోనని అనుకుంటున్నాను. తెలంగాణా ప్రాంతము వెనుకబడి వున్నదని తెలిసి కూడా, దానిని గుర్తిస్తూ కూడా యీ ప్రాంతములో ఎక్కువ విద్యాసంస్థలను నెలకొల్పడములేదు. తెలంగాణాలో ఎన్ని విద్యాసంస్థలు, ఎన్ని టెక్నికల్ సంస్థలు తెరువడము జరి గినది ? తెలంగాణా ఎంతవరకు ముందుకుపోయింది? అనే విషయము పరిశీలించవ లసి వస్తుంది. ఆ దృష్టితో ఆలోచించి, ఇక ముందైనా సరియైన కార్యక్రమ [illegible] నేను సూచిస్తున్నాను. ఇప్పుడు తెలంగాణాలో ప్రతిజిల్లా [illegible] తెరువడము జరిగింది. [illegible] [illegible]

తెలంగాణా వెనుకబడివున్నది కాబట్టి ఎంత తొందరగానైనా సరే కళాశాలలు వుండితీరాలనే సద్భావనముతో తెరచినాము. ఆ కళాశాలలు తొందరలో తెరచినటువంటివి కాబట్టి వాటికి సరియైన సౌకర్యాలు లేవు. వాటికి సరియైన భవనాలు లేవు. అట్టే డబ్బు కూడా లేదు. Public speeches లో ఈ కళాశాలలకు బిల్డింగులు లేవని ఇవి సప్లయి గొడౌన్స్‌లో వున్నాయని బోర్డులు కట్టడానికి కూడా స్థలములేదని చెప్పడము తప్ప యీలాగున్న కళాశాలల పరిస్థితిని బాగు చేయడానికి కనీసము Block-grants ఐనప్పటికీ తలా ఒక లక్షో, రెండు లక్షలో 50 వేలో లేక 60 వేలో ఎంతో కొంత మనకు వీలున్నంత యిచ్చినట్లయితే కనీసము యీ కళాశాలలు కొంతవరకు బాగుపడడానికి వీలువుండేది. ఈ డబ్బైనా యివ్వకుండా ఉపన్యాసాల ధోరణి ఆ విధంగా వుంటే చాల కష్టమనిపిస్తుంది. Private management ద్వారా స్థాపింపబడిన 6,7 కాలేజీలు తెలంగాణాలో వున్నవి వాటికి ఉజ్వలమైన భవిష్యత్తు వుందని చెప్పడానికి సందేహము లేదు కాని ప్రస్తుతానికి 3,4 సంవత్సరాలవరకు తమ కాళ్ళపై తాము నిలుచుకొనే పరిస్థితిలో లేవు. ఇక్కడే కాదు, గుంటూరులో కాని బొంబాయిలో కాని ఢిల్లీలో కాని ఏ కళాశాల ఐనాసరే, ఏ సంస్థ ఐనా సరే అది start అయిన వెంటనే దానికి ఆర్థికస్తోమత వుంటుందని అనుకోడానికి వీలులేదు. కాబట్టి శైశవావస్థలో వున్నటువంటి యీ కళాశాలలకు ఇపుడు ఇతోధికంగా ఆర్థిక స్తోమత పెంచడము చాలా అవసరము. ఈ విషయంలో సుహృద్భావముతో ఆలోచించి సానుభూతిని ప్రదర్శించి Supplementary Demands లో నైనా సరే కొంత డబ్బు కేటాయిస్తారని ఆశిస్తున్నాను. ఇంకొక్క విషయము, తెలంగాణాలో టెక్నికల్ ఇన్‌స్టిట్యూషన్‌లు చాల తక్కువగా వున్నవి. ఈ వివరాలను బట్టి చూస్తే ఏడు మాత్రమే వున్నవని తెలుస్తున్నది. సాంకేతిక శిక్షణ చాల అవసరమని సభ్యులందరూ చెప్పినారు. అందులో సందేహమేమీ లేదు. కాబట్టి వెనుకబడివున్న ప్రాంతానికి అలాంటి శిక్షణ సౌకర్యాలు వెంటనే కల్పించవలసి వుంటుంది. డబ్బులేదని చెప్పడము చాల సులభమైనప్పటికీ ఉన్న డబ్బుతో వీలున్నంతవరకూ వెనుకబడిన ప్రాంతాలను ముందుకు తీసుకురావడానికై ప్రయత్నాలు చేస్తున్నామని చూపించడము అవసరమని నేను అనుకుంటాను. ఇప్పుడు తెలంగాణా రీజినల్ కమిటీ ఒకటి వున్నది. నేను సూచించేదేమిటంటే ఆ రీజినల్ కమిటీలో ఒక సబ్-కమిటీని కేవలము యీ విద్యావిషయములు కొరకు వేసి ప్రభుత్వము ఆ కమిటీతో సంప్రదించి తగిన చర్యలు తీసుకుంటే చాల బాగుంటుంది. తెలంగాణా రెండు విషయాలలో వెనుకబడివున్నదని అందరికీ తెలిసినదే. ఒకటి ఆర్థిక వ్యవహారాలలో, రెండవది విద్యా సౌకర్యాలలో.

ఈ రెండు విషయాలను మనము సరిగా పరిష్కరించడంద్వారా తెలంగాణా వెనుకబడినదనే నినాదము ఎంత తొందరగా సమాప్తమైతే ఆంధ్రప్రదేశ్‌కు అంత మంచిదనుకుంటాను.

* ఆర్. బి. రామకృష్ణయ్యరాజు - అధ్యక్షా, ఈ విద్యాశాఖను నిర్వహించడము చాల కష్టము. ఏ శాఖలోనైనా కూడ దృగ్గోచరంగా సద్యః ఫలాన్ని సంపాదించడము సులభము. ఒకరోడ్డు వేయడము కాని, ఎలెక్ట్రిసిటీ తెప్పించడము కాని చెరువులు త్రవ్వించడము కాని-ఇవన్నీ చేయడము చాల సులభము అందులో ఫలితాలు స్పష్టంగా ఏర్పడుతూ వుంటాయి. ఐతే, యీ విద్యాశాఖ ఆత్మవికాసానికి సంబంధించినట్టిది, కాబట్టి వయస్సు పెరిగే కొద్ది ఆత్మవికాసము కావలసిందే కాని ఇంకొకవిధంగా జరిగేది కాదు. అయితే, ఇటువంటి spectacular result కావాలంటే ఒకవిధంగా మాత్రము విద్యాశాఖ మంత్రిగారు దానిని సంపాదించవచ్చును. ఈ ఆత్మవికాసానికి సహాయం చేసే టటువంటి వారగు ఉపాధ్యాయులందరికీ సంతుష్టి కలుగజేసినట్లయితే అపుడు spectacular result వస్తుందని చెప్పడానికి ఏమీ సందేహము లేదు. ఈ విషయంలో గతసంవత్సరం మన ప్రభుత్వము వారికి కొంత సహాయముచేసింది. రాబోవు సంవత్సరంలో కూడా ఎలిమెంటరీ స్కూలు టీచర్లకు సెకండరీ స్కూల్ టీచర్లకు సహాయము చేయడానికి కూడా ప్రభుత్వము పూనుకొన్నదని మంత్రిగారు సెలవిచ్చినారు. ఈ విషయంలో ఇంకా కొన్ని వివరాలు చక్కగా చెప్పితే ఉపాధ్యాయ లోకము చాల సంతోషించునని నా అభిప్రాయము. ఎంత పెంచబోతున్నారు? అది ఎపుడు చేయబోతున్నారనేటటువంటి విషయాన్ని కొంచెము వివరంగా తెలియజేయాలని మనవి చేస్తున్నాను. Education department ఒకదానిలోనే కాదు, గవర్నమెంటు డిపార్టుమెంటులు అన్నిటిలో కూడా కార్యములో చాల జాప్యము జరుగుతుంది ఏదైనా ఒక పెటిషన్ కాని ఒక జాబు కాని వ్రాస్తే దానిమీద జరిగేటటువంటి కార్యము చాల నిదానముగా జరుగుతుంది. ముఖ్యంగా ఒక విషయం మంత్రిగారి దృష్టికి నేను ఒక short notice question ద్వారా తెచ్చినాను. గత జూలై మాసములో మావూరిలో ఉన్నటువంటి బేసిక్‌స్కూల్‌కు కావలసినటువంటి భూమిని సంపాదించడానికి, కట్టడములు కట్టడానికి గవర్నమెంటు 1,80,000 రూపాయలు sanction చేసింది. అది యీ మార్చి లోపలనే పూర్తి కావాలనికూడ ఆజ్ఞాపించినారు. మన బేసిక్ స్కూల్ చాల అభివద్ధి చెందుతుందని మేమంతా సంతోషించినాము. కాని ఆ 1,80,000 రూపాయలు ఏవిధంగా కూడా ఇంకా ఖర్చు కాకుండా నిరుపయోగమైపోతుంది. ఈ 1,80,000 రూపాయలు ఖర్చుచేయక

పోతే అది పోతుందని వారే చెప్పినారు. దీనికెవరు బాధ్యులో మంత్రిగారు దీనినిగురించి సక్రమంగా విచారించవలసిందని నేను మనవిచేస్తున్నాను 1,60,000 రూపాయలు గవర్నమెంటు sanction చేసిన డబ్బువుంటే, అక్కడ కట్టడాలు కట్టడానికి మనుష్యులు సిద్ధంగా వుంటే, ఎందుకీ కార్యములో ఇంత జాప్యము జరిగింది ? దీనికెవరు కారకులని విచారించవలసివుంటుంది. మేము కలెక్టర్ గారికి వ్రాస్తే నాదగ్గర కాగితమేమీ లేదు అంటున్నారు. విద్యాశాఖాధికారులకు వ్రాస్తే మేము కలెక్టరుకు వ్రాసినాము కలెక్టర్‌నుంచి జవాబు రాలేదంటున్నారు అది ఎవరిమధ్య ఆలస్యము జరిగిందో మంత్రిగారు విచారించవలసిందని వారిని ప్రార్థిస్తున్నాను ఈ 1,80,000 రూపాయలు అటు ఖర్చు కాకపోతే యీ స్కూల్ ఇంతటితో పోవలసినదేనా ? దీనినిగురించి జరుగబోయే సంవత్సరంలో ఏదైనా ప్రత్యేక ప్రయత్నము చేస్తారా ? ఈ మొత్తాన్ని రాబోయే సంవత్సరంలో యిస్తారా అనే విషయాన్ని గురించి నేను అడుగుచున్నాను. దీనికి సరియైన సమాధానము చెప్పమని మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను.

ఈ సంవత్సరం మా తప్పువల్ల కాదు, స్కూలు తప్పువల్ల కాదు, ప్రభుత్వ డిపార్టుమెంటులో జరిగిన జాప్యంవల్ల ఈ ఆలస్యం జరిగింది కాబట్టి ఈ తప్పును వారే సరిదిద్దుకొని ఈ పాఠశాల నిర్మాణం కావడానికి మరల ప్రయత్నం చేస్తారని నేను ఆశిస్తున్నాను ట్రయినింగ్ స్కూల్సు మామూలు పద్ధతిలో ఉండే ట్రయినింగ్ స్కూల్సుగా కాకుండా బేసిక్ స్కూల్సు కావాలనే పద్ధతి మన దేశంలో సుస్థిరంగా ఏర్పడి యున్నది. అటువంటి పద్ధతిని చక్కగా నిర్వహించడానికి కావలసిన సౌకర్యాలన్నీ గవర్నమెంటువారు సమకూర్చి, అటువంటి స్కూలును పాడుచేయకుండా కావలసిన సౌకర్యాలను ఏర్పాటు చేస్తారని ప్రార్థిస్తున్నాను. ఉపాధ్యాయవృత్తి చాలా కష్టమైన వృత్తి అని అందరికి తెలుసును. ఉపాధ్యాయునికి అంతస్థు ఒకటి ఉండవలెననేది నిర్వివాదం. అందులో ముఖ్యమైనది వయస్సు. ఇదివరలో లోయర్ గ్రేడు, హయ్యరు గ్రేడు ట్రయినింగ్ ఉండేటప్పుడు తయారైన ఉపాధ్యాయులు ఎటువంటివారో మనకు తెలుసు. మేము చిన్నప్పుడు చదువుకునే రోజులలో సుమారు 25 సంవత్సరాలు వయస్సు కలిగిన ఉపాధ్యాయుడు, మంచి ఆకారపుష్టికలవాడైనా, మేమందరమూ ఆ అయ్యవారిని పిల్ల అయ్యవారనేవారము. అంటే మా అభిప్రాయము, అయ్యవారంటే కొంచెం వయస్సు ఉండవలెనని. ఆతణ్ణి చూస్తే పసివాడుగా ఉన్నాడు అని హేళనగా చూచేవారము. ఇప్పుడో పాలు కారే వారందరు ఉపాధ్యాయులై పోతున్నారు. తగిన వయస్సులో ఉన్నవారిని ఉపాధ్యాయులుగా చేసే ప్రయ

త్నంగా స్కూలుఫైనల్ వరకు చదువుకొనవలెనని మితం పెట్టియున్నారు. ఆ మితాన్ని చక్కగా గమనించి పిల్లకాయలకు ఉపాధ్యాయుని చూస్తే వారి యందు గౌరవం ఉంటే in discipline కూడా పోతుందనే అభిప్రాయం ఉన్నది దానిని ఎట్లా చేయవలెనో గమనించవలెనని గవర్నమెంటువారిని ప్రార్థిస్తున్నాను పాఠశాలలు విశేషముగా పెట్టవలెనా లేదా అను విషయమున్నది Single teacher schools ను అక్కడక్కడ ఏర్పాటు చేశారు, అవి ఎంతవరకు పని చేస్తున్నవనే విషయంలో చాలావరకు సందేహాలున్నవి, అభిప్రాయభేదాలున్నవి ప్రాథమిక పాఠశాలలన్నింటిని కూడా గవర్నమెంటువారే స్వాధీనం చేసుకోవాలని ఒక ప్రయత్నం జరిగింది. చట్టం ప్యాసుఅయినది కొంతవరకు అమలు జరుగుతున్నది. వచ్చేసంవత్సరం ఏమైనా అమలులో పెడతారా అనే విషయం మంత్రిగారు తమ ఉపన్యాసంలో సెలవివ్వలేదు. విద్య వృద్ధి కావాలంటే మన దేశంలోని విద్యావిధానం ఒక్కవిధంగా సర్వడి, మేనేజిమెంట్లు అన్నిపోయి ఒక మేనేజిమెంటు క్రిందకు వచ్చి, ఆ మేనేజిమెంటు గవర్నమెంటు మేనేజిమెంటుగా ఉండడానికి కావలసిన డబ్బు సౌకర్యాలు కలుగజేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ప్రాథమిక పాఠశాలలన్నీ- ఎయిడెడ్ స్కూళ్ళు, జిల్లాబోర్డు స్కూళ్ళు. పంచాయితీ స్కూళ్ళు, ఇంకా ఇతరమైన స్కూళ్లు- వీటన్నింటిని ఒకే సంస్థక్రిందకు, ఒకే విధానం క్రిందకు తీసుకురావడం మంచిది. ఈ విషయమై ప్రభుత్వ అభిప్రాయమేమో, ఏమి చేయదలచుకున్నారో తెలియజేస్తే బాగుంటుంది అని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

**Sri Gopalrao Ekbote* (*Sultan Bazar*): Mr. Speaker Sir, education, as we all know, is a State subject. Though the Central Government cannot escape the responsibility still, it is State Government which is primarily responsible for the expansion and reconstruction of education. There are two equally urgent and important aspect of educational problems. One is, the need of large-scale expansion of educational facilities in order to bring millions of children who do not enjoy to-day the educational facilities; and the second is, the need to improve the technique and material of education and curricula methods. When we keep in view these two important aspects of educational problem and view the allotment of educational budget, then we see some glaring things which I want to bring to the notice of this House.

We are aware that the total revenue of the State, as has been shown in the budget is 63 65 crores, and out of this total revenue, the amount provided for education is 11 69 crores Roughly it comes to about 18 per cent. We all know Sir, that the Government of India had appointed a committee in 1950 to suggest the ways and means to finance the educational development in the country. That Committee suggested that the Central Government should allot or earmark 10 per cent of the revenue for the educasional reconstruction and the State Governments should earmark about 20 per cent of the total revenue for the education From that point of view, our State has not provided 20 per cent even for the educational expansion. So, the first suggestion I would like to make is that the 18 per cent allotted for educational expansion is insufficient for the reasons I am now coming to.

Now, if we subdivide the allotment of educational budget to Andhra and Telangana, it comes to about 6.71,— for Andhra, it is 16 per cent only, and for Telangana 49.82 i e., 20 per cent. As has been suggested by my friend Mr. Narasimha Rao, last year 25 per cent was provided but 5 per cent was not spent. This year 20 per cent is provided and, if the last year's performance is not repeated, then 20 per cent will have to be spent My feelings are, that 16 per cent is totally inadequate in view of the repuirements of that region, particularly the problem which we are facing, about the inadequate salaries which the primary school teachers are getting. I would therefore suggest that at least according to the suggestions made by the Ways and Means Committee, 20 per cent of the educational budget should be provided even for Andhra region. As I have been suggesting now and then, even for Telangana, in view of its backwardness, 25 per cent of the total revenue should be provided at least for another 5 to 10 years in order to bring that region also at par with the other region. If we now find out the sub-division of the educational budget for the various branches of education, we reach some of the very

useful conclusions. Out of this 11.69 crores for education, for primary education 6 45 crores has been allotted which comes to roughly 55 per cent of the educational budget; for secondary education 2.30 crores which comes to about 20 per cent of the educational budget and the University education gets 1 36 crores i.e , 9 per cent of the educational budget, while technical education gets 1 88 crores i e., 9 per cent and for the administration 83 lakhs are spent, which means 7 per cent of the budget. Now, if we compare this allotment of the educational budget for the different branches of education with Madras, West Bengal or Bombay which are supposed to be advanced States as far as elementary education is concerned, particularly Bihar, which is supposed to be an advanced State as far as basic education is concerned, two things become very clear And, as far as the primary education is concerned, the allotment of 55 per cent of the budget is totally inadequate Its inadequacy is further strengthened by the figures which I would presently quote. In Telangana we have got about 7000 primary schools where 5 lakhs of students are brought under education and that too of the age group of 6 to 11—11 to 14 I am not referring—while in Andhra, there are about 19000 primary schools wherein the total strength of the school-going children of the age group of 6 to 11 is 27,45,000, out of which only 15 lakhs or about 54.8 per cent are brought under the school. We are now told, as a consequence of the Second Five Year Plan, that by the end of the Second Five Year Plan, this 54 per cent will rise about 15 per cent more i.e-, 69.8 per cent, or roughly 70 per cent. Now if this pace of progress is to be pursued i.e., 3 per cent every year, the students to be brought of the age group of 6 to 11, we will require another ten years even for the age group of 6 to 11 to provide them the educational facilities which means, that by the end of 1972 we will be able to provide educational facilities only to those boys who fall within the age group of 6 to 11. We all know that Article 45 of the Constitution makes it obligatory on the State Government to provide educational facilities to the boys of

6 to 14 within 10 years of the commencement of the Constitution By 1960 we should have provided all the facilities But as has been told even by the Central Education Ministry, at the end of the Third Plan we will be able to provide educational facilities to students of the age group of 6 to 11. But our State would not even be providing facilities at the end of the Third Plan also and it will have to be extended even to the Fourth Plan. Those who are well-conversant with the resources of the State and the magnitude of the problem, will naturally feel anxious about the pace with which we are providing educational facilities. That has got to be accelerated. What I would suggest is—assuming that the Central Government's plan is correctly put before us and they expect that the age group of 6 to 11 will be provided educational facilities by the end of the Third Five Year Plan, our State Government also should make further allotment as far as primary education is concerned and increase it to 65 or 66-2/3 per cent as has been provided in other advanced provinces in India and provide two-thirds of the educational budget to the primary education, because it is a very important aspect of education as far as our democracy is concerned. If we do that, we will be able, at least to cover up the age group of 6 to 11 at the end of the Third Five Year Plan.

Now as regards the age group of 11 to 14 years, it is really very distressing to note that only about 20 per cent were brought under the educational facilities for the age group of 11 to 14 and as a consequence of the Second Five Year Plan, it will increase to about 29 per cent. Roughly therefore taking that we would be increasing about ten per cent facilities to the students and bringing about ten per cent of the population of the age group of 11 to 14 years during the school premises, even then the rest would be the 70 per cent. With this rate of progress they will require another 15 years to be brought under educational facilities. It means that by about 1977 we will be able to bring this age group of 11 to 14 within the educational facilities. If

that is the pace of progress which we are making, then we are not only flouting Article 45 of the Constitution, but we are denying educational facilities to at least 3 or 4 generations to come I would therefore suggest two things :

1 To reconsider the entire allotment of the budget and increase it by at least 20 per cent in both the regions.

2. The internal allotment to the various branches should be so adjusted that the primary education gets the maximum share of it, nothing less than two-thirds of the total revenue on education and so expand educational facilities in order to bring millions of students who are denied the opportunity to day even for primary education

Another aspect, I would like to bring to the notice of the House is that about 70 per cent of the students drop off at the second year or the primary education or at the most third year of the education The enormous waste thus caused in the matter of primary education even drives us to the one irressitible conclusion that whatever amount we are spending on primary education, actually results in spending only for those 30 per cent who can afford to go either to the secondary education or those 15 per cent who ultimately go to the University education. If this very heavy amount of two-thirds of the educational budget goes towards only 13 or 15 per cent of the society, then we have very soberly to pause and reconsider the entire problem. The second aspect which I had at the outset of my speech brought out viz., that we have to improve not only the curricula method, teaching material, and educational facilities but we have to attract many students and at least to see that they are kept in school for the minimum period of eight years of education should also be considered. If we do that, we will be not only fulfilling the Constitutional obligation, but also doing a great deal of service towards achieving new democracy which we are trying to build up.

*శ్రీ పి. సుందరయ్య (గన్నవరం): అధ్యక్షా, గత సంవత్సరము విద్యాశాఖ పద్దుపై నేను మాట్లాడినపుడు ఏసూచనలు చేశానో వాటిని గురించి మంత్రిగారు పరిశీలిస్తామని చెప్పినారు 9 నెలలు ఐనప్పటికూడా వాటిని ఇంకనూ పరిశీలించలేదు వారిచ్చిన వాగ్దానాన్ని యేమిచేశారో తెలుపగోరుతాను. 1955 మార్చి తరువాత విద్యాశాఖలో ఎట్టి అభివృద్ధి సాధించగలిగారో తెలియచేసే రిపోర్టులేవీ నాకు లభించలేదు గత రాత్రి 12 గంటలవరకూ వారు తయారుచేసిన ఉపన్యాసపారాన్ని నాకు వారు దయతో అందచేసినప్పటికీ దాని నుంచి నేను తెలుసకోగలిగినది కూడా స్వల్పమే- శాసనసభ హక్కులను పాటించవలెనని, వివిధ ప్రభుత్వశాఖల నివేదికలు శాసనసభ్యులకు ఎప్పటికప్పుడు అందజేస్తుండవలెననీ అనేక పర్యాయములు ప్రభుత్వమువారిని కోరి ఉన్నాను. గత సంవత్సరము నివేదికలను పార్లమెంటు సభ్యులకు తప్పక అందచేయవలెననీ పార్లమెంటు స్పీకరుగారు మంత్రులను గట్టిగా హెచ్చరించిన విషయము అందరకూ తెలిసినదే. మనకు మూడేండ్లనాటి రిపోర్టులు ఇంతవరకూ లభ్యము కాలేదు. ప్రాథమిక విద్య గురించి 1957-58 సం లో సాధించిన ఫలితములేవో మనకీనాటివరకూ బోధపడడం లేదు సెకండరీ విద్యకు సంబంధించినంతవరకూ 17 హైస్కూళ్లు, తెలంగాణా ప్రాంతములో ఒక హైస్కూలు ఏర్పాటుచేసినట్లు చెప్పారు. ఐతే తెలంగాణాలో ఆ పని కూడా జరగలేదని నరసింహారావుగారు అంటున్నారు. ఏవో కొన్ని విభాగాలను మాత్రము ఏర్పాటుచేసినట్లు తెలుస్తున్నది ఇప్పుడు పాఠశాలలున్నచోట్లలో వాటిని ఏవిధముగా అభివృద్ధి పరచినది, అవిలేనిచోట్లలో ఎన్ని కొత్తపాఠశాలలను ఏర్పాటుచేసినది మనము గమనించవలసి యున్నది. శ్రీ ఎగ్బోటేగారు ప్రాథమిక విద్యను గురించి మాట్లాడుతూ 1972 నాటికి దీనిని సాధించగలమేమోననే అభిప్రాయం వెలిబుచ్చారు. ఐతే యీ విషయమై కూడా నాకు సందేహమున్నది. ఆంధ్రప్రాంతమునకు సంబంధించినంతవరకూ 1-5 తరగతులలోపల నూటికి 50 మంది బాలురు మాత్రమే చదువుకుంటున్నారు బాలికలు నూటికి 20 మంది మాత్రమే చదువుకుంటున్నారు. తెలంగాణాలో బాలురు నూటికి 30 మంది, బాలికలు నూటికి 10 మంది మాత్రమే ప్రాథమిక విద్య పొందగలుగుతున్నారు. గవర్నమెంటు రిపోర్టులలోని లెక్కలను తప్పులెక్కలని చెప్పినపుడు దానినిగురించి విచారిస్తామని మంత్రిగారు చెప్పారు. ఐతే దానిని గురించి ఏమిచేశారో ఇంతవరకూ తెలియదు. 11,14 సంవత్సరముల మధ్యవారు లోయరు సెకండరీ తరగతులలో ఆంధ్ర ప్రాంతమునకు సంబంధించినంతవరకు నూటికి 24 మంది బాలురు, నూటికి 6 మంది బాలికలు మాత్రమే చదువుకుంటున్నారు. తెలంగాణాలో నూటికి 22 మంది బాలురు,

నూటికి 5 మంది బాలికలు మాత్రమే చదువుకో గల్గుతున్నారు. ఇట్టి స్థాయిలోనే విద్యారంగంలో మనము ముందుకు పోతుంటే మరుసటి శతాబ్దాని కైనా మనము బాల బాలికలకందరకు ఉచిత ప్రాథమిక విద్య గరపలేమోననే అనుమానము నాకున్నది. ఈ 20వ శతాబ్దము అంతమయి, 21 వ శతాబ్దము ప్రారంభమయ్యేనాటికి 14 సంవత్సరములలోపల ఉన్న బాలబాలికలందరనువిద్యా వంతులను చేయగలుగుతామేమోనని నాకు తోచుచున్నది శ్రీ ఎగ్బోటేగారు మాట్లాడుతూ ప్రాథమికవిద్య నిమిత్తమై నూటికి 20 వంతున మొత్తాన్ని ఖర్చుచేయవలెనని చెప్పారు. మన మంత్రులు కొందరు కేరళతో పోటీ పడతామని చెపుతున్నారు. ఈనాడు కేరళ ప్రభుత్వము వారు విద్యా శాఖ నిమిత్తమై ఎంత ఖర్చు పెడుతున్నారో గమనించగోరుతాను. ఈ అభివృద్ధి కమ్యూనిస్టు ప్రభుత్వము వచ్చిన తర్వాతనే సాధించారని నేననడములేదు. బడ్జట్‌లో మూడవ వంతు మొత్తాన్ని ఆ రాష్ట్రమువారు విద్యాశాఖ నిమిత్తమై ఖర్చు చేస్తున్నారు ఆ పరిమితిని మనముకూడా అనుసరించినట్లయితే 21,22 కోట్ల రూపాయల వరకూ మనం ఖర్చు చేయవలసిఉంటుంది. జనాభా ప్రాతిపదికపై చూచినాకూడ మనం కేరళ రాష్ట్రమువారికన్నా రెట్టింపు మొత్తం అనగా 22 కోట్ల రూపాయలవరకూ ఖర్చు చేయవలసి ఉంటుంది. ఐతే కేరళవారు 11 కోట్ల రూపాయలు ఖర్చు చేస్తుంటే మనము 12 కోట్లనే ఖర్చు చేస్తున్నాము. దీనిని మంత్రిగారు దృష్టిలో పెట్టుకోవాలని కోరుతున్నాను. మన ప్రభుత్వానికి ఒక స్పష్టమైన, నిశ్చితమైన విద్యావిధానం లేదని వారికి మనవి చేస్తున్నాను. మద్రాసురాష్ట్రంలో వివిధ పార్టీలవారు సమావేశమై ఒక వైట్ పేపరును తయారుచేశారు. కేంద్రప్రభుత్వము వారు సూచించిన విద్యావిధానాన్ని దృష్టిలో పెట్టుకొని ఉన్న పరిస్థితులన్నిం టిని సమాలోచించి మద్రాసువారు ఒక విధానాన్ని రూపొందించారు. వారు చాలా మంచి సూచనలు చేశారు. మన ఆంధ్రప్రదేశానికి కూడా వర్తించే సూచ నలు వారు రూపొందించగలిగారని నా అభిప్రాయము. వాటినిగురించి మంత్రి గారు ఏమి ఆలోచించారో నాకు తెలియదు. కమ్యూనిస్టులు మాత్రమే ఈ విధంగా చెబుతున్నారని అనుకోనక్కరలేదు. శ్రీ రామస్వామి మొదలియార్, శ్రీ లక్ష్మణస్వామి మొదలియార్ వంటి విద్యావేత్తలు, ఇతర ప్రవీణులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన విధానములవి. 6 సం. ల నుంచి 12 సం. ల వరకు అనగా 7 సం. లు ప్రాథమికవిద్యాబోధనకాలంగా ఎంచవలెనని వారు అభిప్రాయపడ్డారు. తరువాత ప్రి యూనివర్శిటీకోర్సు వరకూ 4 ఏండ్ల సెకండరీ విద్య కావాలెనని వారన్నారు. అంటే 16 సం. లు వచ్చేసరికి విశ్వవిద్యాలయ

యానికి వెళ్ళునట్లు వారు తమ విధానాన్ని రూపొందించుకున్నారన్నమాట. దీనిని గురించి మన మంత్రివర్గానికి ఇదమిద్ధమైన అభిప్రాయమున్నట్లు లేదు. అనేక గ్రామములలో తిరుగుతున్నప్పుడు కలిగిన నా అనుభవమును గురించి తెలియజేస్తాను. కొన్ని గ్రామాలలో 5వ తరగతివరకుగల పాఠశాలలు 2,3 కూడ ఉంటున్నాయి. 25 మంది బాల బాలికలు ఒక ఉపాధ్యాయునికి ఉండవలెననీ హాజరుసంఖ్య ఆవిధంగా లేనిచో ఉపాధ్యాయులను కొందరిని తగ్గించవలెననీ ప్రభుత్వవిధానము ఐతే ఇట్టి పాఠశాలలను వేరువేరుగా కాకుండా ఒకటిగా చేర్చి ఇపుడున్న ఉపాధ్యాయులందరికి అదే జీతంమీద ఉద్యోగములివ్వడానికి అభ్యంతరం ఉండనక్కర్లేదు చిన్న చిన్నస్కూలున్నను కలిపి ఒకే స్కూలుగా తయారుచేసి 7,8 తరగతులవరకూ దానిలో చదువుచెప్పేటట్లు చేసినట్లయితే గ్రామాలలోని బాలబాలికలకు మిడిల్ స్కూల్ తరగతులవరకూ చదువు చెప్పించడానికి, ఉపాధ్యాయులనెవ్వరిని తొలగించనక్కరలేకుండా ఇపుడు అవుతున్న ఖర్చుతోనే సాధ్యమవుతుందని తెలియచేస్తున్నాను.

సామాన్య ప్రజలకు ఇంకా ఎక్కువ అందుబాటులో విద్యావిధానం ఉంటుందని, ఆసూచన మంత్రిగారికి వ్యక్తిగతంగా చెప్పాను. ఆలోచిస్తామన్నారు. తరువాత ఏమయినదీ తెలియదు ఈ విషయాలన్నీ చర్చించడానికి ఈ శాసనసభలో 10,15 నిమిషాలు యిచ్చి నాలుగయిదు ఉపన్యాసాలు చేసినంత మాత్రాన కాదు. మద్రాసు ప్రభుత్వం చేసినట్లు, విద్యా విధానం గురించి శ్రద్ధతీసుకొంటున్న అన్ని పార్టీలలోనుంచి సభ్యులను తీసుకొని ఒక కమిటీనివేసి ఈ విద్యావిధానం ఏవిధంగా రూపొందించాలనేది పరిశీలించుట అవసరమని చెబుతున్నాను. అప్పుడే ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడి 1½ సంవత్సరములయినది. ఇప్పటికైన అటువంటి కమిటీని వేయవలసినదని మంత్రిగారిని కోరుచున్నాను.

విశ్వవిద్యాలయాలలో బోధనాభాషగా ఏది ఉండాలనే సమస్య ఉన్నది. గత పర్యాయం, వారు హిందీ ఉండాలని వ్యక్తిగత అభిప్రాయం చెప్పారు. అది అసంభవమని మేము చెప్పాము. అది ఆంధ్రభాషను, ఆంధ్రప్రదేశ్‌ను ముందుకు తీసుకుపోవడానికి దారితీయదు. ఈ విషయము ఇదమిద్ధముగా ప్రభుత్వము తేల్చుకోవాలి. ఇది కాలగతిలో ఎప్పటికి వస్తుందో, అప్పటికే వస్తుందనే భావంతో, అందరితోక పుచ్చుకొని మనము పోతాము—అనుకుంటే, మన బాల బాలికలకు చాలా నష్టముకలిగే అవకాశం ఉన్నది. అందువల్ల ఈ సంగతి శీఘ్రంగా ఆలోచించాలి. మాతృభాష అయిన

తెలుగు ద్వారానే యూనివర్సిటీలలో బోధించడానికి పూనుకోవలసియుంటుంది ముస్లిమ్సుకు వేరే ఏర్పాట్లు చేయవచ్చును. హిందీని నిర్బంధంగా మొదటి ఫారమునుంచి 6 వ ఫారము వరకు నిర్బంధం చేయాలి. 1959 లో విశ్వ విద్యాలయాలలో చెరాలంటే హిందీలో తప్పని సరిగా కనీసమార్కులు వస్తేనే చేర్చుకుంటామనే నిబంధనచేయాలి. అందువల్ల దేశసమైక్యతకు వీలుంటుంది. కాని ఆంధ్రదేశంలో హిందీ వ్యతిరేకతకు ప్రజలను రెచ్చగొట్టేందుకు ప్రభుత్వ చర్యలు దారి తీస్తున్నాయి. హిందీని మొదటి ఫారము నుంచి నేర్చుకొనే అవకాశాలు ప్రతిస్కూలులోను కల్పించాలి యూనియన్ సర్వీసు కొరకు హిందీని నిర్బంధంగా చేయడానికి అభ్యంతరం లేదుగాని, గ్రామాలలో బడి పంతుళ్లుగానో, చిన్న చిన్న ఉద్యోగాలు—గుమాస్తాలుగానో పని చేయుటకు హిందీని నేర్చుకొనక తప్పదు అంటే చాలా నష్టము కలుగుతుంది. హింది వ్యతిరేకతకు ఆంధ్రదేశంలో శంఖు స్థాపన, మన విద్యా మంత్రిగారే చేస్తున్నారని చెబుతాను

శ్రీ యస్. బి పి. పట్టాభిరామారావు మళ్ళీ చెప్పండి.

శ్రీ పి. సుందరయ్య . ఇంతవరకు ఆంధ్రప్రదేశ్‌లో హిందీకి వ్యతిరేకత లేదు. మంత్రిగారు అవలంబించే పద్ధతులవల్ల ఆంధ్రదేశంలో హిందీ వ్యతిరేక ఆందోళనకు శంఖు స్థాపన చేయడానికి పూనుకొన్నారు ఇది ఒక ఆంధ్రదేశ హిందీ వ్యతిరేక ఉద్యమమునకే శంఖు స్థాపన కాదు. హిందీ భారతదేశము నకు అధికార భాష. వివిధ రాష్ట్రముల ప్రజల మధ్య వ్యవహారం నడుపుకొనుటకు జాతీయభాషగా హిందీ అభివృద్ధి కావలసియున్నది. దానికి అనుకూలముగా చేయకుండా, అనవసరంగా గొడ్డలి పెట్టి కొట్టడానికి వారు అవలంబించే పద్ధతులు దారి తీస్తున్నాయి దీనిని పార్టీసమస్యగా కాకుండా అందరూ జాగ్రత్తగా ఆలోచించాలి.

బడి పంతుళ్ల జీతాల సమస్య ఉన్నది. గతపర్యాయం ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులకు రు. 6 లు ఎక్కువ చేస్తామన్నారు. రు. 100ల లోపు ప్రభుత్వ ఉద్యోగస్థులకు రు. 6 లు కరువు భత్యం యిస్తున్నారు. బోర్డు హైస్కూలున్సలో మొదట యిచ్చారు. తరువాత యివ్వకూడదన్నారు. ఇప్పుడు ఏపరిస్థితిలో ఉన్నదో తెలియదు. Aided Elementary Schools లో యిస్తు న్నారు గాని Aided Elementary Schools లో యివ్వకుండా నిరాకరిస్తు న్నారు. ఆవిధంగా కొంత మందికి యివ్వడం, యిచ్చిన తరువాత కూడా తిరిగి వసూలు చేసుకోవడం, యీ పద్ధతివల్ల అనవసరంగా అసంతృప్తి కలుగ జేస్తున్నారు. ఈ బడ్జెటులో అదనంగా 34 లక్షలు ఉపాధ్యాయుల జీతాలను పెంచడానికి కేటాయిస్తున్నామన్నారు. ఈ మొత్తము

యిదివరకు యిచ్చిన ఆరు రూపాయలకోసమా ? ఆ విషయమై ఆర్థిక మంత్రిగారి ఉపన్యాసంలో కూడా చెప్పలేదు విద్యాశాఖామంత్రిగారు కూడా చెప్పలేదు నిన్న గోపాలరెడ్డిగారిని ఆ విషయమై వేరేసందర్భంలో కనుక్కుంటే ఉపాధ్యాయులకు కొత్తగా అదనంగా యిచ్చే విషయం ఆలోచనలో ఉన్నదని అన్నారు జూలై 1 నుంచి రు. 5/- లు ఎక్కువ చేస్తామన్నారు ఆ విషయం విద్యాశాఖా మంత్రిగారు చెబుతారని అనుకొన్నాము కాని ఏమీ చెప్పలేదు. ఆ 34 లక్షల గురించి ప్రజలు ఏమి అనుకోవాలి ? ప్రభుత్వం చేయబోతున్న ఆ కొద్దిపాటి విషయం గురించైనా మంత్రిగారు చెబితే బాగుండేది ఇక్కడ ఒక ప్రకటన చేస్తారు. అది అమలులోకి వస్తుందో రాదో అనే అనుమానాలకు దారి తీసేమాదిరిగా మౌనం వహించడం బాగుండలేదని చెబుతున్నాను. ఈ విధంగా బడిపంతుళ్ల జీతాల సమస్య ఉన్నంతకాలమూ, ప్రాధమిక విద్యలోగాని, సెకండరీ స్కూలు విద్యలోగాని standards పెరుగుతాయని అనుకోవడం వెర్రితనం బడిపంతుళ్లకు జీతములు తక్కువ యిస్తున్నారని, అపోజిషన్ వారు చెప్పడమే కాదు Elementary Education Commission, University Education Commission-కేంద్రప్రభుత్వం- అందరూ ఆ విషయం చెబుతూనే ఉన్నారు. కాని మన మంత్రిగారు చెప్పిన కారణాలలో, ఆ కారణం తప్ప, మిగిలినవి చెప్పడం జరిగింది. బడిపంతుళ్ల జీతాలు పెంచడానికి మనము గట్టిగా కృషిచేయాలి కేంద్రప్రభుత్వం పూర్తిగా సహాయం చేయడం లేదని, matching grant యిస్తుందని, మిగిలినది యీ ప్రభుత్వము యిచ్చుకోలేక పోతున్నామన్నారు. కేంద్రప్రభుత్వం యిచ్చేది ఖచ్చితంగా యివ్వమని అడుగుతున్నట్లు చెప్పారు. ఆ విషయమై సంప్రదింపులు జరుగుతూ ఉండవచ్చును పొదుపు ఉద్యమ మని, గ్రామాలమీద పడుతున్నప్పుడు టీచర్సుకు విజ్ఞప్తిచేసి, మీరు పూర్తిచేసే మూడవవంతు స్టేటు గవర్నమెంటు పర్పాటుతో పొదుపు ఉద్యమం క్రింద జమకట్టాలని ఆ రకంగా చెబుతే, వారి జీతాలు వెంటనే పెంచడానికి వీలుంటుందేమో చూడమని వ్రాశారు. కాని అది రూల్సుకువ్యతిరేకమని, సాధ్యంకాదని అన్నారు. Technical difficulties ఏమైనా ఉంటే ఒక బిల్లు తీసుకురావచ్చును. కేంద్రప్రభుత్వం దగ్గర తీసుకొన్న డబ్బు, ఉపాధ్యాయులకు అందజేయటానికి వీలులేని పరిస్థితులు ఏమి ఉన్నవో అర్థము కావడం లేదు. Leagal Department అభ్యంతరం పెట్టిందని, Finance Department సాధ్యంకాదని చెప్పిందని అనుకొన్నా- అన్ని పార్టీల ప్రతినిధులు కూర్చొని టీచర్సుయొక్క జీతాలను పెంచటానికి ఎందుకు కృషిచేయకూడదు ? మన

కున్న ఆర్థిక సదుపాయాలు కేంద్రప్రభుత్వం యిచ్చే డబ్బు కూడా ఉపయోగించు కోవడానికి వీలులేకుండా, కాలయాపన చేయడం సరైన విధానం కాదు.

తెలంగాణా సమస్య వచ్చినప్పుడు, తెలంగాణాలో ఆంధ్రప్రాంతముకన్న టీచర్సు జీతాలు ఎక్కువే ఉన్నవి ఇంతకన్న ఎక్కువ పెంచకూడదని కాదు. తెలంగాణాలో యిదివరకునుంచి continue అవుతున్న వారికి యిప్పుడు తగ్గించనూ లేరు. కాని ఇప్పుడు కొత్తగా టీచర్సు ఉద్యోగాలలో ప్రవేశించే వారికి ఆంధ్రప్రాంతపు తక్కువస్కేల్సే తెలంగాణా వారికి కూడా యిస్తామంటున్నారు. అందువల్ల తెలంగాణాలోని వారు ఉపాధ్యాయవృత్తి చేసుకు జీవించ దలచుకుంటే వారికి ఆంధ్ర స్కేల్సు అమలుపరచడంవల్ల నష్టము కలుగుతోంది. ప్రతిదానికీ డబ్బు లేదనే నెపము చెప్పుకుంటే లాభములేదు. ఆంధ్ర, తెలంగాణా feelings రాకుండా ఉండాలన్నా, integration చేయాలన్నా, ఆంధ్రప్రాంతంలోని జీతాలు తెలంగాణా స్కేలుస్కు తీసుకురావాలి ఆ విధంగా చేస్తేనే integration సాధ్యం అవుతుంది.

ప్రభుత్వం ఆంధ్రప్రాంతంలోని ఉపాధ్యాయుల జీతాలు పెంచకుండా, యీ రెండు ప్రాంతాలలోని ఉపాధ్యాయుల జీతాలు ఇంటిగ్రేట్ చేస్తామంటే, అది తప్పకుండా తెలంగాణా ప్రాంతంలో ఉపాధ్యాయులుగా ఉన్నవారికి, రేపు తెలంగాణాలో ఉపాధ్యాయులుగా రిక్రూట్ చేయబడేవారికి అన్యాయం చేసినట్లు అవుతుంది. అది "తెలంగాణా-ఆంధ్ర" ఫీలింగ్స్ రెచ్చగొట్టినట్లు అవుతుంది. మొదట ఆంధ్రప్రాంతంలోని ఉపాధ్యాయుల జీతాలు, తెలంగాణా ఉపాధ్యాయుల జీతాలతో సమానంగా తీసుకురండి. తర్వాత ఇంటిగ్రేషన్ చేయండి కాని, ఆంధ్రలోని ఉపాధ్యాయుల జీతాలు పెంచకుండా, ఇంటిగ్రేషన్ తీసుకురాకండి. ఆంధ్రలోని ఉపాధ్యాయుల జీతాలు పెంచిన తర్వాతనే ఇంటిగ్రేషన్ సమస్య తీసుకోండి. ఇంటిగ్రేషన్ విషయంలో, అన్ని పార్టీలతో కూడిన ఒక చిన్న కమిటీని వేసి, ఆ సమస్యలను పరిశీలించవలెనని చెబుతున్నాను. ఉపాధ్యాయుల జీతాలు పెంచనంత కాలం విద్యార్థుల విద్యాస్థాయి పెరగదని చెబుతున్నాను.

ఉపాధ్యాయులసంఘాలు గురించి చెప్పి ముగిస్తాను. ఉపాధ్యాయుల సంఘాలుగురించి ఇక్కడ మేము అనేక పర్యాయాలు చెప్పటం జరిగింది. ఉపాధ్యాయులు సంఘాలు ఏర్పాటుచేసుకొనే విషయంలో, ప్రభుత్వం హైకోర్టు ఇచ్చిన తీర్పులను ధిక్కరించటానికి ఏవిధంగా ప్రయత్నిస్తున్నదో గత అసెంబ్లీ సమావేశాల్లో వివరంగా చెప్పాము. మంత్రిగారు ఆ రోజు "హైకోర్టు తీర్పులు మేము ధిక్కరించలేదు" అని చెప్పారు. అయితేను, హైకోరు ఇచ్చిన జడ్జిమెంటు

మా దగ్గరలేకపోబట్టి, ఆనాడు మేము ఇక్కడ వాటిని చూపించలేకపోయాము ఇప్పుడు, హైకోర్టు ఇచ్చిన జడ్జిమెంట్స్ మా దగ్గర ఉన్నవి. జడ్జిమెంట్‌లో వారు వాడిన పదాలు చదువుతాను. నవంబర్ 1951 లో ఒక జడ్జిమెంట్, సెప్టెంబర్ 56 లో ఇంకో జడ్జిమెంట్ ఇచ్చారు ఈ రెండు జడ్జిమెంట్స్ కాన్‌స్టిట్యూషన్ అమలులోకి వచ్చిన తర్వాత ఇచ్చినవే 1956వ సంవత్సరం సెప్టెంబర్ 12 వ తారీఖున ప్రభుత్వం చేసిన జి. ఒ చూచినట్లయితే, ఏదైతే హైకోర్టు చేయవద్దని చెప్పిందో, ఏ ఏ పదాలు వాడవద్దని చెప్పిందో, అవే పదాలను ఉపయోగించి, అదేవిధంగా ప్రభుత్వం జి ఒ. తయారుచేసినట్లు స్పష్టం అవుతుంది.

"Any teachers" union not conforming to the rules and compelling teachers in local boards or councils concerned before forming unions and in so far as they prohibit teachers in recognised elementary schools from becoming members of teachers' union or other teachers organisation not constituted in accordance with the orders of Government should be declared to be void as constituting an abridgement of right of freedom of association guaranteed by Article 19(1)(e) of the Constitution." ఇది హైకోర్టు జడ్జిమెంట్.

దీనికి యీ ప్రభుత్వం సెప్టెంబర్ 12 వ ఇచ్చింది.

"Teachers in elementary schools and in district boards should obtain the previous permission of the Special Officer District Boards to become members of teacher' union."

"ముందు పర్మిషన్ తీసుకొని ఉపాధ్యాయులు సంఘాల్లో చేరాలి" అని చెప్పటం తప్పు అని హైకోర్టు జడ్జిమెంట్ ఇవ్వగా, సెప్టెంబర్ 56 న, తిరిగి అదే విధంగా ప్రభుత్వం జి. ఒ చేయటం జరిగింది. దీనినిబట్టి చూస్తే మంత్రివర్గం హైకోర్టు తీర్పులను ధిక్కరించినట్లు తెలుస్తుంది. ఈ విధంగా మంత్రివర్గం చేయటం ఒక చెడు సాంప్రదాయాన్ని తీసుకురావటంతప్ప ఇంకోటి కాదు. అది కాన్‌స్టిట్యూషన్‌కు విరుద్ధంకాదని ప్రభుత్వ లాయర్స్, డిపార్ట్‌మెంట్ చెప్పినప్పటికీ, ప్రభుత్వం అవిధంగా చేయటం మంచిదికాదు. హైకోర్టు జడ్జిమెంట్ ఒకటి ఉన్నది. హైకోర్టు జడ్జిమెంట్ తప్పు అని ప్రభుత్వం అనుకొంటే సుప్రీమ్ కోర్టుకు వెళ్లి, ఆ జడ్జిమెంట్ తప్పు అని, రివిజన్ కోరుకోవాలి. అంతే గాని "మా ఇష్టం వచ్చినట్లు చేస్తాము, కావాలంటే . మీరు హైకోర్టుకు పో.

సుప్రీంకోర్టుకు పో" అని చెప్పటం న్యాయంకాదు. అందుచేత హైకోర్టు తీర్పులను ప్రభుత్వం ఖాతర్ చేయవలసిన అవసరం ఉన్నదని నేను స్పష్టంగా చెబుతున్నాను ఉపాధ్యాయులందరు ప్రభుత్వంమీద కుట్ర పన్నుతున్నారనే ఉద్దేశంతో "వీరినిఅణచి వేయాలి, వీరికి సంఘస్వాతంత్ర్యం లేకుండా చేయాలి, మేం చేరమన్న సంఘంలోనే వీరు చేరాలి" అని నిర్బంధాలు పెట్టటంవల్ల ఉపయోగంలేదు. మన విద్యావిధానం పెరగాలంటే, విద్య స్థాయి పెరగాలంటే, యీవిధంగా నిర్బంధాలు పెట్టటం మంచిదికాదని చెబుతున్నాను. ఉపాధ్యాయుల సంఘాలను గుర్తించండి. ఉపాధ్యాయులు స్వేచ్ఛగా తమ అభిప్రాయాలు చెప్పుకొనే అవకాశం కలుగజేయాలి. పిల్లలకు ఏ ఏ స్థలంలో (ఏఏస్టేజిలో) ఎంత విద్య నేర్పాలి అనే బాధ్యత ఉపాధ్యాయులమీద ఉంచండి ఎడ్యుకేషన్ ఆఫీసర్స్, ఎడ్యుకేషనల్ ఇన్‌స్పెక్టర్స్ ఉపాధ్యాయులు తినే తిండిని చెడగొట్టేరీతిగా ప్రవర్తించకుండా చూడాలి "అక్కడ 25 మంది పిల్లలులేరు కాబట్టి, ఉపాధ్యాయులను తగ్గించండి" అనే ధోరణిలో కాకుండా దానికి కారణంఏమిటనేది ఆఫీసర్స్ శ్రద్ధగా పరిశీలించాలి. ఇన్‌స్పెక్టర్లు కేవలం క్రిందివారిపైన పెత్తనం చలాయించే ధోరణి పోగొట్టి, క్రింది ఉద్యోగస్థులమీద అనవసరంగా చర్య తీసుకొనే పద్ధతిలేకుండా చేయాలి. అప్పుడే మన విద్యావిధానం అభివృద్ధి చెందే అవకాశం ఉంటుంది.

•

ఆర్కలాజికల్ డిపార్టుమెంట్ ఖర్చుగురించి కూడ ఇక్కడ ఒక డిమాండ్ ఉన్నది. నేను రెండుమూడు సంవత్సరాల క్రిందట వరంగల్ వెళ్లి చూశాను. అక్కడ త్రవ్వి తీయబడిన కాకతీయశిల్పాలు ఎండకు ఎండి వానకు తడుస్తున్నాయి. కేంద్ర మ్యూజియమ్ ఇక్కడ ఉన్నదని మంత్రిగారు అన్నారు. ఇప్పుడు వాటిని ఇక్కడకు తీసుకొనివచ్చి పెట్టమని నేను అనటంలేదు. కనీసం అక్కడే వాటిని జాగ్రత్త చేసేదానికి చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను. అదేవిధంగా ఏలేశ్వరంలో కూడ పురాతనమైన వస్తువులు ఉన్నవి. కంటోన్మెంట్ బోర్డ్ 30 వేలు ఇచ్చి అక్కడ కొంత త్రవ్వించింది. ఇంకా కొండాపురంలో కూడ ఆంధ్రనాగరికత, భారతీయ నాగరికత తెల్పే శిల్పాలు ఉన్నాయి. వీటిని శ్రద్ధగా భద్రపరిచేదానికోసం ప్రభుత్వం ఇంకా ఎక్కువ డబ్బు కేటాయించాలని కోరుతున్నాను. ప్రభుత్వం ఇందుకు కేటాయించిన 70 వేల రూపాయలలో, ఇటువంటివి సేకరించేదానికి 10 వేల రూపాయలకన్నా ఎక్కువ ఖర్చుకావటం లేదు. ఈ పురాతనమైన వస్తువులకు నామరూపాలు పోకముందే వీటిని జాగ్రత్త చేయాలని, ఇందుకు ఇంకా ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టాలని కోరుతూ, నా ఉపన్యాసాన్ని ముగిస్తున్నాను.

*శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : అధ్యక్షా, ప్రతిపక్షనాయకులతో కలిపి, కొద్దిమంది గౌరవసభ్యులు ఇంతవరకు మాట్లాడారు. వివిధ విషయాలలో వారు అభిప్రాయాలు యీ సభముఖాన వెల్లడించారు. అవన్నీకూడ నేను ఓపికతో విన్నాను ఆచరణ యోగ్యమై, ప్రజాశ్రేయస్సు దృష్ట్యా, ప్రభుత్వ సాధనలో, సాధ్యమైనంతవరకు అవన్నీ ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తామని మనవిచేస్తున్నాను. వారు చేసిన సూచనలకు, వారందరికి నా కృతజ్ఞతలు తెలుపుతున్నాను. ఒకరొకరినిగురించి, వారు చెప్పిన విషయాలు సూక్ష్మంగా పది నిమిషాలలో నేను మీకుచెబుతాను.

బద్దం ఎల్లారుడ్డిగారు నిరక్షరాస్యత నిర్మూలించాలని, దానికి అయ్యే ఖర్చు భరించాలని, కాన్‌స్టిట్యూషన్ రీత్యా ఫ్రీ అండ్ కంపల్సరి ఎడ్యుకేషన్ ఇవ్వాలని, అందుకు ఇంకా ఎంతకాలం పడుతుందని, అన్నారు. తెలంగాణాలో ఎక్కువ విద్యావ్యాప్తికావాలని, తెలంగాణా ప్రదేశం విద్యలో చాలా వెనకబడిఉన్నదని వారు గుర్తుచేశారు. ఉపాధ్యాయుల వేతనాలు గురించి కూడ నేను ఏమీ చెప్పలేదన్నారు. వారేకాదు, ప్రతిపక్షనాయకులతో కలిపి, ఇతర సభ్యులు కూడ ఆ విషయం చెప్పారు. ఆంధ్రప్రాంతంలోని ఉపాధ్యాయుల జీతాల స్థాయికి తెలంగాణా ఉపాధ్యాయుల జీతాలు తీసుకురాకూడదని అన్నారు. ఉపాధ్యాయులను నిరాదరణతో చూడకూడదన్నారు వారు చెప్పినవన్నీ మంచివే. విషయం ఏమిటంటే—ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో విద్యాస్థాయిని ఎంత త్వరలో హెచ్చుగా తీసుకురావటానికి సాధ్యం అవుతుంది అన్న విషయాన్ని జాగ్రత్తగా పరిశీలన చేసే, యీ ఏర్పాటు చేశాము. పిండి కొద్ది రొట్టె. ఉన్న ధనంతో ఎంతవరకు విద్యను అభివృద్ధి చేయాలి అన్న విషయం పరిశీలించాము. "ఇతర ప్రణాళికలు ఉన్నవి, ఇతర సబ్‌జెక్ట్సు ఉన్నవి" అని నేను ముందే మనవిచేశాను. మన ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ రంగంలోను, ఇతర కార్మిక రంగాలలోను చేయవలసిన పనులు చాలా ఉన్నవి. వాటికి హెచ్చు ఖర్చు పెడుతున్నాము. వాటికి పోగా, ఇంకా ఎంతవరకు సాధ్యమవుతుందో అంతవరకు డబ్బు ఖర్చు పెడుతున్నాము.

అక్కడికి 11 కోట్ల 97 లక్షలు కేటాయించాము. పోయినసంవత్సరముకంటె దాదాపు అర్ధకోటి రూపాయలు హెచ్చుగానే కేటాయించాము. ఈమొత్తమును మనసులో పెట్టుకొని ఎంత త్వరలో పెంచటానికి సాధ్యమవుతుందనే ఆలోచన మనస్సులో పెట్టుకునే యింతవరకు కేటాయించాము. సాధ్యమయితే యింకా ఎక్కువగ ఉపయోగించటానికి కూడ ప్రయత్నిస్తాము. మనకు

ఉన్న ఆర్థికపరిస్థితి బాగాలేదు గనుక అంతకంటె హెచ్చుగా కేటాయించటానికి సాధ్యము కాలేదు అక్కడ ఉపాధ్యాయులకు ఇక్కడ ఉపాధ్యాయులకు వేతనాలలో చాలా తేడాలు ఉన్నవని, తెలంగాణావారి జీతాలు ఆంధ్రవారిస్థాయికి తేవాలని ప్రభుత్వము చూస్తున్నదని సభ్యులు చాలా మంది చెబుతూ వచ్చారు. తేడాలు ఉండడమనేది ఒక్క ఉపాధ్యాయుల విషయములోనే కాదు, అన్ని డిపార్టుమెంట్లలోను. అన్ని రంగములలోను ఉన్నవి. ఈ తేడాలు సమన్వయము చేయాలనే ఆలోచన ప్రభుత్వమునకు ఉన్నది. అది ఎట్లా అనేది ఇదమిద్ధమని నేను యిప్పుడు చెప్పలేను. అయినప్పటికినీ మొత్తముమీద ఆంధ్రప్రదేశ్‌లోని ఉపాధ్యాయుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని, ఇది ఒక్క ఉపాధ్యాయులకే చేయడము, మిగతా వారికి చేయకపోవడమనేది జరుగదు. కాని ఈ విషయమును గురించి అన్ని పరిస్థితులు పరిశీలించిన తరువాతనే ఏదైనా నిర్ణయము జరుగుతుంది గాని, ఇప్పుడే ఇదమిద్ధమని నేను చెప్పటానికి వీలుకాదు. కాని ఉపాధ్యాయుల శ్రేయస్సులు, వారియొక్క కష్టములు, అన్నీ మనస్సులో పెట్టుకునే, ఎంత త్వరలో చేయటానికి వీలుఅవుతుందో అంత త్వరలో చేయటానికి ప్రయత్నిస్తాము. ఇప్పుడు ఏదో పెంచబోతామంటున్నారే, ఎంత పెంచబోతారు అనే దానికి నేను జవాబు చెప్పలేదని ప్రతిపక్షసభ్యులతో సహా అన్నారు అందును గురించిన వివరాలు నేను కొద్దిగా చెబుతున్నాను.

కేంద్ర ప్రభుత్వమువారు చెప్పిన సలహాప్రకారము మనము teachers యొక్క scales of pay revise చేయాలని అంటే, ముఖ్యంగా Elementary school teachers విషయంలో మాత్రము మొదటి సంవత్సరములోనే ఒక కోటి 45 లక్షలు అవుతుంది. అయితే అందులో మన పేరు half the matching grant యిస్తే తప్ప వారు యివ్వరు. ఆ పద్ధతిలో అయితే దాదాపు 75 లక్షల పైచిల్లరదాకా మనము పెట్టుకోవలసివస్తుంది. అయితే ఇంత డబ్బు మనము పెట్టుకోటానికి మనవద్ద అంత డబ్బులేదు. దానికోసమే మేము కేంద్ర ప్రభుత్వాన్ని అడిగాము. ఏమనీ అంటే, మాకున్నటువంటి ఆర్థికపరిస్థితులను బట్టి maching grant ను గురించి insist చేయకండి. ఇతర రంగాలలో మాకు ఎక్కువగ ఖర్చు అవుతున్నది. అందులో ముఖ్యంగా నాగార్జున సాగర్ వగైరాచోట్లలో మా ప్లాను ప్రకారము ఎక్కడో నేషనల్ సెక్టారులో ఉండి పని చేయవలసినది ఐదులు, ఈ సెక్టార్‌లోనే పని చేస్తున్నాము. అందువల్ల మాకు అక్కడ ఎక్కువ ఖర్చు అవుతున్నది గనుక ఈ plan period లో ఈ plan provision ప్రత్యేకంగా కేంద్రప్రభుత్వం increase చేయకుండా machinggrant క్రింద డబ్బు యిచ్చినానచే తెచ్చిపోతే పైయెత్తులు అంతా కలిపి

as a special case గా treat చేసి సొమ్ము అంతా అంటే ఈ 150 లక్షలు మీరు మాకు release చేసినాసరే అనే విధముగా చాలాకాలముగా కేంద్ర ప్రభుత్వానికి వ్రాశాము. దానికి వారియొక్క జవాబుకూడ తెప్పించుకున్నాము కాని దానికి కేంద్రప్రభుత్వం అంగీకరించినట్లు లేదు. పూర్తిగ్రాంటు యివ్వటానికి వారు అంగీకరించడము లేదు. దానిలో సగము matching grant increase చేయకుండా యివ్వటానికి కూడ అంగీకరించడము లేదు. ఇప్పుడు రెండవ పద్ధతిగా యీ teachers కు మనము ప్రస్తుతము కొంతవరకైనా ఇవ్వకపోవడ మనేది న్యాయముకాదు అని అనుకుని, మంత్రులము అందరము ఆలోచించి ad hoc increase గా ఏదోకొంత సహాయము చేద్దామనే ఉద్దేశ్యముతో కొంత డబ్బు దానిక్రింద కేటాయించాము దానిని గురించి Planning Commission వారితో కూడ చర్చించి, కేంద్రప్రభుత్వంతో correspondence చేస్తూ ఉన్నాము. Scales of pay కాకుండా ad-hoc grant గా కొంత సహాయము చేయటానికి మీయొక్క half share release చేయండి, మా half share ఇవ్వటానికి మేము సిద్ధముగ ఉన్నాము. అని వ్రాస్తే, దానికి వారివద్దనుంచి జవాబురాలేదు. జవాబు ఇంతవరకు రాలేదుగనుకను, వారు ఇచ్చేసంగతి ఏదీ తెలియక పోవడము వల్లను, నేను యీ సభలో announce చేయలేక పోయినాను. లేకపోతే అంతటి అదృష్టమునాకు కలిగేదే కాని అది జరగలేదు. అయినను, కేంద్రప్రభుత్వము వారు ఒప్పుకుంటారని, ఆ half share release చేస్తారని ఆశిస్తున్నాను. I always hope for the best. Secondary grade teachers కు కూడ వారి half share release చేస్తామని కేంద్రప్రభుత్వమువారు అన్నారు. అది సెకండరీ గ్రేడు టీచర్లకు release చేస్తూ అంతకంటే ముందు ముఖ్యంగా Elementary school teachers కు release చేయకపోవడము న్యాయిముకాదని ఆలోచించి నేను స్వయముగ ఢిల్లీవెళ్ళి, కేంద్రమంత్రులతో కలిసి సంప్రదించాను. అప్పుడు అబ్దుల్ కలామ్ ఆజాద్ తోగూడ చెప్పాను. ఆయనకూడ ఆలోచిస్తానని వాగ్దానము చేశారుకాని దురదృష్టవశాత్తు యీలోగా వారు చనిపోయినారు. ఏమైనప్పటికినీ మొత్తముమీద కేంద్రప్రభుత్వం ప్రత్యేకంగా ఆ ½ share release చేసే అవకాశము ప్రస్తుతము మనకు కన్పించడము లేదు. అయినప్పటికినీ Secondary school teachers కు ఆ గ్రాంటు release చేయటానికి వారు సిద్ధముగానే ఉన్నారుగనుక, Primary school teachers కు కూడ మనము ఏదోకొంతవరకు సహాయముచేసి, అది తీసుకోవడము న్యాయమనే అభిప్రాయముతో దానినిగురించి కేంద్రప్రభుత్వముతో correspondence చేయడము మొదలుపెట్టాము. కేంద్రప్రభుత్వం వారు, ఎంత యిస్తారో మనకు

తెలియదు అందువల్ల యిదమిద్ధమని తెలియకుండా ముందుగా నేను announce చేయడము సరియైన పద్ధతికాదు. కాని నా అభిప్రాయములో అధమపక్షము అయిదో వీలుఅయితే ఆరురూపాయలో యివ్వటానికి అవకాశము ఉంటుందని అనుకుంటున్నాను అదికూడ జూన్‌లోనో, జూలైలోనో ఇవ్వటానికి వీలవుతుంది. మొత్తముమీద సంవత్సరము అంతటికి యీ 34 లక్షల రూపాయలు సర్దాల్సిందే కాని, అంతకంటె, సర్దటానికి వీలుఅయ్యే మార్గము కన్పించలేదు ఆ వివరాలను గురించి యిప్పుడు నేను చెప్పాను. దానికోసమే కేంద్రప్రభుత్వానికి వ్రాశాము గనుక, వారివద్దనుంచి జవాబు వచ్చినదాకా, ఇదమిద్ధమని చెప్పలేక పోతున్నాను

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు ఈ 34 లక్షలు క్రొత్తగా increase గా అనా ?

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామరావు : అవునండి, ఇదివరకు వచ్చిన ఆరు రూపాయలు కాక ప్రత్యేకంగా ఇది ఇదివరకు నూరు రూపాయలు లోపలఉన్న వారికి అన్ని రంగములలోను, ఇది teachers కే కాకుండా, అందరికీ increase చేశారు. ఈ ఆరు రూపాయలు ఇవ్వడములో గతములో Aided Elementary School techers కు ఇచ్చారు. ప్రభుత్వము స్కూలుటీచర్సుకు ఇచ్చారు. కాని Aided Secondary School teachers కు మాత్రము యివ్వలేదని ప్రతిపక్షనాయకులు అన్నారు. కేంద్ర ప్రభుత్వమువారు ½ grant ఎవరెవరికి అయితే ఖర్చు meet అవుతున్నారో, వారికి మనము matching grant యిస్తూ, అన్ని రంగములలోను నూరు రూపాయల లోపల వేతనములు తీసుకునే వారందరికీకూడ ఈ ఆరు రూపాయలు increase యిచ్చారు. అయితే Aided school teahchers విషయములో వారు increase చేయలేదు. ఈ విషయమును గురించి నేను పలుమార్లు ఈ సభలోనే చెప్పాను. ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు కూడ ఇదివరకే చెప్పారు. ఈ విషయమును గురించి వారికికూడ యివ్వాలని కేంద్రప్రభుత్వముతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతున్నాము. కాని వారు యింతవరకు అంగీకరించలేదు. అందువల్ల Aided secondary school teachers కు కూడ గతములో ప్రభుత్వం ఇచ్చిన ఆ ఆరు రూపాయలు వారికి లభ్యము కాకుండాపోయింది.

శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయము గురించి చెప్పారు. (Interruption)

శ్రీ పి సుందరయ్య : ఇదివరకు ఆరు రూపాయలు పొరపాటుననో, మరి ఎట్లాగో యిచ్చారు. అవి యిప్పుడు తిరిగి వారి వద్దనుంచి, కేంద్రప్రభుత్వము final గా తెచ్చేదాకా, వసూలు చేయకుండా ఆపుచేస్తారా ?

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : ఆ సొమ్ము తిరిగి వసూలు చేయకపోతే, అటు కేంద్రప్రభుత్వమో, లేక యిక్కడ రాష్ట్ర ప్రభుత్వమో, ఇద్దరిలో ఎవరో ఒకరు పెట్టుకోవాల్సిఉంటుంది. కాని ఇందులో దీనిని ఎవరు భరించాలి అన్న ప్రశ్న వస్తుంది.

శ్రీ పి. సుందరయ్య : కేంద్రప్రభుత్వము అది ఇచ్చివేశారు. కేంద్ర ప్రభుత్వముతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతున్నారు ఆ correspondence యింకా జరుగుతూనే ఉన్నది ఇంకా ఆ file close కాలేదు కాబట్టి ఈ విషయమును గురించి final గా settle అయ్యేదాకా నైనా వసూలు చేయకుండా ఆపు జేస్తారా ?

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : పరిశీలిస్తాను.

తరువాత యమ్. ఆర్. అప్పారావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమును గురించి ఎంతో చెప్పారు. వారికి ఆ విశ్వవిద్యాలయానికి సన్నిహిత సంబంధము ఉన్నది గనుక దానికి కావలసిన సహాయము చేయమని చెప్పారు. ఆ విశ్వవిద్యాలయము స్థాపించి యిప్పటికి దాదాపు 30 సంవత్సరములు కావచ్చింది. చాలామంది పెద్దలు ఉపాధ్యాయులుగ ఉన్నారు ప్రభుత్వము దానికి చాల తక్కువ support ఇస్తున్నదని అన్నారు. మనకు యిప్పటికి మూడు విశ్వవిద్యాలయాలు ఉన్నవి. ప్రభుత్వము దృష్టిలో యీ మూడింటినీ సమానముగా చూచుకోవాలనే ఉద్దేశిస్తున్నది. ఒక తండ్రికి ముగ్గురు కుమారులు ఉంటే అందరినీ సమానముగ ఏవిధంగా చూస్తాడో అదేవిధముగ యీ మూడు విశ్వవిద్యాలయములను సమానముగ చూడవలసియున్నది. కాని వయస్సు పెరిగినంత మాత్రాన తండ్రి పెద్దవాడికి ఎక్కువభాగము యివ్వడు. అయినను ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు గతములో ఎక్కువగానే ముట్టినది.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : అయినా జ్యేష్ఠునికి జ్యేష్ఠభాగము వుంటుంది గదా !

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : అది న్యాయం కాదండి. ఈ కాలములో, మనము Socialistic Pattern of Society ను ఏర్పాటు చేసుకుంటున్నాము. అందువల్ల ఎక్కువ తక్కువ అనేది కాదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : ప్రాయము ఎక్కువైనకొద్దీ, తిండి తగ్గించరు కదా !

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు గోపాలకృష్ణయ్యలాంటివారు ఉపోష్యాలు చేస్తే చేయగలరేమోకాని, ఆవిధముగ తగ్గించడము యీ ప్రభుత్వ లక్ష్యము కాదు. అయినను మొత్తము మీద అది ఎంతవరకు సాధ్యమవుతుందో చూచుకుని ప్రభుత్వము వద్దనున్న ధనమునుబట్టి మూడు విశ్వవిద్యాలయాలకు, వాటియొక్క అవసరములను దృష్టిలో పెట్టుకుని జాగ్రత్తగా ఆలోచించి ఇస్తాము. ఈ విషయము విశ్వవిద్యాలయాలవారికి తెలుసు. ఇందులో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి Convocation hall అనేది లేదు.

[*Mr Speaker in the chair* ]

ఈ కొరత అనేది అన్నింటికి సమానమే. దీనికి ప్రత్యేకత అనేద ఏమీ లేదు ఆవిధముగ ఉన్నప్పటికినీ ఈ విషయములో ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు కోరిన అయిదు లక్షలకును ఒక లక్ష మాత్రమే ఇస్తున్నాము. అందులో యీ ఆంధ్ర విశ్వవిద్యాలయమును గురించి ప్రభుత్వము జాగ్రత్తగానే పరిశీలించి ఇస్తున్నదని అనుకుంటున్నాము. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు మొదటినుంచీ కూడా వారు పెట్టే courses ను బట్టి University Grants Commission వారు కూడా కొంతవరకు సహాయము చేస్తున్నారు. దానితోబాటు ఇదివరకు ఉన్న ఆంధ్ర ప్రభుత్వము కూడ చేయగలిగినంత సహాయము చేసింది. ఇప్పుడు కూడ ఈ ప్రభుత్వం జాగ్రత్తగానే పరిశీలించి సహాయము చేస్తున్నది. వారికి Law College Buildings లేవు అని అన్నారు. ఆంధ్రులచరిత్రబాగా ప్రకటింప జేయాలని అన్నారు. Hostels యివ్వాలని అన్నారు. Maching grant కు సరిపడే పద్ధతిలోనే ప్రభుత్వము యివ్వాలని అన్నారు. ఇవి అన్నీ ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ప్రత్యేకంగా ఏర్పాటు చేశామంటే, ఆ విద్యాలయానికి యిచ్చే ధనం అంతా వారి యొక్క College of Education క్రింద ఖర్చు చేసేదానికే చాలదేమోనని నా అభిప్రాయము అయినను మనకు ఉన్న ధనములో కొంతవరకు జాగ్రత్తగానే పరిశీలించి సహాయము చేస్తున్నాము.

తరువాత S. R. R. College ని తీసుకునే విషయమును గురించి కూడ చెప్పారు. ఆ విషయమును గురించి ప్రభుత్వము పరిశీలిస్తున్నది.

బి. వి. సుబ్బారెడ్డిగారు చాలా విషయములను గురించి చెబుతూ, చాలా philosophic గా మాట్లాడారు. తనకు ఉన్న అనుభవములను గురించి చెప్పారు. Rt. Hon. Sreenivasa Sastry గారిని గురించి చెప్పారు.

శాస్త్రిగారికి కూడ చాలా అనుభవము ఉన్నది. సుబ్బారెడ్డిగారు teachers' salaries improvement ను గురించి చెప్పారు. సుబ్బారెడ్డిగారు చెప్పిన విషయములన్నీ నోటుచేసుకున్నాను.

తరువాత buildings programme ను గురించి కూడ చెప్పారు. ఏదో అయిదు సంవత్సరములలో యీ building programme ను వేసి పూర్తిచేసే ఏర్పాటు చేయాలని అన్నారు. ఇటీవలనే మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూగారు Elementary Schools కు buildings అక్కరలేదు, అవి చెట్ల క్రిందనే, మంచిగాలి ఉండేచోట పెట్టి నడిపించితేనే మంచిది. పిల్లల ఆరోగ్యము కూడ బాగా ఉంటుంది. వాళ్లకొరకు కట్టించే buildings మీద పెట్టే ధనము, టీచర్ల జీతాలు పెంపు క్రింద ఇతర పరికరాల క్రింద ఖర్చు చేస్తే మంచిదని సూచన చేశారు. ఆ విషయమును గురించి ప్రభుత్వము పరిశీలిస్తున్నదని సభవారికి వెల్లడి చేస్తున్నాను.

ఇక కల్లూరు సుబ్బారావుగారు మాట్లాడుతూ, యిప్పుడు Primary Education క్రింద ప్రభుత్వము ఖర్చు చేసే ఆరు కోట్లుకూడ సక్రమంగా వినియోగపరచబడుతున్నదని ప్రభుత్వము ఉద్దేశిస్తున్నదా అని అన్నారు. ఈ విద్యావిధానము ఏవిధముగ జరిపితే బాగాఉంటుందో, దానిని గురించి సూచనలు చేశారు. Single Teacher Schools సరీగా జరుపబడటము లేదని అన్నారు. మధ్యాహ్నము పిల్లలకు భోజన వసతి కూడ చేయాలని అన్నారు. ఈ విషయములో మన ప్రధానినెహ్రూగారి సలహా కూడ ఉన్నది. అందువల్ల దీనికి ఏవిధముగ చేస్తే బాగావృద్ధిపొందుతుంది అని ఆలోచించిచెయాలి. దీనికి అవసరముగా చేయవలసిన పనులు అన్నీ చేయటానికి ఇది అంతా ధనముతో కూడిన పని గనుక అవి అన్నీ ముందుగా పరిశీలించితే తప్ప ఏవిధముగ చేయాలో, నేను యిప్పుడు ఆదమరపున చెప్పటానికి సాధ్యముకాదు.

నోపజిస్టు నాయకులు శ్రీ పి. నరసింగరావుగారు చాలా విషయాలు చెప్పారు. స్వరాజ్యం వచ్చి చాలాకాలం అయినా, విద్యాస్థాయి మాత్రం ఏమీ పెరగలేదు అన్నారు. బేసిక్ విద్యావిషయంలో మన ప్రభుత్వం శ్రద్ధ తీసికోవడం లేదన్నారు, తెలంగాణా teachers కు అన్యాయం జరుగుతున్నట్లుగా చెప్పారు. కాని వారు చెప్పిన ఏ ఒక్క విషయంతోనూ నేను ఏకీభవించలేక పోతున్నాను. విద్యారంగంలో ఎంత అభివృద్ధి చెందినాము అనే దృష్టితో పరిశీలన చేస్తే - స్వరాజ్యం వచ్చిననాటికీ యీనాటికీ, విద్యారంగంలో ఎంత అభివృద్ధి సాధించినామో అర్థం అవుతుంది. కాబట్టి జాగ్రత్తగా పరిశీలించవలసి వారికి

చెబుతున్నాను తెలంగాణా ఉపాధ్యాయుల విషయంలో నేను పక్షపాతం చూపిస్తున్నాను అంటే అది తెలంగాణా టీచరులకు అనుకూలంగానే చూపిస్తున్నాను కాని వారికి వ్యతిరేకంగా చూపడంలేదని మనవిచేస్తున్నాను. ఏసమస్య వచ్చినప్పటికిన్నీ తెలంగాణాను తగుస్థాయికి తీసుకొనిరావడంకోసం యీ ప్రభుత్వం జాగ్రతగానే కృషిచేస్తోంది. క్రిందటి సంవత్సరం యిక్కడ polytechnic పెట్టాలనే విషయం అది ఆఖరు సమయంలో వచ్చినప్పటికిన్నీ. డబ్బు లేకపోయినప్పటికిన్నీ వైజాగ్‌లో short fall ఉంటుందని యోచనచేసి అక్కడనుంచి యిక్కడకు తెచ్చి రు 2½ లక్షలు యిచ్చి యిక్కడ polytechnic పెట్టడానికి ఏర్పాటు చేశాము. ఈవిధంగా ఏమాత్రం వీలైనప్పటికిన్ని సాధ్యమైనంత త్వరలో తెలంగాణాలో విద్య కొరత లేకుండా చేయడానికి ప్రయత్నం చేస్తున్నాము.

ఈసభాముఖంలోనే శ్రీ నరసింగరావుగారికి యింకొక్క విషయం మనవి చేయవలసియున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని కార్మికులకు సహాయం చేయాలని వారు చెప్పారు, మంచిదే ఈవిషయమై ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులు ఒకసలహా చెప్పారు. ఆ సలహా ప్రకారం ప్రభుత్వం యీమధ్యనే ఒక ఏర్పాటుచేసినది. కాని విశ్వవిద్యాలయాలకూ, విద్యా సంస్థల దగ్గరకూ రాజకీయవాదులు వెళ్లకుండా, వారిని కార్మికరంగంగా తయారు చేయకుండా ఉంటే వారి అభివృద్ధి యింకా హెచ్చుగా ఉంటుందని మనవి చేస్తున్నాను. వారితో యీరాజకీయ పక్షాలు జోక్యం కల్గించుకోనక్కరలేదు· వారి అభివృద్ధి విషయం ప్రభుత్వానికి పూర్తిగా తెలుసును. వీరు ఆకార్మికుల విషయంలో ఏమాత్రం జోక్యం కలిగించుకున్నప్పటికీ - ఒక్క అడుగు వేసినప్పటికీ- వారికి నష్టమే కలుగుతుంది గాని లాభం కలుగదని మనవి చేస్తున్నాను. విద్యాలయాలు విద్యాలయాలుగానే పవిత్రంగా ఉండాలిగాని ఆప్రదేశంలో రాజకీయాలను ప్రవేశపెట్టి, ముడిపెట్టి, అమాయకులైన ప్రజలను రెచ్చగొట్టే పరిస్థితి కలుగజేసినట్లయితే నష్టమే కలుగుతుంది. ఇది ఒక్కటే తార్కాణం. ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని class 4 సిబ్బందిచేత strike చేయించినందువల్లనే ప్రభుత్వంవారి విషయమై తలపెట్టలేదు. వారు నిర్మలంగా, జాగ్రత్తగా పని చేసినప్పుడే ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయాన్ని అమలుచేస్తుంది. వారి అభివృద్ధి. శ్రేయస్సు ప్రభుత్వ దృష్టిలో ఉన్నాయని మనవిచేస్తున్నాను.

శ్రీ రావి నారాయణరెడ్డి : అధ్యక్షా,

***Sri S. B. P. Pattabhirama Rao:*** I am not yielding, Sir. There is no time.

Arts colleges ను పెంచకూడదనీ, Technical colleges ను encourage చేయాలనీ వారి అభిప్రాయం Technical education కూడా అభివృద్ధి చెందుతున్నది. Scientific knowledge తోబాటు humanities కూడా పెరగకపోతే అది సరైన విద్యకాదు. ఉప్పుతో సమానమైన కారం లేనట్లుగా తయారవుతుంది, షడ్రుచులూ ఉండాలి. అదేవిధంగా విద్యావిధానంలో అన్ని రంగాలలోనూ సమానంగా పెరగాలి Scientific knowledge ఒక్కటే అభివృద్ధి చెందితే దానిని యీ ప్రపంచంలో distruction కే use చేస్తారో, construction కే ఉపయోగిస్తారో తెలుసుకోడం కష్టం. అందువల్ల humanities కు కూడా సరైన స్థానం ఉండాలి అని ప్రభుత్వం భావించింది కనుక వాటికి కూడా స్థానం ఇస్తున్నారు. విద్యాస్థాయి అన్ని రంగాలలోనూ చక్కగా పెరగడానికి మంచి అవకాశాలున్నాయి.

ఇక, రామాచారిగారు చాలా విషయాలు చెప్పారు Constructive suggestions కొన్ని యిచ్చారు. అవన్నీ నామనసులో ఉన్నాయి వాటికి అనుగుణంగా జాగ్రత్తగానే ప్రయత్నాలు చేస్తున్నామని చెబుతున్నాను "School final పాస్ అయినవాడు 4 పద్యాలు చదువలేడు, వారికి హాస్టలులో తిండి ఖర్చులు రు 70/- లు అనీ, యింత ఖర్చుపెట్టి తిండితిని వాళ్లు ఏమిచమువు తారు" అనే ధోరణిలో మాట్లాడారు. నేనుమాత్రం వారి అభిప్రాయాలతో ఏకీభవించలేకుండా ఉన్నాను విద్యాస్థాయి అన్నిరంగాలలోనూ కొంతవరకు కుంటుపడి ఉన్నది. విద్యార్థులకు పూర్వపు standard లేదు. రామాచార్యులు గారు చదువుకొన్న రోజులకు యిప్పటికి పోలికలేదు. పూర్వపు standard రావడం కష్టమే అయినా, school final standard ను కొంతవరకు పెంచ డానికి ప్రయత్నిద్దాము. ప్రయివేటుగా పరీక్షలకు హాజరయ్యేందుకు అవకాశం కావాలన్నారు, అట్టి అవకాశం ఉన్నది. Private గా S. S. L. C. కి appear కావడానికి వీలు లేకపోయినా, యూనివర్శిటీవారు conduct చేసే S. S. L. C. సమానమైన Matriculation కు appear కావడానికి అవకాశం ఉన్నది. School లో చదవడానికి అవకాశంలేనివారు matriculation పరీక్షకు appear అవడానికి అవకాశం ఉన్నది· ఆ పరీక్ష pass అయితే intermediate లో చేరడానికి అవకాశం ఉంటుంది.

పి. వి. నరసింహారావుగారు చాలా విషయాలు చెప్పినారు. తెలంగాణా చాలా వెనుకబడినట్లూ, ప్రభుత్వంవారు పొరపాటు చేస్తున్నట్లూ చెప్పారు. అట్లా అనడం సరైనదికాదని మనవిచేస్తున్నాను. ఏదో ఒక item లో తక్కువ ఉంటే

యింకొక item లో హెచ్చు చేయడానికి మేము ప్రయత్నం చేస్తున్నాము మొత్తం బడ్జట్ ఎలాట్‌మెంట్ చూస్తే - - ఎక్బోటేగారు చెప్పినట్లు - - కేంద్ర ప్రభుత్వం శిఫార్సు చేసినట్లుగా తెలంగాణాకు 20% తక్కువకాకుండానే ఏర్పాటు చేశాము. ఆంధ్రకు 60%, 70% అయినప్పటికీకూడా తెలంగాణా percentage ని maintain చేశామని మనవి చేస్తున్నాను. ఇంకా ఎక్కువ కావాలంటే డబ్బు ఉంటే ఇవ్వడానికి మాకు ఏమీ అభ్యంతరం లేదు. డబ్బులేనప్పుడు సాధ్యం కాదు. ఎక్బోటేగారు చాలా విపులంగా మాట్లాడారు. చాలా statistics యిచ్చారు. అవన్నీ జాగ్రత్తగా పరిశీలన చేస్తాము. ఒక్కవిషయం వారికి మనవి చేయవలసిఉన్నది. వారుచెప్పిన కేంద్రంచేసిన శిఫార్సులకు తక్కువగా తెలంగాణాలో ఎక్కడా పెట్టలేదని చెబుతున్నాను 20% కు తక్కువ లేదు, పైగానే ఉన్నది ఆంధ్రలో ఏమైనా తక్కువ ఉంటే కొంచెం ఓపిక పట్టాలి. పెద్ద అన్న కొంచెం జాగ్రత్తగా ఓపికతో ఉండాలి. చిన్నన్న తనతో సమానంగా వచ్చేవరకూ కొంచెం ఓపిక పట్టవలసియున్నది

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు "ఒక fine evening న యీ విద్యారంగం అంతా ఒక్కసారి spectacular గా improve కాదు" అని చెప్పారు. అది practical aspect. ఇంకా, ఉపాధ్యాయులను గురించి, వారి జీతాల స్కేళ్ళను గురించిచెప్పారు. కొన్ని వ్యవహారాలలో చాలా delay అవుతున్నదనీ దానిని తగ్గించాలనీ వారు చెప్పారు. ఈ విషయాన్ని నేను అంగీకరించకతప్పదు. మేము యీ ప్రభుత్వంలోకి వచ్చిందిలగాయితూ ఆ delays ను తగ్గించడానికి అతి శ్రద్ధతో ప్రయత్నం చేస్తున్నాము. ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణంవల్ల work కొంతవరకు heavy గా ఉంటున్నది. అన్నింటినీ సర్దుబాటుచేసుకొని తొందరలో action తీసుకోవడం కష్టమవుతున్నది Department వారుకూడా క్రమేపీ delays ను rectify చేసి pull-up చేస్తున్నారనుకొంటున్నాను వారు చెప్పిన అభిప్రాయాలకు భిన్నం కాకుండా త్వరగానే standards ను improve చేయగలమని నేను ఆశిస్తున్నాను Basic schools విషయంలో పరిశీలన చేయనిదే నేనేమీ చెప్పలేను. పరిశీలనచేసి తగిన చర్యలు తీసుకొంటామని మనవి చేస్తున్నాము శ్రీ ఎక్బోటేగారు మాట్లాడుతూ "Education is a state subject and not a central subject" అన్నారు. ఈ విషయం యీనాటిది కాదు. 10 సంవత్సరముల నుంచి, constitution pass అయినప్పటినుంచీ ఉన్నది. ఆనాడే యిది State Subject అని తెల్పుతున్నాము. ఇది Central-Subject కాదని వారికి హెచ్చరిక చేస్తున్నాము. State-Subject ను ఏవిధంగా చూడాలో అదేవిధంగా వారూ చూశారు - ఇప్పుడు నేనూ చూస్తున్నానన్నక్కుం

టున్నాను. మనకున్న డబ్బులోనే ఖర్చు చేసుకోవాలి కాని, లేనిడబ్బును తేవ డానికి అవకాశంలేదు. కనుక ఉన్నదానితోనే తగినవిధంగా ఖర్చుచేయడానికి ప్రయత్నిస్తాము ఆంధ్రలో 17 high schools పెట్టి ఇక్కడ ఒకే హైస్కూలు పెట్టారు అని నరసింహారావుగారు అన్నారు అది కొంచం అప్రక్రమలో ఉన్న విషయం ఆంధ్రలో ఉన్నవి private schools. ఈ సంవత్సరం Government schools ఏమీ పెట్టినట్లు నాకు జ్ఞాపకంలేదు.

శ్రీ పి వి. నరసింహరావు ఆంధ్రలో విషయం నేను చెప్పలేదు. తెలంగాణాలో మాత్రం ఒక్కటే ఉన్నదని చెప్పినాను.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు వారు కాకపోతే యింకొకరు. ఈ సభలోని ఎవరో ఒకరు చెప్పారు.

శ్రీ పి సుందరయ్య :- 17 schools ఉన్నాయి, అవి చాలవని నేను చెప్పినాను. అంతేకాని అక్కడ 17 schools పెట్టారని ఇక్కడ ఒక్కటే పెట్టారనీ నేను చెప్పలేదు. అక్కడ 17 schools పెట్టడం గొప్పకాదు. ఇక్కడ ఒక school పెట్టడం గొప్పకాదు.

శ్రీ ఎస్ బి. పి. పట్టాభిరామారావు : తెలంగాణాలో పెట్టినది Government School. ఆంధ్రలో Government school ఏర్పాటు చేయ లేదు. తెలంగాణా వెనుకబడినది. Private agencies రావు. అంతకంటే ఖర్చు చేయడానికి మనదగ్గర డబ్బులేదు. డబ్బు ఉన్నా, తెలంగాణా ఏరియాలో ఉన్న డబ్బునే ఖర్చుపెడుతున్నారు కాని ఎక్కడనుంచో తెచ్చి ఖర్చుచేయడంలేదు. కొన్ని కొన్ని సంస్థలలో పైనుంచి తీసుకువచ్చి ఖర్చుపెట్టినాము. తెలంగాణాను వెనుకబెట్టే దృష్టితో చేయుటలేదు. ఎంతత్వరలో సరిచేయడానికి వీలవుతుందో అంతత్వరలోనూ చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. రామకృష్ణరాజుగారు చెప్పినట్లుగా sudden గా on a fine evening న spectacular results రావా లంటే యిది సాధ్యంఅయ్యే విషయంకాదు. ఇది ధనంతో కూడిన విషయం ధనం చేకూరిన తరువాత ఆంధ్ర - తెలంగాణాలను సరిపుచ్చడానికి ప్రయత్నం చేస్తామని మనవి చేస్తున్నాను.

ఎక్కొటేగారు "III plan అయ్యేటప్పటికీరాదు, IV plan అయ్యేటప్పటికీ రాదు, V plan అయ్యేటప్పటికీ కూడా ఏమీ సమన్వయంకాదని" చెప్పారు. పూర్వపు హైదరాబాదు ప్రభుత్వమే యీ second plan ను నిర్ణయించినది. అందులోని provisions ను మేము improve చేశామేకాని ఏమీ తగ్గించలేదని మనవిచేస్తున్నాను. III plan విషయం వచ్చినప్పుడు యోచనచేస్తాము. ఉన్న

విషయాలన్నింటినీ జాగ్రత్తగా పరిశీలనచేసి విద్యాలోకంలో standards గాని, గట్టితనంగాని, విస్తరణగాని పెంచడానికి వీలైనంతవరకూ ప్రయత్నంచేసి తప్పకుండా పెంచుతామని మనవిచేస్తున్నాను.

ప్రతిపక్షనాయకులు "గతసంవత్సరంలో కొన్ని సూచనలు చేశాము, వాటిని ఆచరణలో పెట్టలేదు." అని చెప్పారు. అది చాలా పొరపాటు. వారు చేసిన సూచనలన్నిటినీ కూడ పరిశీలనచేస్తున్నాము. చాలా విలువైన సూచనలే అవి. కాని ధనంతో (ఖర్చుతో) కూడిన సూచనలుకూడా ఉన్నాయి వాటన్నింటినీ పరిశీలన చేసిన తరువాత ఆచరణ యోగ్యమైనంత వరకూ ఆచరణలో పెట్టడానికి ప్రయత్నం చేస్తాము మద్రాసులో అన్ని పార్టీలు కలిసిచేసిన సూచనలు, white paper లోని సూచనలు మద్రాసు ప్రభుత్వానికి చాలా లాభకరంగా ఉన్నాయని, అవి మనం కూడా అమలు చేస్తే మంచిదని వారు సూచన చేశారు అవి మనకు ఎంతవరకు లాభం ఉంటుందో—పరిశీలన ప్రారంభించాము. మన విద్యాశాఖ కార్యదర్శిగారు మద్రాసు ప్రభుత్వానికి వ్రాసి ఆ వివరాలన్నీ తెప్పించారు. ఒక్కొక్క రాష్ట్రంలో కొన్ని వీల్లు ఉంటాయి వాటివల్ల ఆ ప్రాంతం బాగుపడడానికి అవకాశం ఉంటుంది. కాని ఆ రాష్ట్రంలో పెట్టారుకదా అని అదే అందరూ copy చేయడం సాధ్యమైన విషయంకాదు. మంచిది కూడా కాదు. మన సంస్కృతి వేరు, పద్ధతులు వేరు, తరాలు వేరు. అందులోను యిప్పుడు మనం రెండు భాగాలకు సంబంధించిన విషయాలను చూచుకోవాలి ఆంధ్రలో విద్యాస్థాయి ఒక విధంగా పెరిగింది. తెలంగాణలో మరొకవిధంగా పెరిగింది. వీటిని సమన్వయం చేసుకోవలసియున్నది అంతేకాని మద్రాసులో పెట్టినంతమాత్రాన, వివిధ పక్షాలు, చెప్పినంత మత్రాన తుచ తప్పకుండా మనం అమలు చేయడం సాధ్యం కాదు. కాని అందులో ఏమైన మనకు పనికి వచ్చేది వుంటే తప్పకుండా గ్రహించుదాము. ఇప్పుడు పరిశీలనలో ఉన్నది. ఇంతకంటే హెచ్చుకాలం నేను వినియోగించడం మంచిది కాదనుకుంటాను. విద్యాస్థాయి పెరగాలి, కట్టుదిట్టమైన విద్య కావాల నేదే మనలక్ష్యం అని మనవి చేస్తున్నాను.

కట్టుదిట్టమైన విద్య రావాలనీ ఇతర రాష్ట్రాలకంటె ఆంధ్రప్రదేశ్ మిన్నగా ఉండాలనీ, అనతికాలంలోనే దానిని సాధించాలనే అభిప్రాయంతో మేము ఈ విద్యా బడ్జెటును తయారుచేసినాము. ఇందులో ఉపాధ్యాయులకు పొరపాటు చేస్తున్నట్లు, వారిని అపార్థం చేసుకుంటున్నట్లు కొందరు సూచించారు అది ఎంతమాత్రమూ వాస్తవం కాదు. ప్రభుత్వమునకు ఉపాధ్యాయులమీద,

వారి వృత్తిమీద ఎంతో గౌరవమున్నది. వారి శ్రేయస్సే ప్రభుత్వ లక్ష్యమని మనవి చేయుచున్నాను ఉపాధ్యాయులు రాజకీయ రంగములో దూకకుండా, అటూ, ఇటూ చదరంగం ఆడించే వారిచేత వారు ఆడించబడకుండా ఉన్నచో వారి శ్రేయస్సుకే మంచిదని దేశం బాగుపడుతుందని, విద్యాస్థాయి పెరుగుతుందని మరల ఒకసారి మీకు మనవి చేయుచున్నాను హైకోర్టు ఇచ్చిన జడ్జిమెంటును ప్రభుత్వం ధిక్కరించినట్లు కొందరు చెప్పినారు కాని అది కరెక్టుకాదు. హైకోర్టు జడ్జిమెంటు ఏదో చెప్పి ఉండవచ్చును. కాని ఆంధ్రప్రభుత్వం ఇచ్చిన G O ను బాగా పరిశీలనచేసి Atorny-General of India యొక్క openionకు బద్ధులమయ్యే పద్ధతిన సర్వీసు రూల్సును ఏర్పరచారు. జిల్లాబోర్డులో కాని, ప్రభుత్వంలో గాని ప్రతి సర్వీసుకు రూల్సు ఉన్నాయి. అందులో పనిచేయు వారంతా ఆ రూల్సుకు బద్ధులై ఉండాలి. ఐతే "నేను జీతం తీసుకుంటాను. మీదగ్గరే పనిచేస్తాను కాని సర్వీసు రూల్సులో నీకు నాకు సంబంధం లేదు" అనే పరిస్థితులలో ప్రపంచములో ఏ హైకోర్టుగూడ తీర్పు ఇస్తుందని నేను అనుకోను. ఏనాడు అయినప్పటికి హైకోర్టు వాటి తీర్పులమీద ఎంతో గౌరవం ఉండి ఆ పద్ధతుల ప్రకారం చేసేది మా ప్రభుత్వ కాంగ్రెస్ పార్టీ అని మనవి చేస్తున్నాను. హైకోర్టును ధిక్కరించే పరిస్థితిలో మా పార్టీగాని, మా ప్రభుత్వం కాని, ఈ జాతీయ ప్రభుత్వం గాని ఉండవని చెప్పుతున్నాను వారు అవి అన్ని పరిశీలన చేసి ఉపాధ్యాయ వృత్తి యొక్క interest కోరి వాటిని తయారు చేసినారు. కాని కొంతమంది ఉపాధ్యాయులు మిస్‌గైడ్ ఔతున్నారు. ఒకప్పుడు ఉపాధ్యాయుడుగా ఉండి దానిని resign చేసి, సంచి చేతికి తగిలించుకొని, చందాలు వసూలుచేస్తూ తమకోసమే మంచి చేస్తున్నామని చెప్పి ఒక సంఘమును పెట్టినంత మాత్రాన అది ఎంతవరకు లాభిస్తుందో వారే యోచించుకోవాలి. వారికి చెప్పవలసిన అవసరంకూడా ప్రభుత్వంపై ఉన్నది. అందువల్ల మేము వారికేమీ రెస్ట్రిక్షన్సు పెట్టలేదు. కాని రూల్సు కొన్ని ఏర్పరచాము. ఆ రూల్సు వారికి ఇష్టమైతేనే చేరుతారు. ప్రభుత్వ సర్వీసులో కాని, జిల్లాబోర్డు సర్వీసులో కాని ప్రతి ఉద్యోగస్తుడు ఆ నియమాలను పాటించవలసియున్నది. అందువల్ల ఒక్క ఉపాధ్యాయులకే కాదు. ప్రతి ఉద్యోగస్తుడు పాటించితీరాలి. Request చేస్తున్నందుకు క్షమించాలి. ఉపాధ్యాయవర్గము అంటే ప్రభుత్వానికి చాలా గౌరవము ఉన్నది. వారి శ్రేయస్సే మా లక్ష్యంగా ఉన్నది. వారుకూడ సరియైన పద్ధతిలో "గురుకులం, గురుకుల ఆచార్యులు" అనే గౌరవాన్ని దక్కించుకొని ప్రభుత్వంలోనే కాదు; ప్రజలలో, ఆయా ప్రదేశాలలో వారి గౌరవమును పెంపొందించుకొన్నచో ఆ వృత్తికేగాక, ఆశాఖకే గౌరవం పెరుగుతుంది. ఆ పద్ధతిలో నడిపించాలని ప్రభుత్వం యొక్క లక్ష్యమని మనవిచేస్తున్నాను.

తరువాత పురాతనవస్తు సంరక్షణగురించి ప్రతిపక్షనాయకులు చెప్పినారు అది చాలావరకు సెంట్రల్ subject వారే చేస్తున్నారు ఏ ప్రదేశములో నైనా రాష్ట్రం చేయవలసింది ఉంటే నాదృష్టికి వచ్చిన తప్పకుండా చేస్తాం. ఇంతకంటే మనవిచేసేది ఏమీలేదు అన్నింటికి సాకల్యంగా జవాబు ఇచ్చినాను అనుకొంటాను కాబట్టి కట్ మోషన్సును with-draw చేసుకొని ఈ డిమాండును ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుచున్నాను.

శ్రీ బి. ధర్మబిక్షం : అధ్యక్షా, టీచర్సు వచ్చి interview అడిగితే మంత్రిగారు నిరాకరించారని తెలిసింది ఇదివరకు చర్చకూడ వచ్చింది....

శ్రీ యస్. బి. పి పట్టాభిరామారావు : ఈవేళ రాలేదే ?

శ్రీ బి. ధర్మభిక్షం గోపాలరెడ్డిగారు ఇదివరకే చెప్పినారు మంత్రిగారు ఆసమయానికి స్నానానికి వెళ్లివుండవచ్చునని వారు అన్నారు.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు లేదండి ఆ విషయమంతా చెప్పుతాను. రాత్రి నిద్రపోవునప్పుడు వచ్చి తలుపు కొట్టి ఇంటర్వ్యూ ఇవ్వమంటే అది సాధ్యమయ్యే విషయం కాదు. నేను ఆఫీసులో 11 గంటల నుండి 6 గంటల వరకు ఉంటున్నాను నేను ఆఫీసులో ఉన్నంతకాలం టీచర్సుకే కాదు. ఎవరు వచ్చినా interview ఇస్తున్నాను. హఠాత్తుగా, ఏదో ప్రమాదం ముంచుకు వచ్చినట్లు అర్ధరాత్రి వచ్చి interview ఇవ్వమన్నచో అది సాధ్యంకాదు. నేను అలా ఇచ్చేవాడిని కాదు, ఉదయం ఇంటి దగ్గర కూడా interviews ఇస్తున్నాను అధ్యక్షా, కొంతమంది ఒక ప్రత్యేక ఉత్సాహంతో interviews అడుగుతున్నారు. వారు భూమిని, ఆకాశమును తెంటిని ముడిపెట్టినా సరిపోనట్టి మెమోరాండములను తీసుక వస్తున్నారు. వారు చేప్పేవన్ని సావకాశంగా వింటాము. వాటి విషయం ఆలోచిస్తామని చెప్పుతాము. వెంటనే వారు ప్రెస్‌కు వెళ్ళి మంత్రిగారితో చర్చించినాము. వారు అంగీకరించారు అని మా తరపున పేపర్లలో వేయించుచున్నారు ఇది న్యాయమా అని అడుగుచున్నాను. ఇవి అన్నీ ఉపాధ్యాయవర్గం చేయుట లేదు. నేను మనవి చేసినట్లు కొంతమంది సంచులు తీసుకొని బయలుదేరి చందాలు వసూలు చేస్తూ దీనిని profession గా పెట్టుకున్నారు. ఈ విధంగా ఉన్నప్పుడు నేను ఏమి చేయగలుగుతాను? అలా కాదు. Recognise అయిన యూనియన్సు వారు గాని, సంఘాలవారుగాని ఎప్పుడు వచ్చినా తప్పకుండా interviews ఇస్తున్నాను. ఒక వేళ నాతో సాధ్యం కాకపోయినా సెక్రటరీతో గాని, D. P. I. తో గాని చెప్పమని postpone చేయుటలేదా వెంటనే

చేయడం మంచిదనే ఉద్దేశంతో వారితో చెప్పుచున్నాను. అంతేకాని ఎప్పుడో వారు వస్తే నేను interview ఇవ్వలేదినడం చాలా పొరపాటు. ఆచెప్పిన వారే నన్ను ఎన్ని సార్లు వరంగల్ కు రమ్మంటే నేను అన్నిసార్లు వెళ్ళాను. ఎన్ని సభలను చూడమంటే అన్ని సభలనూ చూచాను. అందువల్ల అది వాస్తవమైన విషయం కాదని మనవి చేయుచున్నాను. ఇంతకంటే ఈ విషయం గురించి చెప్పడం మంచిదికాదనుకొంటాను.

శ్రీ యస్. సి. శేషాద్రి (రాయదుర్గం) అధ్యక్షా, Evening colleges గురించి ఒక అర్జీ ఇచ్చారని తమరు చదివినారు. ఆవిషయం గురించి ఏమైనా మంత్రిగారు చెప్పుతారా ?

శ్రీ యస్. బి. పి పట్టాభిరామారావు ఆ విషయం గురించి నా ఉపన్యాసంలో చెప్పినాను అనుకుంటాను. అది విశ్వవిద్యాలయంతో correspondence లో ఉంది. అది వారు చేయవలసిన పని గాని మనం చేయవలసినది కాదు

శ్రీ యం. సత్యనారాయణరాజు అధ్యక్షా, అది యూనివర్సిటీవారు చేయవలసిన పని ఐనప్పటికి ప్రభుత్వమునకు యూనివర్సిటీకి ఆర్థిక స్తోమతును కలుగచేయుటలో కొంత బాధ్యత ఉన్నది. కాబట్టి ప్రభుత్వం యొక్క అభిప్రాయమును గూడా కొంత తెలియచేసిన బాగుంటుంది కదా ?

శ్రీ యస్ బి. పి. పట్టాభిరామారావు యూనివర్సిటి ఒక అటానమస్ బాడి. దానికి కొన్న పాలిసీస్ ఉన్నవి. వాటిలో ఎక్కువ ఇంటర్ ఫియర్ అయిన విద్యాధికులు ఒప్పుకోరు. వారు ఒక నిర్ణయానికి వచ్చి ప్రభుత్వ సహాయమును అడిగిన యోచించగలరు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, నాగార్జునకొండకు ఎదురుగా ఉన్న ఏలేశ్వరంలో ఎక్కవేషన్సును ఇదివరకు హైదరాబాదు ప్రభుత్వం నడుపుతుండేది. అక్కడ పని చేస్తున్న staff ను వెనక్కు వచ్చేయమని ఆర్డర్సు ఇచ్చినట్లు తెలిసినది నాగార్జునసాగర్ నిండిన ఆ పని సాధ్యం కాదు. దాని విషయం ఏమిచేస్తున్నారు? అది హైదరాబాదు ప్రభుత్వం తీసుకొన్నది. కాని అది కేంద్ర సబ్జక్టు కాకుండా మన సబ్జక్టు ఐనది. కాబట్టి దాని విషయం చెప్పుతారా ?

*Sri. S. B. Pattabhi Rama Rao :* With the help of the Nagarjunasagar Control Board, the Government are condu-

cting archaeological excavations at Elleswaram in the submersible area of the Nagarjunasagar Project. The Board has placed an amount of Rs 30,000/- at the disposal of the Director of Archaeology for conducting the excavations With the suggestions made by the Director General of Archaeology in India, the Director of Archaeology has selected the following important sites for excavation purposes :—

Elleswaram temple site area
Chandriah field site
Krishnapuram Stone Circle site

The main object of undertaking excavation of the site is to gather every bit of information that can be obtained regarding the historical and cultural continuity of the archaeological remains from the Stone ages down to the late mediaeval times.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అక్కడ పనిజరుగుటలేదు. అందరిని అక్కడనుండి వెళ్ళిపొమ్మన్నారు అందువల్ల వారు సామాన్లతో సహా హైదరాబాదు వచ్చేసినారు కాబట్టి ప్రభుత్వం ఆ విషయంగురించి ఆలోచించి, మరల పని జరిపిస్తుందా ?

శ్రీ కె. వెంకటరావు .- పని జరిపిస్తాము.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, గౌ॥ రెవిన్యూమంత్రి గారిని కాదండి. పట్టాభిరామారావుగారు ఎక్కవేషన్సు గురించి చెప్పుతారా అని అడుగుతున్నాను.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు: టైం ఇస్తే తెప్పించి చెప్పుతాను.

మిస్టర్ స్పీకర్ : పని జరగాలనే ఉద్దేశంతో ఉన్నారు. పని జరుపుతాము అంటున్నారు. Temporary suspention ఉంటే వ్రాయండి. వారు జవాబు చెప్పుతారు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :- అధ్యక్షా, దానికి ఒక కట్ మోషన్ ఉన్నది. అందువల్ల information తెప్పించి సాకల్యంగా చెప్పి ఉండవలసింది.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు :- నేను చెప్పినాను కదండి, సెంట్రల్ గవర్నమెంటు ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు ఇన్‌స్ట్రక్షన్సును బట్టి

జరుగుతుంది. అందుచేత ఆ subject ను గురించి అంతకంటె ఎక్కువ చెప్పటకు వీలు లేదు

మిస్టర్ స్పీకర్ :- ఆ కట్ మోషన్‌లో తాత్కాలికంగా మానివేశారా అని లేదు జనరల్‌గా అశ్రద్ధ చూపుతున్నారని ఉన్నది.

*Demand XVII—Education Rs.* 12,03,62,000

*Mr Speaker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Government to grant two lakhs of rupees to the Andhra University as a special grant for preparing an authoritative Telugu social and cultural history within two years.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

ప్రీ యూనివర్సిటీ కోర్సును యెత్తివేయవలెనని కోరుటను

To reduce to allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Government to introduce Telugu as the medium of language in elementary, secondary and University education.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To impress upon the Government to introduce Pre-Primary class and the four classes in the elementary section, four-year course in secondary education and finally three year Degree course with vocational either of agricultural or industrial courses.

The motions were negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

జిల్లాలనుండి వచ్చే పిల్లలకు జిల్లాలలోనే కాలేజీలు ఏర్పాటుచేయనందుకు

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

ఉద్యోగులను జిల్లాలలోనే ఉంచి, పట్టముణనకు తబాదిలా చేయనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

విద్యార్థులకు స్కాలర్‌షిప్పు దొరకనందులకు మరియు పాలపౌడర్ సక్రమంగా పంచనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

నిర్బంధ ప్రాధమిక విద్య ఆంధ్రప్రాంతములలో అమలులో పెట్టలేనందులకు.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs 100/-

పల్లెటూళ్లలో ఉండే అధ్యాపకులకు ఇంటి సౌకర్యము కలుగజేయనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

వయోజన పాఠశాలలు నడుపనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs 100/-

డిప్యూటీ ఇన్‌స్పెక్టరులకు వాహన సౌకర్యములు కలుగజేయనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

వైస్‌ఛాన్సలరును అప్పాయింట్ చేసినపుడు ప్రభుత్వము ఈ బడ్జెటు సెషనులో బిల్లు ప్రవేశపెట్టనందుకు, చర్చజేయుటకు

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

వరంగల్లులో ఇంజనీరింగు కాలేజి పెట్టనందులకు

The motions were negatived.

*Mr. Speaker.* The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to take steps to establish an Engineering College in Warangal

The motion was negatived.

*Mr. Speeker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

For the failure of Government to up-grade elementary education

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

For the failure of Government to repair elementary school buildings

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

For the failure of Government to increase the salaries of low paid teachers

The motions were negatived.

*Mr. Speaker:* The question is:

Te reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

పరీక్ష పద్ధతులను సరిగా నడుపలేక అక్రమచర్యలు ఆచరించుచు పరీక్ష ఫలితములను చెడగొట్టుచున్నందులకు

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

జోగిపేట హైస్కూల్‌కు వైద్య సామాను సప్లయి చేయనందుకు

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

ప్రభుత్వము తెలంగాణాలో విద్యావిధానమును విమర్శించుటకు, జోగిపేటలో ప్రైమరీ సైపు బిల్డింగులో మిడిల్ క్లాసు హైస్కూలు నడుపుచున్నందులకు

The motions were negatived

*Mr Speaker* · The question is ·

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

ముధోల్ తాలూకాలో ఉండబడిన మరాఠీ అధ్యాపకులను యింతమటుకు మరాట్వాడాకు పంపక విద్యార్థుల విద్యను నష్టపెట్టినందులకు

The motion was negatived.

*Mr. Speaker* : The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to take steps to see Telugu is being adopted as medium of instruction including in University stage.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the attitude of the Government towards teachers in curtailing their liberty to form associations.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to develop the three Universities and also to co-ordinate their activities.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to utilise fully the allotments made for Telangana area for education.

The motions were negatived.

*Mr Speaker* The question is·

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs 100/-

సాంఘిక సంక్షేమ పాఠశాలలలో పనిచేయు సెకండరీ గ్రేడు టీచర్లను గవర్నమెంటు లెటరు. నెం 30925 - క్యూ - 56 - 9 తే. 23-3-56 మేరకు యిప్పటివరకు డిప్యూటీ ఇనస్పెక్టర్లుగా ప్రమోషన్ యివ్వనందుకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

జీవనప్రమాణసూచక దృష్ట్యానూ, జీవిత అవసర వస్తువుల ధరల పెరుగుదల దృష్ట్యానూ, ప్రాథమిక సెకండరీ కళాశాల ఉపాధ్యాయ, అధ్యాపకుల జీతభత్యములను పెంచనందుకున్నూ, వారికి కరువుభత్యము కేంద్రఉద్యోగులతో సమానముగా జీతములతో కలుపనందుకు.

The motions were negatived.

*Mr Speaker*. The question is.

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

ప్రభుత్వానికి ఒక నిర్దుష్ట విద్యావిధానములేనందులకు, కళాశాలలో తెలుగులో విద్యాబోధన చేయడానికి ఎలాంటి కృషి చేయనందులకు, ప్రాథమిక విద్యనైనా బాలబాలికలందరకు ఉచితముగా నేర్పడానికి విఫలమైనందులకు, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకు తగురీతిగా జీతాలు పెంచనందులకు, వారిలో వేలకొలది మందిని పనిలోనుండి తొలగించి నిరుద్యోగులుగా చేస్తున్నందులకు, కుప్పుస్వామి కమిటీ రిపోర్టులోని సూచనలను పూర్తిగా అమలుపరచనందులకు, ప్రాథమిక పాఠశాలలో ఒక్కొక్క ఉపాధ్యాయునికి విద్యార్థుల సగటు హాజరును తగ్గించనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

కోవూరు తాలూకా రామవరం గ్రామంలో షుమారు 120 మంది విద్యార్థులతోనూ, 5 గురు ఉపాధ్యాయులతోనూ, నిర్వహింపబడుచున్న ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల రికగ్నిషన్ రద్దుపరచి విద్యార్థులకు అసౌకర్యం కలుగజేసినందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

దామవరం గ్రామస్తులు పాఠశాల భవనాలను రిపేరుచేయించి 5 గురు వుపాధ్యాయులతో పిల్లలకు చదువు చెప్పించుకొనే సదుపాయం కలుగజేయమని కోరినప్పటికి ఇంతవరకు ప్రభుత్వం జాప్యం చేస్తున్నందులకు

The motions were negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Government to sanction grants for private colleges specially to those which are run in backward area.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs 100/-

To impress upon the Government to sanction atleast Rs. one lakh as grant in-aid to Adilabad Science College.

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

To impress upon the Government to sanction the housing scheme specially for low paid teachers.

The motions were negatived.

*Mr. Speaker* · The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the policy of Government rural education and draw backs in the department

The motion was negatived.

*Mr. Speaker* : The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

విద్యావిధానములో అత్యవసరమయిన మార్పులు చేయనందులకు

అధికారేతరులతో కూడిన టీచర్సు సెలెక్టు కమిటీలను తెలంగాణములోని జిల్లాలయందు రద్దు పరచనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs 100/-

ఉపాధ్యాయుల వేతనములు పెంచనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

కొన్ని సంవత్సరములనుండి ఉపాధ్యాయులుగా పని చేయుచు పాఠశాలలను అభివృద్ధిచేసిన వాలంటయరీపాఠశాలల ఉపాధ్యాయులను తొలగించినందులకు

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs 100/-

వయోజనుల విద్యా విషయమై తగు శ్రద్ధ వహించనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs. 100/-

నిర్బంధ ప్రాథమిక విద్యా విధానము అమలు జరుపుటలో విఫలమయినందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

పాఠశాలలో విద్యార్థులసంఖ్యననుసరించి ఉపాధ్యాయుల సంఖ్యను అధికము చేయలేకపోయినందులకు

The motions were negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

పాఠశాలలయందు విద్యార్థుల సంఖ్య అధికమగుచున్నందున వారికి సరిపోవు స్కూలు భవనములు కట్టించుటలో ప్రభుత్వము శ్రద్ధ వహించనందులకు

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

The motions were negatived.

*Mr. Speaker* · The question is :

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

ఉపాధ్యాయుల జీతాలను టి. టి ఒ. కార్యాలయమునుండి వారు ఆలస్యంగా పంపించుచున్నందులకు.

The motion was negatived.

*Mr Speaker :* The question is :

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

మల్టిపర్పస్ హైస్కూళ్ళ విద్యార్థుల ఫీజు పెంచుట గురించి చర్చించుటకుగాను, మల్టిపర్పస్ స్కూళ్ళలో కోర్సు ననుసరించి పరికరాలు సప్లయిచేయుటలో ట్రైన్డు టీచర్సును నియమించుటలో విఫలతజెందుట గురించి చర్చించుటకై

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

బేసిక్ స్కూళ్ళు నామకః తెరువబడి వాటికి అవసరమైన శిక్షిత టీచర్లు నియమించకపోవటం, విజయవంతంగా నడుపకపోవటం గురించి చర్చించుటకై.

తెలంగాణాప్రాంతంలో ప్రైమరి మరియు మిడిల్ స్కూళ్ళకై ప్రభుత్వ భవనాలు నిర్మించుటలో విఫలత జెందుట గురించి చర్చించుటకుగాను.

The motions were negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

తెలంగాణాలోని మిడిల్ కమ్ హైస్కూళ్ళన్నిటినీ హైస్కూళ్ళుగ పరిగణించి పూర్తి శాంక్షన్ యివ్వకపోవటం గురించి చర్చించుటకుగాను.

The motion was negatived.

*Sri B. Dharma Bhiksham* : I demand a division sir.

The House then divided

Ayes. 36, Noes: 108

The motion was negatived.

*Mr. Speaker :* The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

నల్లగొండ హైస్కూలులోని ఉర్దు సెక్షన్సుకు టీచర్సుకొరతను చర్చించుటకుగాను.

The motion was negatived.

*Mr. Speaker* . The question is :

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to take over aided elementary schools in general and those in Vizagapatnam District as stated earlier by the Government.

To reduce the allotment of Rs 12,03,62,000 for education by Rs 100/-

To discuss the failure of the Government to verify the scales of pay of teachers working in Aided, Board, Government schools.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To criticise the failure of the Government to implement the recommendations of the Kuppuswamy Committee.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to reduce the average attendance from 25 to 20 in the Primary Schools in the State.

The motions were negatived.

*Mr. Speaker* · The question is

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To criticise the undemocratic and unconstitutional attitude of the Government towards the teachers who are restrained to join the associations only after obtaining the permission of the Special Officer.

The motion was negatived.

*Sri B. Sriramamurthy* : I demand a division Sir

The House then devided

Ayes, 41, Noes: 108

The motion was negatived

*Mr. Speaker* The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to increase the scales of pay of the teaching staff in Colleges in consonnance with the recommendations made by the University Grants Commission.

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100

To discuss the failure of the Government to extend cheap education facilities.

The motions were negatived.

*Mr. Speaker* : The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000 for education by Rs. 100/-

To discuss the failure of the Government to start Night Colleges in Andhra and Venkateswara Universities.

The motion was negatived.

*Sri B. Sriramamurthy* : I demand a division Sir

The House then devided.

Ayes 42, Noes: 109

The motion was negatived.

*Mr. Speaker* : The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

To discuss the failure of the Government to provide adequate material to the Schools for imparting instructions in crafts and manual training.

The motion was negatived

*Mr. Speaker* : The question is.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs 100/-

తెలంగాణా ప్రాంతములో ట్రైనింగుకువెళ్ళిన ఉపాధ్యాయుల స్థానములు బడులలో ఖాళీలు వుంచి, పిల్లలయొక్క విద్య సరియైన విధంగ నడిపించనందులకు

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

వాలంటరీ బడులలోనుండు ఉపాధ్యాయులను వందలకొలది తొలగించి నిరుద్యోగ సమస్య కలిగించినందులకు.

The motions were negatived.

*Mr. Speaker :* The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

For the failure of the Government to bring a Bill to amend the Osmania University Charter and not meeting the genuine demands of the University employees.

The motion was negatived.

*Mr Speaker*: The question is

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

ఉపాధ్యాయులకు నెలసరి వేతనాలు అందించడంలో మాసాలతరబడి జరుగుచున్న ఆలస్యమును గురించి, సకాలములో వేతనాలు చెల్లించు పద్ధతిని ప్రవేశపెట్టకపోవడం గురించి.

To reduce the allotment of Rs 12,03,62,000/- for education by Rs. 100/-

ప్రాథమికోపాధ్యాయ సంఘాలు నిర్మించుకొనుటపైనను తమ వృత్తి సంఘాలలో చేరుటపైనను అనేక నిషేధాలను ప్రయోగించటం విషయంలో నిషేధాలను తొలగించకపోవడం విషయంలోను.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

ప్రాథమికస్కూళ్ళలో వివిధరూపాలలో విద్యార్థులనుండి వసూలుచేయబడుచున్న నాన్-గవర్నమెంటల్ ఫీజులు లెక్కలు పరిశీలించు అధికారమును పేరెంట్సు కమిటీలకు అప్పగించకపోవడం గురించి, పేరెంట్సు కమిటీల సమావేశములు సక్రమంగా జరిపించకపోవడం గురించి.

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs 100/-

స్కూళ్ళకు అవసరమైనంత మంది ఉపాధ్యాయులను సకాలంలో పంపకపోవడం గురించి, ఉపాధ్యాయులు లేక ఉపాధ్యాయినులు ఆలస్యంగా పంపబడి కోర్సు పూర్తికాక పరీక్షలలో విద్యార్థులు అధిక సంఖ్యలో ఫేల్‌కావడం జరుగుచున్నప్పటికివి శ్రద్ధ చూపక విద్యార్థుల కాలమును, తలిదండ్రుల ధనమును వృధాపరుస్తున్న విధానమును గురించి.

**The motions were negatived.**

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వ పాఠశాలలకు స్వంత భవనాలు 70 శాతము లేకపోవడంవల్ల స్కూళ్లు నడుపుటకై యిబ్బంది కలుగుతున్న విషయాన్ని చర్చించుటకు గాను.

The motion was negatived

*Mr Speaker*: The question is:

To reduce the allotment of Rs. 12,03,62,000/- for education by Rs. 100/-

ఉపాధ్యాయుల వేతనాలు మొదలగు కోర్కెలను ప్రభుత్వం అంగీకరించక పోవటం గురించి చర్చించుటకుగాను.

The motion was negatived

*Sri B. Dharmabiksham :* I demand a division Sir.

The House then devided

Ayes: 42; Noes. 112

The motion was negatived.

*Demand No XVI-Mines & Archaeology-Rs. 3,40,000*

*Mr Speaker :* The question is:

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

ఏలేశ్వరం వద్ద త్రవ్వకాలు ఎంత చురుకుగా జరుగుచున్నవో తెలుసుకోవడానికి, వాటిని త్వరలో పూర్తి చేయించవలసినదిగా కోరడానికి

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

తెలంగాణాలో వలెనే ఆంధ్రప్రాంతంలో కూడ పురాతన శా[illegible] ఏర్పాటు చేయవలెనని కోరుటకు.

The motions were negatived.

*Mr. Speaker*: The question is.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఏర్పాటు చేయబడిన పురాతన శాఖకు కనీసం అక్షరూపాయలైనా విరాళం ప్రత్యేకంగా యివ్వవలెనని కోరుటకు.

The motion was negatived.

*Sri Vavilala Gopalakrishnayya* . I demand a division Sir

The House then divided

Ayes· 42; Noes: 113

The motion was negatived.

*Mr. Speaker* The question is:

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology etc. by Rs. 100/-

శిల్పకారకులకు వారి వృత్తికి ఆర్థిక సహాయం ప్రభుత్వం చేయడంలో అశ్రద్ధ చూపినందులకు

The motion was negatived.

*Mr. Speaker*: The question is

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs 100/-

For not providing Manganese Welfare Committee in our State.

The motion was negatived.

*Mr. Speaker*: The question is.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

ఇనుపరాయి, మైకా మొదలగు ముడిపదార్థములపైన, సిమెంటురాయి పైన వసూలు చేస్తున్న సీనియరేజిఫీజు వలె టన్నుకు యింత అని సీనియరేజిఫీజు వసూలు చేసి ప్రభుత్వ ఆదాయాన్ని పెంచుటకు పూనుకోనందులకు.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology by Rs. 100/-

ఆంధ్రప్రదేశ్‌లో విరివిగా లభ్యమగుచున్న ఇనుపరాయి ప్రదేశాలలో ఐరన్ ఫౌండ్రీని స్థాపించుటకు ప్రభుత్వం పూనుకోనందులకు.

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology by Rs 100/-

నాగార్జునకొండ, అమరావతి, సాలిహుండం, జగ్గయ్యపేట తదితర ప్రదేశాలలో లభించిన స్తూపములనన్నిటిని కలిపి విజయపురిపెద్ద ఒక కేంద్ర మ్యూజియమును స్థాపించుటకు ప్రభుత్వం పూనుకోనందుకు

The motions were negatived

*Mr Speaker* The question is ·

To reduce the allotment of Rs 3,40,000 for Mines and Archaeology etc by Re 1/-

To discuss about the delay in Mines Department to grant land for the purpose of opening new mines

The motion was negatived

*Mr. Speaker* : The question is.

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archacology etc. by Rs 100/-

కొండాపురము తాలూకా సంగారెడ్డిలోగల పురాతన వస్తుఖండాలను త్రవ్వుటకై ప్రయత్నించనందులకు.

To reduce the allotment of Rs. 3,40,000/-for Mines and Archaeology etc. by Rs. 100/-

పురాతనవస్తుఖండాలుగల ముఖ్యప్రదేశములకు వెళ్ళుటకు రోడ్డు సౌకర్యములు కలిగించలేనందులకు

To reduce the allotment of Rs 3,40,000/- for Mines and Archaeology etc. by Rs 100/-

దేశములో ఖనిజ సంపత్తిని కనిపెట్టి వాటిని తీయుటకై యత్నించనందులకు

To reduce the allotment of Rs. 3,40,000/- for Mines and Archaeology etc, by Rs. 100/-

ప్రభుత్వ విధానమును విమర్శించుటకు.

The motions were negatived.

*Mr Speaker* : The Question is

"That the Government be granted a sum not exceeding Rs 12,03,62,000 under Demand No XVII-Education "

The motion was adopted

*Mr Speaker* · The Question is

"That the Government be granted a sum not exceeding Rs 3,40,000 under Demand No XVI-Mines and Archaeology etc "

The motion was adopted

The House then adjourned till Half past Eight of the Clock on Wednesday, the 26th March, 1958



